# ఆర్కాటు సోదరులు

రచన :

డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ



ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

ARCŌT SŌDARULU, biographies of Dr. A Ramaswami Mudaliar and Dr. A. Lakshmanaswami Mudaliar, the famous twins of South India, by Dr. C.R. SARMA.

---

**తెలుగు విశ్వవిద్యాలయం,**
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 1988

ప్రతులు : 1,000

**వెల : రూ. 10/-**

ముఖచిత్రం : **శ్రీ వేదాంతకుమార్**

ప్రతులకు :
**తెలుగు విశ్వవిద్యాలయం,**
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**
3-5-850, హైదర్‌గూడ,
హైదరాబాదు - 500 029.

# ప్రకాశక విజ్ఞప్తి

తరతరాల చరిత్ర, సంస్కృతి గల తెలుగుజాతి తన ప్రాచీనతను చాటుకొని మురిసిపోవడమే కాదు, ప్రపంచస్థాయిలో పలురంగాలలో విశిష్టమైన సేవలందించిన లబ్ధప్రతిష్ఠుల నెందరినో అందించింది అందుకు తెలుగువారంతా సగర్వంగా తలెత్తుకోవడమే కాదు, తమ కీర్తిని శిఖరాయమానంగా చాటుకోవడానికి వీలుకల్పించింది.

తెలుగు వెలుగులను నేల నాలుగు చెరగుల విస్తరింపజేసిన తెలుగు మహనీయులెందరో ఉన్నారు. అటువంటి వారిలో ఆనాటి వాగ్గేయకారుడు త్యాగయ్య, ఈనాటి విశ్వవిజ్ఞాని, మహావేదాంతి సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి వారు ఉన్నారు. అదే విధంగా పలురంగాలలో విశేషమైన కృషి జరిపి యావత్ ప్రపంచ దృష్టిని తమ వైపు ఆకర్షింప జేసుకొన్న విద్యావేత్తలు, మహామేధావులు ఆర్కాటు సోదరులు. కవలలైన వీరు రామస్వామి మొదలియార్, లక్ష్మణస్వామి మొదలియార్ పేర్లతో ఆర్కాట్ సోదరులుగా గుర్తింపు పొందారు. వీరు కర్నూలులో జన్మించి అంచెలంచెలుగా దేశవ్యాప్తంగా పరిక్రమించి గణనీయమైన పేరు గడించారు. అన్ని తరాలవారు స్మరించుకోవలసిన వీరిని గురించి ఈ తరం వారికి అంతగా తెలియకపోవచ్చు. అందుకే ఆ కవలల జీవితసంగ్రహాన్ని ఈ లఘు గ్రంధ రూపంలో అందించాలని సంకల్పించి ఈ ప్రయత్నాన్ని చేశాము.

డాక్టర్ చల్లారాధాకృష్ణశర్మగారు ఈ లఘుగ్రంథాన్ని రచించారు అయితే ఈ సోదరులగురించి వెలుగులోకిరాని మరికొన్ని అపూరూప అంశాలను శ్రీ హీరాలాల్ గారు తమ వ్యాసంలో వెలిబుచ్చారు. వాటిని కూడా పాఠకులకు అందించాలనే సదుద్దేశంతో వారి వ్యాసాన్ని కూడా ఈ గ్రంథం చివర అనుబంధంగా చేర్చబడమయినది. ఈ ఇద్దరకూ మా ధన్యవాదాలు. కర్నూలు మునిసిపల్ ఉన్నత పాఠశాలా భవనం ఛాయాచిత్రాన్నీ, ఆనాటి ప్రధానోపాధ్యాయులు శ్రీ రఘునాథా

చారిగారి ఛాయాచిత్రాన్ని మాకందజేసిన శ్రీ ప్రతాపరెడ్డిగారికీ, ఈ ఉద్యమంలో మాతో సహకరించిన శ్రీ జంపాల శివయ్య ప్రభృతులకూ హార్దికమైన అభినందనలు.

ఈ గ్రంథం పరితలకు ఆర్కాట్ సోదరుల జీవితవిశేషాలను గూర్చి తెలియ జెప్పడమే గాక, ఈతరంవారికి ఒక స్ఫూర్తిని కలిగించగలదని మేము నమ్ముతున్నాం. అందుకే మా ఈ ప్రయత్నం. దీనిని సహృదయులు హర్షిస్తారని ఆశిస్తున్నాము.

ఆర్కాటు సోదరుల
శతజయంతి దినం,
14-10-1988,
హైదరాబాదు-500 004,

ప్రకాశకులు
తెలుగు విశ్వవిద్యాలయం

# మనవి మాటలు

తెలుగు విశ్వవిద్యాలయం కులపతులూ, ఆత్మీయులూ అయిన ఆచార్య తూమాటి దొణప్పగారు 1987 అక్టోబరులో నాకు ఒక లేఖ వ్రాస్తూ అందులో ఇలా పేర్కొన్నారు

"1987 అక్టోబరు 14 ఆర్కాటు సోదరులు-శ్రీరామస్వామి మొదలియార్, శ్రీలక్ష్మణస్వామి మొదలియార్‌ల శతజయంతి దినం. 1887 అక్టోబర్ 14 న కర్నూలు పట్టణంలో శ్రీమతి సిద్దమ్మ, కుప్పుస్వామి దంపతులకు కవలలుగా జన్మించి, అన్న దొరస్వామి ఆలన పాలనలలో పెరిగి, మెట్రిక్‌దాకా కర్నూలు లోనే చదువులు సాగించి, ఆయా రంగాలలో అంతర్జాతీయఖ్యాతిని సంపాదించిన ఈ అపూర్వ సహోదరులను గూర్చి తెలుగువారు మరచిపోయారా? అనిపిస్తుంది. మరవలేదనిపించాలి మనం."

'మరవలేదనిపించాలి మనం' అనే మాటలు నా మనస్సులో మంత్రాక్షరాలుగా మారుమ్రోగాయి నిజమే. కర్నూలులో పుట్టి పెరిగి, మదరాసులో చదువు సంధ్యలు సాగించి, సర్వ ప్రపంచాన్నే తమ జీవితరంగంగా మలుచుకున్న ఆ అపూర్వ సహోదరులు ఆర్కాటు మొదలియార్లను గురించి ఒక చిన్న పుస్తకమైనా వ్రాయడం సమంజస మనిపించింది నాకు.

మదరాసు, సర్ త్యాగరాయ కళాశాలలో (పిట్టి త్యాగరాయ సెట్టిగారి పేరు మీద వ్యవహృత మవుతున్న కళాశాల), నేను 1951 - 57 సంవత్సరాల మధ్య తెలుగుశాఖలో పనిచేసే రోజులలో డా. సర్. లక్ష్మణస్వామి మొదలియారుని దర్శించడమేగాక, ఆయన ప్రసంగాలుకూడా వినే సదవకాశాలు కలిగాయి. ప్రసన్న గంభీరులైన లక్ష్మణస్వామి మొదలియారు వాగమృతం ఆస్వాదించి నేను ఎంతగానో మురిసి పోయాను ఆయన జరీ అంచు తలపాగ, ఫాలభాగాన ప్రతిభాసించే శ్రీ చూర్ణం నా మనః ఫలకం మీద ఆనాళ్ళలోనే చెరగని ముద్రవేశాయి. ఆ తర్వాత ఎప్పుడో ఒకసారి డా. సర్. రామస్వామి మొదలియారుని దూరం

నుంచి దర్శించే అవకాశం కలిగింది. నిజానికి ఆ మహనీయులిద్దరూ భారతమాత కన్న పుత్రరత్నాలు! ఆ రత్నద్వయం గురించి రచనచేసే సదవకాశం కలగడం నా భాగ్యవిశేషం. ఈ సదవకాశాన్ని నాకు కలిగించిన ఆత్మీయులు ఆచార్య ద్రోణప్పగారికి నా కృతజ్ఞతను వినయపూర్వకంగా తెలుపుకొంటున్నాను.

ఆ తర్వాత - అంటే 1987 డిసెంబరులో తెలుగు విశ్వవిద్యాలయం కుల సచివులైన మిత్రులు శ్రీ టి.డి. ప్రసాదరావుగారు ఆర్కాటు సోదరులను గురించి పుస్తకం వ్రాయవలసిందిగా కోరుతూ ఉత్తరం వ్రాశారు. ఆ అధికారిక లేఖ నాలో చురుకుదనం కలిగించింది. వెంటనే విషయ సేకరణకు పూనుకున్నాను. మిత్రుల్ని సంప్రదించడం ప్రారంభించాను. మా విశ్వవిద్యాలయం గ్రంథాలయాధికారి శ్రీ యస్. జ్ఞానముత్తుగారు ఆర్కాటు సోదరుల 81-వ జన్మదినోత్సవ సందర్భాన (1967 అక్టోబరు 14) వారికి సమర్పించబడిన అభినందన సంచికను గుర్తుచేయడమేకాక ఆంగ్లంలో సర్వాంగసుందరంగా ప్రచురితమైన ఆ గ్రంథాన్ని నాకు ఇచ్చారు. ఏ తద్ గ్రంథాన్ని 'సర్వకళా భూషణం' శ్రీ సామినాథ సుబ్రహ్మణ్యం గారు (స సు. మణి అయ్యర్) సమర్థంగా సంకలించి ప్రచురించారు ఈ అభినందన సంచికలో అందాలు దిద్దుకున్న ప్రముఖుల వ్యాసాలు, సందేశాలు నాకు బహుధా ఉపకరించాయి. ఆయా వ్యాసకర్తలకు ప్రముఖులకు కృతజ్ఞుణ్ణి.

నా కృషిని అభినందిస్తూ మిత్రులు శ్రీ గాంధీ కణ్ణదాసన్‌గారు తమిళనాడు ప్రభుత్వం వారు ప్రచురించిన 16-10-1987 తేదీ గల 'తమిళ రసు' అనే పత్రిక పంపారు. అందులో ప్రముఖ విద్యావేత్తలు, నా శ్రేయోభిలాషులు అయిన డా॥ ఎన్. డి. సుందర వడివేలు గారి అమూల్య వ్యాసం ప్రముఖ స్థానం వహించింది.

'ఇణై యట్ర ఇరట్టై యరగళ్' (సాటిలేని కవలలు) అనే ఆ వ్యాసంలో సుందర వడివేలుగారు ఆర్కాటు సోదరులకు సంబంధించిన చక్కని చిక్కని విషయాలు ఎన్నో ఉదాహరించారు. వారికి కూడా నేను కృతజ్ఞుణ్ణి.

ఉన్న వ్యవధిలో లభించిన విషయాలను ఒకటికి రెండుసార్లు చదివి రచనకు ఉపక్రమించాను ఆర్కాటు సోదరుల మూర్తిమత్వాన్ని యథాశక్తిని చిత్రించడానికి ప్రయత్నించాను. నా కృషి సోదరాంధ్రుల్ని అలరించగలదని నమ్ముతున్నాను.

ఒక సద్గ్రంథ రచనకు నన్ను ప్రోత్సహించిన తెలుగు విశ్వవిద్యాలయం కులపతులకు, కుల సచివులకు మరొక తూరి నా కృతజ్ఞతను తెలుపుకొంటున్నాను. రచనావసరంగా సూచనలు చేసిన మిత్రులకు, సాఫు ప్రతిని తయారు చేసిన శ్రీ మాడభూషి సంపత్ కుమార్, శ్రీమతి ఎన్. సులోచన, కుమారి బి. మాధురి గార్లకు కృతజ్ఞుణ్ణి

మధుర,
5-3-1988

బుధజన విధేయుడు,
చల్లా రాధాకృష్ణ శర్మ

# విషయసూచిక

# అపూర్వ సహోదరులు

అది సర్వజిన్నామ సంవత్సరం (1887). ఆ యేడు అక్టోబరు 14 న కర్నూలులో ఒక ఉన్నతోద్యోగి యింట్లో కవల పిల్లలు కళ్ళు తెరిచారు. కవల పిల్లలు కనుక మగపిల్లలైతే, వారిని రామలక్ష్మణులని వ్యవహరించడం హైందవ సంప్రదాయం ఇది తరతరాలుగా వస్తున్న సంప్రదాయం తదనుగుణంగా మొదట పుట్టిన పిల్లవాడికి రామస్వామి అనీ, ఆ తరువాత - 47 నిమిషాల తర్వాత - పుట్టిన పిల్లవాడికి లక్ష్మణస్వామి అనీ నామకరణం చేశారు. పెరిగి పెద్దవారయిన తరువాత ఆ కవల పిల్లలు జగద్విఖ్యాత ఆర్కాటు సహోదరులుగా అందరి మన్ననలు పొందారు

## జననీ జనకులు :

ఆ కవల పిల్లల్ని కన్నతల్లి సిద్ధమ్మ. ఆమె భర్తృసేవా పరాయణ. సచ్ఛీల. భగవద్భక్తి ఆమెకు పెన్నతో అలవడిన విద్య.

ఆమె భర్త కుప్పుస్వామి మొదలియారు. ఆయన పూర్వులు తమిళనాడు లోని ఉత్తరార్కాడు జిల్లాకి చెందిన వారు. ఆయన చదువు సంధ్యలు ఆర్కాటులో కొనసాగాయి. తర్వాత ఆయన రెవిన్యూ శాఖలో చేరి ఉన్నతోద్యోగి అయ్యారు. ఉద్యోగరీత్యా ఆయన కర్నూలులో నివసించే వారు. ఆ నాళ్ళలో కర్నూలు అంత పెద్ద ఊరు కాదు. ఆయన క్రమశిక్షణకు ప్రాధాన్యమిచ్చే వారు. పైగా సచ్ఛీలుడు. అందువల్ల జిల్లాలోనే సత్యసంధుడైన ఉద్యోగిగా ఆయన పేరు పెంపులు గడించ డంలో ఆశ్చర్యం అణుమాత్రమైనా లేదు. ఆయన సదాచార సంపన్నుడు. వైష్ణవమత ధర్మాలను శ్రద్ధాసక్తులతో పాటించేవారు.

ఆ దంపతులకు రామచంద్రుడు అభిమాన దైవం. కనుక వారు తమ పిల్లలను రామలక్ష్మణులని పేర్లు పెట్టుకోవడంలో వింత లేదు. వాల్మీకి రామా యణం లోని రాముడు లక్ష్మణుని కంటె మిన్నగా కనిపిస్తాడు. రాముని మరో

ప్రాణంగా గోచరిస్తాడు రామానుజుడు. కాని యీ రామ లక్ష్మణులు చదువు సంధ్యలలో, పేరు ప్రఖ్యాతులలో - అన్నిటిలోనూ - సరిసమానులుగా కనిపిస్తారు. ఇది ఒక అపూర్వమైన అంశం!

## తల్లి మరణం :

తన పిల్లలు తప్పటడుగులు వేస్తూ, తొక్కు పలుకులు పలుకుతున్నప్పుడు సిద్ధమ్మ పుత్రోత్సాహం చెంది వుంటుంది వారి విద్యా బుద్ధుల్ని గాని, పేరు పెంపుల్ని గాని కళ్ళార చూసి ఆనందోత్సాహాలు చెందే అదృష్టానికి ఆమె నోచుకోలేదు. పిల్లలకు శైశవావస్థ దాటక ముందే - వారు రెండేళ్ళ పిల్లలుగా ఉన్నప్పుడే - ఆ చల్లని తల్లి కాలధర్మం చెందింది.

తమిళ వేదకర్త అయిన తిరువళ్ళువర్ అంటాడు గదా :

'కనిన యప్పటి కంటె జనని హర్షించు,
తన కుమారుడు ఘనుడని విన్న పిదప'.

పుత్రుల పేరు ప్రతిష్ఠలు చూసి ఆనందించే భాగ్యం ఆ తల్లికి లేనట్లే, ఆ పిల్లలకు తల్లిప్రేమ కరవయింది. మాతృప్రేమను మించిన వస్తువు మరొకటి లేదు. తదాదిగా పిల్లల్ని పోషించి పెద్దచేసే భారం తండ్రి మీద పడింది. ఆయన ఆలన పాలనలలో రామ లక్ష్మణులు పెరగసాగారు. తల్లి అయినా, తండ్రి అయినా ఆయనే అయ్యాడు

## తండ్రి శిక్షణ :

పండిత పరిషత్తులో ప్రథమ తాంబూలం పొందేలా కన్నకుమారుణ్ణి తండ్రి తీర్చి దిద్దాలని తిరువళ్ళువర్ అభిప్రాయం తండ్రి తనయుడికి చేసే మేలు, అదే. శిష్టాచార సంపన్నుడూ, ఋజు ప్రవర్తన కలవాడూ అయిన కుప్పుస్వామి మొదలియారు ఇచ్చిన శిక్షణ ఎలాంటిదో కాని, ఆ కవలలు తరువాతి కాలంలో జాతీయ అంతర్జాతీయ సభలలో పాల్గొని అందరిచేత సెబాసని పించుకున్నారు. ప్రాచ్య పాశ్చాత్య ప్రముఖులు వారిని బహుధా ప్రశంసించారు.

'ఇద్దరు సోదరులు, కవల పిల్లలైనా, సరిసమానంగా పేరు ప్రఖ్యాతులు సముపార్జించడం సాధారణంగా జరగదు. ఈ అపూర్వ సంఘటన ఆర్కాటు సహోదరుల విషయంలో జరిగింది' అని ప్రముఖ రాజనీతిజ్ఞుడూ విద్యావేత్త అయిన సర్ సి పి రామస్వామి అయ్యరు పేర్కొనగా, లక్ష్మణస్వామి మొదలియారుకి గౌరవ యల్. యల్. డి (డాక్టర్ ఆఫ్ లాస్) డిగ్రీ ప్రదానం చేయబడినప్పుడు లండన్ విశ్వవిద్యాలయం పబ్లిక్ ఆరేటర్ తన ప్రశంసా పత్రంలో ఇలా పేర్కొన్నాడు : ' ....తల్లిదండ్రులు లేని యీ పిల్లలు తమ స్వయం కృషివల్ల తమ వృత్తులకు (వైద్య, న్యాయశాస్త్రాలు) అత్యుత్తమ ప్రతినిధులుగా కీర్తి నార్జించ గలిగారు....'

## కర్నూలు పాఠశాలలో చదువు సంధ్యలు :

కర్నూలు పురపాలకోన్నత పాఠశాలలో (మునిసిపల్ హైస్కూలు) రామలక్ష్మణులు 1895 నుంచి 1903 దాక - అనగా ఎనిమిదేళ్ళు విద్యాభ్యాసం చేశారు. చదువుకునే రోజుల్లో వాళ్ళు ఎక్కిన చెట్లు చేమలు, ఆడిన ఆటలు, చదివిన పుస్తకాలు, పాల్గొన్న వాగ్వాదాలు మొదలైన వాటిని గురించి మొన మొన్నటి దాక ఆ ఊరి వృద్ధులు చెప్పుకొనే వారు పెద్దయిన తర్వాత వాళ్ళు సాధించిన ఘన విజయాలు తలచుకుని వారు మురిసిపోయేవారు. మొదలియారు సోదరులంటే కర్నూలు పౌరులకు అంత అభిమానం! నిజమే మరి. తమ ఊళ్ళో పుట్టి, కొంతకాలం అక్కడే పెరిగి, ఆ తర్వాత 'ఇంతింతై వటుడింతయై ..' అన్నట్లుగా పెరిగి, చివరికి త్రివిక్రములై నారంటే కర్నూలు పౌరులకు - తెలుగు వారికి అది గర్వకారణం కాదా?

ఆ రోజుల్లో శ్రీ కె ఆర్ రఘునాథాచార్ అనే ప్రధానోపాధ్యాయుడు ఉండేవాడు ఆయన పండితుడే కాక ఉత్తముడు కూడా. ఆయన వద్ద రామలక్ష్మణులు విద్యాభ్యాసం చేశారు చదువు సంధ్యలతో పాటు క్రమబద్ధమైన జీవితం గడపడం నేర్చుకున్నారు దైవ ప్రార్థన, చదువు సంధ్యలు, ఆటపాటలు - ఇలా ఒక క్రమపద్ధతిలో వారి విద్యార్థి జీవితం నడవసాగింది. ఆ విధంగా ఆర్కాటు సోదరుల క్రమబద్ధమైన జీవితానికి కర్నూలు ఉన్నత పాఠశాల గట్టిపునాది సిందివే

రఘునాథాచార్ గారు, ఇతర ఉపాధ్యాయులు రామ లక్ష్మణుల విద్యా బుద్ధులు చూసి ఎంతో మెచ్చుకునే వారు. వాళ్ళిద్దరూ పేరు ప్రతిష్ఠలు ఆర్జిస్తారనీ, వారివల్ల కర్నూలు మునిసిపల్ హైస్కూలు ప్రతిష్ఠ ఇనుమడిస్తుందనీ ప్రధానో పాధ్యాయుడు సహర్షంగా పేర్కొన్నప్పుడు, కుప్పుస్వామి మొదలియారు గర్వపడలేదు. పై పెచ్చు 'అంతా భగవంతుని దయ' అని సమాధానం చెప్పా డట వినయంగా. భగవంతు డంటే ఆయనకి అంత నమ్మకం ఆయన కూడా తన పుత్రుల ఔన్నత్యాన్ని చూడలేక పోయాడు పంట చేతికి వస్తున్న సమ యంలో ఆయన దైవికం చెందారు.

పబ్లిక్ పరీక్షలకు ఇంకా పదిహేను రోజులుండనగా, కుప్పుస్వామి మొదలి యారు 1902 లో కాలధర్మం చెందాడు. అప్పుడాయనకి యాభై రెండేళ్ళు. కన్న తండ్రి కన్నుమూసిన దుఃఖం ఒక వంక; శరవేగంగా సమీపిస్తున్న పబ్లిక్ పరీక్షలు ఒక వంక. మెట్రిక్యులేషన్ పరీక్షలు బాగా వ్రాశారు. మంచి మార్కు లతో కృతార్థులయ్యారు రామ లక్ష్మణులు.

## మదరాసు నివాసం :

ఆ మరుసటి సంవత్సరం రామలక్ష్మణులు ఉన్నత విద్యాభ్యాసం నిమిత్తం చెన్నపట్టణం చేరుకున్నారు. అక్కడ వాళ్ళ జ్యేష్ఠ సోదరుడు దొరస్వామి మొదలి యారు, మేనమామ దామోదర మొదలియారు, ఇంకా మరికొందరు బంధువు లుండే వారు.

పితృ మరణానంతరం వారికి దొరస్వామి మొదలియారు సంరక్షకు డయ్యాడు

దామోదర్ మొదలియారు చెంగల్పట్టు జిల్లాలో తహసీల్దారుగా ఉద్యోగం చేసి మదరాసులో స్థిరపడ్డాడు. ఆయన పరశువాకంలో ఆరుముప్ప మొదలి వీధిలో నివసించేవాడు. ఆ సోదరులు ఆయన యింట ఉండసాగారు



ఆర్కాట్ సోదరులు విద్యాభ్యాసం చేసిన మునిసిపల్ హైస్కూల్, కర్నూలు



కర్నూలు మునిసిపల్ హైస్కూల్ హెడ్మాస్టరు

శ్రీ కె. రఘునాథాచారి

( 1892 - 1908 )



ఆర్కాట్ సోదరుల తండ్రిగారైన శ్రీ ఎ. కుప్పుస్వామి మొదలియార్ తహశీల్దారుగా ఉన్నప్పుడు కర్నూలులో వేయించిన నీటి కుళాయి.

## అపూర్వ సోదరులు :

సాధారణంగా కవల పిల్లలు అనురూపులై వుంటారు వాళ్ళని పోల్చు కోవడం కొంచెం యిబ్బందిగానే ఉంటుంది. ఆకృతిలో సమాన లక్షణాలు గోచ రించినా, విద్యాబుద్ధులు, పేరు ప్రతిష్ఠలు, విశిష్ట గౌరవాలు మొదలైన వాటిలో కూడా సరి సమానత్వం పొంది ఆ సోదరులు ప్రపంచ మహాపురుషులుగా వన్నె కెక్కడం అపూర్వ మనక తప్పదు. ఈ అపూర్వ సంఘటన మన రామలక్ష్మణుల జీవితాలలో కొట్ట వచ్చినట్లు కనిపిస్తుంది.

తమ జననీ జనకులవలె, రామస్వామి మొదలియారూ, లక్ష్మణస్వామి మొదలియారూ దైవభక్తులు. ముఖ్యంగా శ్రీ వేంకటేశ్వరుని భక్తులు. వారిది పాశ్చాత్య వేషధారణమే అయినా, ఎన్నో అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొన్నా వారి విశాల ఫాలభాగాల శ్రీ చూర్ణం ప్రతిభాసించేది. అలాగే జరీ తలపాగలు కూడా గోచరించేవి. వైస్రాయి కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా పనిచేసిన యం. యస్ అణేగారు ఒకసారి తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి సన్నిధిని ఉండగా, స్వామికి హారతి యిస్తున్న అర్చకుడు రామస్వామి మొదలి యారుగారి పేరు చెప్పి భగవదనుగ్రహం ఆయనకి పుష్కలంగా లభించాలని అన్నాడట. అది చూసి అణే గారు ముగ్ధులయ్యారు. లక్ష్మణస్వామి మొదలి యారు దైనందిన కార్యక్రమం ఆకాశవాణి ఉదయం ప్రసారంచేసే భక్తి గీతాలు శ్రద్ధగా ఆలకించడంతో ప్రారంభ మయ్యేది. ఆ తర్వాతనే ఆయన ఇతర కార్య క్రమాలలో పాల్గొనేవారు.

వాళ్ళిద్దరూ ఆంగ్లంలో మహావక్తలు; మీరు మిగిలిన విద్వాంసులు. ప్రముఖ వక్తలుగా చిరకీర్తి నార్జించిన శ్రీయుతులు వి యస్ శ్రీనివాసశాస్త్రి, యస్ సత్య మూర్తి, సి పి రామస్వామి అయ్యరు, కట్టమంచి రామలింగారెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రభృతుల కోవకు చెందినవారు రామస్వామి మొదలియారు గుండెకు హత్తుకునేలా శక్తివంతంగా భాషించడంలో అందెవేసిన చేయిగా పేరు పెంపులు గడించారు ఆయన ఉపన్యాసాలు వినేందుకు ఆనాటి విద్యార్థిలోకం తహతహ లాడేది లక్ష్మణస్వామి మొదలియారుది ప్రశాంత గంభీర ప్రసంగం. వారి ప్రసంగాలలో ఆంగ్ల మహా కవులైన మిల్టన్, షేక్స్పియర్, టెన్నిసన్, బైరన్

ప్రభృతుల సూక్తులు, హైందవ గ్రీకు పురాణ కథలు మొదలైనవి వినిపించేవి. వారి ఇంగ్లీషుని చూసి ఇంగ్లీషువారే మెచ్చుకునేవారు. అంత పాండిత్యం గడించారు ఆంగ్ల భాషా సాహిత్యాలలో.

ఇద్దరూ మేధావులు. ప్రపంచ ప్రఖ్యాతి గన్న మహనీయులు ఎన్నో జాతీయ, అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొన్నారు. లక్ష్మణస్వామి మొదలియారు ఎనభై అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొన్న ప్రతిభాసంపన్నుడు. ప్రపంచ ఆరోగ్య సంస్థతో (W H.O) సన్నిహిత సంబంధం కలిగిన వారు లండన్‌లో 1958 లో జరిగిన ప్రపంచ వైద్య విద్యా మహాసభకు ఆయన ఉపాధ్యక్షులు. అలాగే యునెస్కోతో కూడా ఆయనకి సన్నిహిత సంబంధం ఉండేది. ఆ ప్రపంచ సమితి సమావేశాలలో ఇద్దరూ పాల్గొన్నారు. 1945 లో ఐక్యరాజ్య సమితి వెలుగులోకి వచ్చింది. దానికి సంబంధించిన తొలి సమావేశంలో పాల్గొన్న భారతీయ ప్రతినిధివర్గానికి రామస్వామి మొదలియారు నాయకులు. ఆ సమావేశంలో ఆయన చేసిన గంభీరోపన్యాసం విస్మరించరానిది. ఐక్య రాజ్య సమితి లక్ష్యాలను (యు యన్. చార్టర్) రూపొందించిన ప్రముఖులలో ఆయన ఒకరు. అంతేకాదు. ఐక్యరాజ్య సమితికి చెందిన ఆర్థిక సాంఘిక మండలికి ఆయన మొదటి అధ్యక్షునిగా ఎన్నుకోబడ్డారు. ఆ తరువాతి నాలుగు సమావేశాలకు ఆయనే అధ్యక్షునిగా వ్యవహరించారు. ఈ విశిష్ట గౌరవం పొందిన భారతీయుడు మరొకడు లేడు; ఆసియాలోనే లేడనడం సత్య సన్నిహితం రామస్వామి మొదలియారు అంత ప్రతిభా సంపన్నుడు.

మొదలియారు సోదరులు తమ తమ రంగాలలోనే (న్యాయ, వైద్యాలు) కాక విద్యా రంగంలో కూడా గరీయః ప్రతిభులని పేరు గడించారు వారిద్దరికీ ప్రాచ్య పాశ్చాత్య విశ్వవిద్యాలయాలు ఎన్నో గౌరవ డిగ్రీలు ప్రసాదించాయి. ఆక్స్‌ఫర్డ్, దర్హామ్, ఉస్మానియా, మైసూరు, మదరాసు మొదలైన విశ్వవిద్యాలయాలు రామస్వామి మొదలియారుకి డి సి.యల్. (డాక్టర్ ఆఫ్ సివిల్ లాస్), యల్ యల్ డి. మొదలైన డిగ్రీలు ఇచ్చి తమను తాము సత్కరించు కున్నాయి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదవబడిన ప్రశంసాపత్రంలోని యీ కింది వాక్యాలు పరిశీలించ దగినవి

'Most accomplished of men and most eloquent of orators, in the field of Economics, you bring from the East the light of your wisdom to a world lost in darkness'.

ఇక లక్ష్మణస్వామి మొదలియారుని సత్కరించని విశ్వవిద్యాలయం లేదన్నా అతిశయోక్తి కాదు ఇంచుమించు అన్ని ప్రముఖ విశ్వవిద్యాలయాలు ఆయనకి గౌరవ డిగ్రీలు ప్రదానం చేశాయి. డి సి యల్. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం; యల్.యల్.డి - సిలోన్, గ్లాస్గో, మెక్‌గిల్ (కెనడా), మైసూరు, హాంగ్‌కాంగ్, లండన్, మదురై విశ్వవిద్యాలయాలు.

డి.యస్సి.— ఆంధ్ర, లక్నో, పాట్నా, ఉత్కళ్, కలకత్తా, మదరాసు విశ్వవిద్యాలయాలు.

డి లిట్.— అణ్ణామలై విశ్వవిద్యాలయం.

ఇరవైయేడు సంవత్సరాలు (20-8-1942 నుంచి 31-7-1969 దాక) మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా వ్యవహరించి లక్ష్మణస్వామి మొదలియారు ప్రపంచ రికార్డు స్థాపించారని నిస్సంశయంగా పేర్కొనవచ్చు. రామస్వామి మొదలియారు కూడా తిరువాంకూరు (కేరళ) విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా ఎనిమిదేండ్లు (1951-1959) వ్యవహరించి, ఆ విశ్వవిద్యాలయాభివృద్ధికి కృషి చేశారు.

ఈ విధంగా విశ్వవిద్యాలయాల నుంచి గౌరవ డిగ్రీలు పొందడమే కాక, ఆర్కాటు సోదరులు బ్రిటిషు వారి కాలంలోనూ, స్వతంత్ర భారతం ఆవిర్భవించిన తర్వాతను ఎన్నో విశిష్టగౌరవాలు పొందారు. బ్రిటిషువారి అత్యున్నతమైన 'సర్' బిరుదును ఇద్దరూ పొందారు. 1937 లో రామస్వామి మొదలియారు సర్ బిరుదును పొంది, 1942 లో కె సి.ఐ.ఇ అయ్యారు ఆయన మైసూరు దివానుగా ఉన్న రోజుల్లో (1946-1949), ఆయన్ని మహారాజావారు 'రాజమంత్ర చింతామణి' అనే బిరుదుతో సత్కరించారు ఆయన పద్మవిభూషణులు కూడా లక్ష్మణస్వామి మొదలియారుకి 1945 లో 'సర్' బిరుదు వచ్చింది అంతకుముందు ఆయన్ని రావు బహదూర్, దివాన్ బహదూర్ బిరుదులతో అప్పటి ఇండియా

ప్రభుత్వం సత్కరించింది. స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం ఆయనకి పద్మభూషణ్ (1954), పద్మవిభూషణ్ (1963) బిరుదులు ప్రదానం చేసింది

జీవితంలో సమానమైన గౌరవ ప్రపత్తులు గడించిన ఆర్కాటు సోదరుల ఆకృతే కాక వేషధారణ కూడా ఒకేవిధంగా ఉండేది ఇద్దరూ ఒకే రంగు; ఒకే ఎత్తు; ఒకే లావు ఇద్దరిదీ జరీ అంచు పాగాలే. ఇద్దరూ ఇంగ్లీషు క్షుణ్ణంగా నేర్చిన వారే, అయినా ఇద్దరిదీ ప్రాచీనాచార వ్యవహారాలే. ఇద్దరూ భారతీయ సంస్కృతిని గౌరవించిన వారే. ఇద్దరూ తోడివారికి యథాశక్తిని సేవచేసిన వారే. సమష్టి హిందూ కుటుంబం కుటుంబంలో సుఖశాంతులకు ఎలా దోహదం చేస్తుందో ఆ అన్నదమ్ములు నిరూపించారు. పోలికలు ఒకే విధంగా ఉండడం వల్ల వారు ఫలానా అని వెంటనే గుర్తుపట్టడం కష్టంగా ఉండేది. కళాశాల విద్యార్థులుగా ఉన్న రోజుల్లో వారిద్దరికీ మీసం ఉండేది ఒకసారి మదరాసు క్రైస్తవ కళాశాలలోని ఒక ఆచార్యుడు రామస్వామి మొదలియారుని చూసి, "నువ్వు నువ్వా లేక నీ సోదరుడివా?" (**Are you, you or your brother?**) అని అడిగాడట. ఆ అన్నదమ్ముల్ని చూసి సమావేశాలలో ప్రముఖులే కాక బంధువులు సైతం కొంచెం తికమక చెందేవారట, గుర్తుపట్టలేక. ఒకసారి యేం జరిగిందంటే·

మదరాసు మెడికల్ కాలేజీకి చెందిన విద్యార్థులు కొందరు విహారయాత్రగా బొంబాయికి బయలుదేరారు విక్టోరియా టెర్మినస్ స్టేషను ప్లాట్‌ఫారం మీద వారు తమ ప్రిన్సిపాలుగారిని చూశారు విద్యార్థుల సంతోషానికి మేరలేదు. వెంటనే వారు ఆయన దగ్గరకు వెళ్ళి తమ ఆనందోత్సాహాలు తెలియజేశారు. అందుకు ఆయన మందహాసం చేస్తూ మీ ఆనందోత్సాహాలను మా తమ్ముడికి తెలియజేస్తానని అన్నారు. అప్పుడా విద్యార్థులు తెలుసుకున్నారు, తాము దర్శించింది తమ ప్రిన్సిపాలుగారు కాదనీ, ఆయన అన్నగారు రామస్వామి మొదలియారుగారనీ! రామస్వామి మొదలియారు చివరిదాకా మీసం ఉంచుకున్నారు. వార్ధక్యం పైబడినకొద్దీ లక్ష్మణస్వామి మొదలియారులో కొంచెం స్థౌల్యం కనిపించింది

## ఆంధ్రాభిమానం :

తెలుగుగడ్డను ప్రభవించిన తమిళులు ఆర్కాటు సహోదరులు వారి బాల్యం కర్నూలులో గడిచింది వారిద్దరూ ఉన్నత పాఠశాలలోనే కాక కళాశాలలో కూడా తెలుగునే రెండవ భాషగా స్వీకరించి చదివారు.

ఆచార్య గంటి జోగి సోమయాజిగారు తమ 'రామచంద్రుని హంపీయాత్ర' (1930) కావ్యాన్ని రామస్వామి మొదలియారుకి గౌరవపురస్సరంగా అంకిత మిచ్చారు

1943 లో లక్ష్మణస్వామి మొదలియారుకి ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డి.యస్సి. డిగ్రీ ఇచ్చింది. అప్పుడు చదవబడిన ప్రశంసా పత్రంలో ఇలా పేర్కొనబడింది :

**"An Andhra by birth and training, who took Telugu as his second language throughout his educational course, he has always evinced a deep interest in the Andhras "**

కట్టమంచి రామలింగారెడ్డి గారు లక్ష్మణస్వామి మొదలియారుకి గల ఆంధ్రాభిమానాన్ని వ్యక్తం చేసిన తీరు ప్రశంసార్హం :

**"As Vicechancellor of the Andhra University, I feel bound to say a special word of praise and gratitude for the manner in which he extended the hospitality of Madras, the Mother University, to the Chemistry classes of Andhra, the Daughter University, when they had to quit Waltair under conditions produced by war."** (14-10-1947)

1953 లో లక్ష్మణస్వామి మొదలియారు కర్నూలు పట్టణానికి వెళ్ళి నప్పుడు తాను చదివిన ఉన్నత పాఠశాలను సందర్శించారు తమ ఉపన్యాసాలలో తమ ప్రధానోపాధ్యాయునికి అధ్యాపకులకూ నివాళు లర్పించారు ఈ విషయా ధికం ఆయనకి గల ఆంధ్రాభిమానాన్ని వ్యక్తం చేస్తున్నది.

కట్టమంచివారు పేర్కొన్నట్టుగా, లక్ష్మణస్వామి మొదలియారు కేవలం ప్రతిభవల్లనే పైకి వచ్చారు; ఇతరుల ఆదరభావం వల్లనో, అదృష్టంవల్లనో, ఈ రెంటినీ మించిన బలవత్తరమైన కుత్సితపు ఆలోచనల వల్లనో ఆయన పైకి రాలేదు కట్టమంచి వారి యీ మాటలు రామస్వామి మొదలియారుకీ వర్తిస్తాయి.

గరీయః ప్రతిభులు, తమ తమ రంగాలలో ఉద్దండులు, మహావక్తలు, మహా మేధావులు, దైవభక్తులూ అయిన ఆర్కాటు సోదరులు చరిత్రకెక్కిన చరితార్థులు. సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు చెప్పినట్లు, 'వారిద్దరూ నిస్సంశయంగా మన దేశానికి గర్వకారణం.' విద్యా వినయ సంపన్నులైన ఆ అపూర్వ సహోదరులకు జేజేలు!

* * *

## రామస్వామి మొదలియారు ఉన్నత విద్యాభ్యాసం :

తమ కుటుంబంలోని పలువురివలె, రామస్వామి, లక్ష్మణస్వామి 1903లో మదరాసు క్రైస్తవ కళాశాలలో యఫ్. యే. (ఫస్ట్ ఆర్ట్స్) తరగతిలో చేరారు. రెండవ భాషగా తెలుగు స్వీకరించారు. ఆ నాళ్ళలో క్రైస్తవ కళాశాల బాగా రద్దీగా ఉండే జార్జిటౌన్‌లో ఉండేది. దానికి దగ్గరలోనే విద్యార్థి వసతి గృహమైన కైత్‌నెస్ హాలు ఉండేది అందులో వారిద్దరూ చేరారు.

ఆ రోజుల్లో క్రైస్తవ కళాశాలలో ఆయా విషయాలలో సుప్రసిద్ధులైన వారు ఆచార్యులుగా ఉండే వారు. కళాశాలాధ్యక్షులుగా డాక్టర్ మిల్లర్ చిరకీర్తి గడించారు ఆ పదవిలో ఆయన అవిచ్ఛిన్నంగా ఇరవై అయిదేళ్ళు ఉన్నారు. కాగా క్రైస్తవ కళాశాలను మిల్లరు కళాశాల అని వ్యవహరించేవారు అభిజ్ఞాన శాకుంతలాను వాదకులలో ఒకరైన రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారి యీ క్రింది పద్యం పరిశీలించదగింది :

'శ్రీయుత మిల్లరు సర్వక
లా యతన సమృద్ధి రంగయ్యశ్రేష్ఠి సఖుం
డై యొప్పు నెవడు సర్వ
జ్ఞాయుత మస్తక కలాపహారి బుధ ధృతిన్.'

మిల్లరు సర్వకళాశాల అని శాస్త్రిగారు పేర్కొన్నారు. ఇది ఆనాటి వ్యవహారమై ఉండవచ్చు

మిల్లరుతో పాటు డాక్టర్ స్కిన్నర్, డాక్టర్ మెస్టన్, డాక్టర్ పిటెన్ డ్రిగ్, డాక్టర్ మెక్ ఫేల్ ప్రభృతులు కూడా ఆ కళాశాలలో ఆచార్యులుగా ఉండే వారు. వారు తమ బోధనా పటిమ వల్లనూ, వైదుష్యంవల్లనూ విద్యార్థి లోకాన్ని ఆకర్షిస్తూ కళాశాలకు పేరు ప్రతిష్ఠలు తెచ్చారు. ఆ ఆచార్యులు రామలక్ష్మణుల్ని తీర్చిదిద్దడానికి తోడ్పడ్డారు

చెన్నపట్టణంలో సాగిన తమ విద్యార్థి జీవితం గురించి ముచ్చటిస్తూ లక్ష్మణస్వామి మొదలియారు ఒకసారి ఇలా పేర్కొన్నారు :

'ఆ రోజుల్లో నా తరానికి చెందిన విద్యార్థులకు కళాశాల, వసతిగృహం, క్రీడా స్థలాలు, ఎటుచూచినా కనుల పండువు చేసే సువిశాలమైన సాగరతీరం- ఇవే ప్రధానమైన ఆకర్షణలుగా ఉండేవి .. విద్యార్థి వసతి గృహంలో నివసించే నావంటి వారికి సంవత్సరానికొకసారి సర్కసు ప్రదర్శనగాని, పార్శీ నాటక కంపెనీవారి నాటకంగాని తిలకించడం ఒక గొప్ప ఆటవిడుపుగా ఉండేది. ధనికులైనా సరే, దరిద్రులైనా సరే, వసతిగృహ యజమాని కల్పించే భోజన సదుపాయాలే అందరికి సరిసమానంగా లభించేవి. రెస్టారెంటులు లేవు. కాఫీ హోటళ్లు లేవు అప్పటికింకా సినిమా వెలుగు చూడలేదు.'

ఆ పరిస్థితులలో వారి ఉన్నత విద్యాభ్యాసం సాగింది. సంగ్రహంగా చెప్పాలంటే చదువు సంధ్యలు, ఆటపాటలు మినహాయిస్తే ఆనాటి విద్యార్థులకు మరో వ్యాపకం ఉండేది కాదు. రామస్వామి, లక్ష్మణస్వామి చదువు సంధ్యలు కాక మరి రెండు విషయాలలో తమ ఆసక్తిని కేంద్రీకరించారు. తీరిక వేళల్లో ఆంగ్ల సాహిత్యార్ణవాన్ని ఆపోశనం పట్టడానికి కృషి చేసేవారు. సహ విద్యార్థుల సహాయంతో వక్తృత్వ కళలో సిద్ధహస్తులు కావడానికి ప్రయత్నించారు. అదృష్టవశాత్తు ఆ నాళ్లలో స్వామి వివేకానందులు అమెరికాలో హిందూ మత సిద్ధాంతాలు గురించి గంభీరోపన్యాసాలు చేస్తూ వుండేవారు. ఆ ఉపన్యాసాలవల్ల భారతీయ సంస్కృతి, ఆధ్యాత్మిక చింతన పట్ల అమెరికన్లకే కాక యితరులకు

కూడా శ్రద్ధాసక్తులు కలిగాయి. వివేకానందుల్ని తమ ఆదర్శంగా గ్రహించారు రామ లక్ష్మణులు. ఆ మహనీయుని అనర్ఘ ప్రసంగాలను వారు దీక్షగా చదవ సాగారు. తరువాతి కాలంలో వారు వశ్య వాక్కులుగా రూపొందడానికి ఆ విధంగా పునాది వేయబడింది వారు సంపాదించిన శక్తులలో ఈ వకృత్వ కళ కూడా ఒకటి.

యఫ్. యే. పరీక్షలో రామలక్ష్మణులు ప్రథములుగా ఉత్తీర్ణు లయ్యారు అంతవరకు చదువు సంధ్యలలో ఒకే మార్గంలో పయనించిన అన్నదమ్ములు ఇక విభిన్న మార్గాలు అనుసరించవలసి వచ్చింది న్యాయశాస్త్రం చదవాలని రామస్వామి అభిలషించారు కనుక ఆయన అదే కళాశాలలో బి. ఏ. చదవ సాగారు. అనంతరం మదరాసులోనే న్యాయ కళాశాలలో చేరి బి యల్. చది వారు.

## న్యాయవాద వృత్తి :

న్యాయశాస్త్రంలో పట్టభద్రుడైన తర్వాత, ఆయన 1911 లో మదరాసు హైకోర్టు వకీలుగా చేరారు. ఆ క్రితం సంవత్సరం ఆయనకి దామోదర మొదలి యారు జ్యేష్ఠకుమార్తె అయిన కామాక్షమ్మతో వివాహం జరిగింది ఆమె విద్యావతి. దైవచింతన, పాపభీతి కలది.

రిచ్‌మండ్ అనే బారిస్టరుతో కలిసి రామస్వామి మొదలియారు న్యాయవాద వృత్తి ఆరంభించారు. వక్తృత్వ కళలో సాధించిన ఘనవిజయం అప్పుడు ఆయ నకి బహుధా ఉపకరించింది అచిరకాలంలోనే ప్రముఖ న్యాయవాదిగా ఆయన పేరు గడించారు ఆ వృత్తిలో స్థిరపడుదామనుకుంటున్న సమయంలో - అనగా 1917లో - జస్టిస్ పార్టీ వెలుగులోకి వచ్చింది సర్ పిట్టి త్యాగరాయసెట్టి, డాక్టర్ టి యం. నాయర్, డాక్టర్ నటేశ మొదలియారు ప్రభృతులు ఈ పార్టీ స్థాపకులు.

కొందరు భావించినట్లు, జస్టిస్ పార్టీ బ్రాహ్మణ వ్యతిరేకోద్యమం కాదు జనాభాకి తగినట్లుగా విద్యాసముపార్జన, ఉద్యోగం మొదలైన వాటిలో అవకాశాలు, సామాజిక చైతన్యం, క్రింది తరగతులవారి సముద్ధరణ మొదలైన వాటిని సాధించాలన్నదే ఈ పార్టీ ప్రధాన లక్ష్యం. పార్టీ స్థాపకులుగాని, యితర నాయకులు గాని. తమ ఆచార వ్యవహారాలను గాని, పురోహితుల్ని గాని,




ఆర్కాట్ సోదరులు - 1911 లో తీసిన ఛాయాచిత్రం.

తృణీకరించిన వారు కారు. గ్రామీణ నాయకత్వం బలంపుంజుకుంటున్న రోజు లవి రాజకీయ నాయకత్వంగాని పదవులుగాని, ఒక కులానికి పరిమితమైనవి కావని భావించబడిన రోజు లవి.

## రాజకీయ రంగ ప్రవేశం :

రామస్వామి మొదలియారు జస్టిస్ పార్టీలో చేరారు ఆ పార్టీ ప్రధాన లక్ష్యాన్ని సాధించేందుకు సహర్షంగా కృషి చెయ్య సాగారు ఆయన ఆంగ్లభాషా పరిజ్ఞానం, రచనా కౌశలం, వాగ్ధాటి మొదలైనవి పిట్టి త్యాగరాయసెట్టి ప్రభృతుల్ని ప్రముఖంగా ఆకర్షించాయి. వారు ఆయన ప్రతిభా వ్యుత్పత్తుల్ని సద్వినియోగం చేసుకున్నారు రాజకీయవాదిగా ఆయన శక్తిసామర్థ్యాలు నలుగురికీ తెలియ వచ్చాయి. ఇలా ఉండగా, ఆయన 1919లో జస్టిస్ పార్టీ ప్రతినిధిగా భారత రాజ్యాంగ సంస్కరణల సంయుక్త పార్లమెంటరీ సంఘం వారితో సంభాషణలు సాగించేందుకు లండను వెళ్ళారు ఇదే ఆయన తొలి విదేశయాత్ర. తదాదిగా ఆయన రాజకీయ కీర్తి విహంగం రెక్కలు విప్పుకో సాగింది.

ఆ మరుసటి సంవత్సరం మదరాసు రాష్ట్ర శాసనసభకు ఎన్నికలు జరిగాయి. జస్టిస్ పార్టీ ఎన్నికలలో పోటీచేసి అధిక స్థానాలు గెలుచుకుంది. గెలిచిన అభ్యర్థులలో రామస్వామి మొదలియారు ఒకరు.

జస్టిస్ పార్టీ మంత్రివర్గం ఏర్పడింది. పిట్టి త్యాగరాయ సెట్టిగారు పార్టీ నాయకుడైనా, ఆయన మంత్రివర్గంలో చేరలేదు. అదే ఆయన త్యాగ నిరతి! పానగల్‌రాజా ముఖ్యమంత్రి అయ్యారు. విద్యామంత్రికి పార్లమెంటరీ కార్యదర్శిగా రామస్వామి మొదలియారు నియుక్తు లయ్యారు. 1920 వ సంవత్సరపు మదరాసు విద్యాచట్టం అమలులోకి వచ్చేందుకు ఆయన గణనీయమైన కృషిచేశారు. ప్రాథమిక విద్యా వ్యాప్తికి ఆ చట్టం ఎంతో దోహదం చేసింది నిర్బంధ విద్యా వ్యాప్తికి కూడా అది తోడ్పడింది.

1923లో మళ్ళీ ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో కూడా రామస్వామి మొదలియారు పోటీచేసి విజయం సాధించారు. ఆయన 1923 వ సంవత్సరపు మదరాసు విశ్వవిద్యాలయ చట్టానికి రూపురేఖలు కల్పించారు. ఆ చట్టం వల్ల

విశ్వవిద్యాలయానికి చెప్పుకో దగినంత పాలనాస్వేచ్ఛ లభించింది. ప్రభుత్వం వారి ఆమోదం లేకుండానే కళాశాలల్ని అనుబంధం చేసుకునే అధికారం విశ్వవిద్యాలయానికి సంక్రమించింది అంతేకాదు, సెనేటు సిఫార్సు చేసే పేర్లనుంచి విశ్వవిద్యాలయోపాధ్యక్షుని నియమించే అధికారం ఛాన్సెలరుకి (రాష్ట్ర గవర్నరు) లభించింది. ఉపాధ్యక్షుణ్ణి విశ్వవిద్యాలయ ప్రధానాధికారిగా చేసింది. అభ్యుదయాత్మకమైన యీ చట్టానికి రూపకల్పన చేసిన రామస్వామి మొదలియారు విశ్వవిద్యాలయానికి పాలనాస్వేచ్ఛ ఉండాలని ఆశించినట్లు నిర్ద్వంద్వంగా పేర్కొనవచ్చు.

1926 లో జరిగిన ఎన్నికలలో ఆయన ఓడిపోయారు అయినా నిరుత్సాహం చెందలేదు; పార్టీ వ్యవహారాలలో చురుకుగా పాల్గొనడం మానలేదు. ఆ మరుసటి సంవత్సరం ఆయన పార్టీవారి ఆంగ్ల దినపత్రిక 'జస్టిస్' కి సంపాదకునిగా నియుక్తులయ్యారు సంపాదక పదవిలో ఎనిమిదేళ్ళు ఉన్నారు. ఆయన వ్రాసే సంపాదకీయాలను ఆనాటి పెద్దలూ, విద్యార్థులు ఆసక్తితో చదివేవారు. వ్యంగ్య చిత్రాలను ప్రచురించి ఆయన పత్రికారంగంలో ఒక కొత్త పుంత ప్రవేశపెట్టారు దినపత్రికలో వ్యంగ్య చిత్రాలు ప్రవేశపెట్టిన వారిలో ఆయనే ఆద్యుడని అభిజ్ఞులు చెపుతారు.

పౌర వ్యవహారాలలో కూడా ఆయన శ్రద్ధాసక్తులు ప్రదర్శించారు చాలా యేళ్ళు మదరాసు నగర కార్పొరేషను సభ్యునిగా వ్యవహరించారు. రెండుసార్లు (1928-30) కార్పొరేషను అధ్యక్షునిగా ఎన్నికయ్యారు చెన్నపట్టణ పౌరులకు ఆయనపట్ల గల ఆదరాభిమానములకు ఈ ఎన్నిక నిదర్శనం.

ఆ తర్వాత ఆయన కేంద్ర శాసనసభకు (సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లి) ఎన్నికయ్యారు. కేంద్ర శాసనసభా కార్యకలాపాలలో శ్రద్ధాసక్తులు ప్రదర్శించి యితర సభ్యుల మన్ననలు పొందారు. 1931 నుంచి 1934 దాకా ఆయన సభ్యుడుగా ఉన్నారు ఆ రోజుల్లో ఆయన లండనులో జరిగిన రౌండు టేబిల్ సమావేశంలో పాల్గొన్నారు ఆ తర్వాత కేంద్ర శాసనసభకు జరిగిన ఎన్నికలలో ప్రముఖ కాంగ్రెసు నాయకుడు, వాగ్మి శేఖరుడు అయిన శ్రీ యస్ సత్యమూర్తితో రామస్వామి మొదలియారు పోటీ చేయవలసివచ్చింది.

వారి ఎన్నికల ప్రచార సభలకు పెద్దలే కాక విద్యార్థులు కూడా పెద్ద సంఖ్యలో హాజరయ్యేవారు కాని రామస్వామి మొదలియారు ఆ ఎన్నికలలో జయించలేదు ఆయనా, సత్యమూర్తి ఒకే కళాశాలలో చదువుకున్నవారు; మిత్రులు.

ఎన్నికలలో అపజయం పొందినా, అది రామస్వామి మొదలియారు జీవితంలో ఒక మలుపుకి దారితీసింది ఆయన్ని ఉన్నత పదవులు వరించ సాగాయి. ఆయన ప్రతిభకు గుర్తింపు లభించినట్లయింది. ప్రభుత్వ కార్యకలాపాలలో ఆయనకి గల గాఢ పరిజ్ఞానం, ఆయన వాక్పటిమ బ్రిటిష ప్రభుత్వాధినేతల్ని ఆకర్షించాయి. ఆనాటి ప్రభుత్వంలో ఆయన ఉన్నత పదవులెన్నో అలంకరించ గలిగారు.

## ఉన్నత పదవులు :

1933 లో కెనడాలోని టొరాంటో నగరంలో జరిగిన బ్రిటిష కామన్వెల్తు సంబంధాల మహాసభకు రామస్వామి మొదలియారు భారత ప్రతినిధివర్గ నాయకునిగా హాజరయ్యారు ఆ మహాసభలో ఆయన ప్రతిభ వ్యక్తమయింది. రిజర్వు బ్యాంకు సంఘం, రైల్వే సంఘం, సైన్యం తగ్గింపు సంఘం మొదలైన వాటిలో ఆయన సభ్యుడుగా నియమితులయ్యారు.

1936 లో లండనులోని ఇండియా కౌన్సిలు సభ్యునిగా రామస్వామి మొదలియారు నియుక్తులయ్యారు. ఆ మరుసటి సంవత్సరం ఇండియా మంత్రికి (సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా) సలహాదారుగా నియమితులయ్యారు ఏ పదవిలో ఉన్నా సమర్థవంతంగా నిజాయితీగా పనిచెయ్యడం ఆయనకి మొదటి నుంచీ అలవడిన విశిష్ట గుణం. ఈ పదవిలో కూడా ఆయన రాణించారు. అప్పటి వైస్రాయి విలింగ్డన్ ప్రభువు ఆయన శక్తిసామర్థ్యాలు చూసి ముగ్ధుడయ్యాడు. టారిఫ్ (సుంకాలు) కమీషను సభ్యునిగా ఆయన్ని నియమించాడు. ఆనాటి నుంచీ ఆయన ప్రతిభకు మరింతగా గుర్తింపు లభించ సాగింది.

1939 లో రామస్వామి మొదలియారు ఇండియా ప్రభుత్వపు వాణిజ్య మంత్రి పదవిని (ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు మెంబర్) అలంకరించారు. ఆ పదవిలో ఆయన 1942 దాకా ఉండి వైస్రాయిల మన్ననలు పొందారు. ఆ తర్వాత ఒక

సంవత్సరంపాటు ఏ శాఖ లేకుండా మైస్రాయి కార్యనిర్వాహక మండలిలో మంత్రిగా పనిచేశారు వాణిజ్యం, పరిశ్రమలకు సంబంధించిన విషయాలలో ఆయన ప్రామాణికులని పేరు గడించారు ఆ తర్వాత నాలుగేళ్ళ పాటు ఆయన యోజన అభివృద్ధి కార్యక్రమాల మంత్రిగా ఉన్నారు. మొత్తం మీద రామస్వామి మొదలి యారు వైస్రాయి కార్యనిర్వాహక మండలిలో సభ్యునిగా ఏడేళ్ళపాటు పనిచేసి వాణిజ్యం పరిశ్రమలు మొదలైన వాటికి సంబంధించిన వివిధ విషయాలలో పరిజ్ఞానమే కాక ప్రావీణ్యం కూడా గడించారు.

రెండవ ప్రపంచ సంగ్రామం జరిగే రోజుల్లో విన్‌స్టన్ చర్చిల్ ఆధ్వర్యంలో ఏర్పడిన మంత్రి వర్గంలో రామస్వామి మొదలియారుకి (1941) స్థానం లభించింది. ఈ విశిష్ట గౌరవం పొందిన తొలి భారతీయుడు ఆయనే.

1942 లో మనదేశంలో విజ్ఞాన శాస్త్ర పారిశ్రామిక పరిశోధక మండలి (కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసర్చ్) స్థాపించబడింది. ఈ మండలి స్థాపనకు రామస్వామి మొదలియారే కారణభూతులు.

ఆ రోజుల్లో విజ్ఞానశాస్త్ర పరిశోధనకు గాని, సాంకేతిక విషయాల అభివృద్ధికి గాని ప్రభుత్వం ఏ విధమైన శ్రద్ధాసక్తులు చూపలేదు. పైగా రెండవ ప్రపంచ సంగ్రామం జరుగుతున్న రోజులవి పాశ్చాత్య దేశాలు విజ్ఞానశాస్త్రంలో సాధించిన ప్రగతి యేమిటో రామస్వామి మొదలియారుకి బాగా తెలుసు. కాగా, విజ్ఞానశాస్త్ర పరిశోధనకు, పారిశ్రామిక విషయాల పరిశోధనకు ఎక్కువ నిధులు కేటాయించవలసిన అవసరాన్ని ఆయన ప్రభుత్వం వారికి తెలియ జేశారు. తత్ఫలి తంగా విజ్ఞానశాస్త్ర పారిశ్రామిక పరిశోధక మండలి వెలుగు చూడగలిగింది. అందువల్ల ఆయన్ని ఆ మండలి జనకునిగా అభిజ్ఞులు అభివర్ణిస్తారు. ఈ మండలి తన రజతోత్సవాన్ని 1976 లో ఘనంగా జరుపుకుంది. ఆ సభ అప్పటి ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి సమక్షంలో రాష్ట్రపతి అధ్యక్షతను జరిగింది. రజతోత్సవ ప్రసంగాన్ని రామస్వామి మొదలియారు చేశారు. ఆ విధంగా విజ్ఞాన శాస్త్ర పారిశ్రామిక పరిశోధనకు ఆయన సముచిత రీతిని కృషి చేశారు. ఆ కృషి ఫలితంగా ఈనాడు భారతదేశం విజ్ఞానశాస్త్రం వివిధ శాఖలలోనూ ముందంజ వేయగలిగింది.

బ్రిటిషు వారి హయాంలో రామస్వామి మొదలియారుకి లీగ్ ఆఫ్ నేషన్స్‌తో (నానాజాతి సమితి) సంబంధం ఉండేది. భారతదేశపు ప్రతినిధిగా ఆయన యూరపు, అమెరికాలలో జరిగిన పెక్కు అంతర్జాతీయ సమావేశాలలో పాల్గొన్నారు.

ఐక్య రాజ్య సమితితో కూడా ఆయనకి సన్నిహిత సంబంధం ఉంది. 1945 ఏప్రిల్‌లో శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజ్య సమితి సమావేశంలో ఆయన భారతదేశపు ప్రతినిధివర్గ నాయకునిగా పాల్గొన్నారు. ఆ సమావేశంలో ఆయన ఆశువుగా ప్రసంగించారు. ఆ ప్రసంగం అందరి మన్ననలు పొందింది. ఆ విశిష్ట ప్రసంగం ఇలా ప్రారంభమయింది :

"చరిత్రకు తెలిసినప్పటి నుంచీ శాంతికాముక ప్రజలుగా పేరొందిన ప్రజల అభిప్రాయాలకు ప్రతినిధిగా నేను మీ సమక్షంలో ఉన్నాను. సుదీర్ఘమైన భారతదేశ చరిత్రలో దేశం లోపల గొడవలెన్నో జరిగి వుండవచ్చు. కాని భారత దేశీయులు కయ్యానికి కాలుదువ్వేవారని గాని, తమ సరిహద్దులు దాటి యితరులపై అధికారం చెలాయించాలని గాని వ్యక్తంచేసే ఒక్క సంఘటనను కూడా చరిత్ర కారుడు పేర్కొనలేడు. పైపెచ్చు. తెల్లవారైన యూదులు తమ భూభాగం వదిలి భారతదేశపు పశ్చిమ తీరానికి వచ్చినప్పటి నుంచీ ఇటీవలి కాలం వరకు - అనగా దండయాత్రకు గురి అయిన పోలెండు జాతీయులు మా దేశంలో తలదాచుకున్న నిన్న మొన్నటిదాకా - భారతదేశం పీడితుల కందరికీ ఆశ్రయ మిచ్చింది. (హర్షధ్వానాలు)

మూడు సంవత్సరాలక్రితం - అనగా 1942 చివర్లో - నేనూ నా మిత్రుడొకాయన ఇంగ్లండులో ఉన్నప్పుడు జరిగిన సంఘటనని తలుచుకుంటేనే సంతోషం కలుగుతున్నది. మేము మా దేశంలో పోలిష్ కాందిశీకుల్ని ఆదుకున్నందుకుగాను తమ జాతి పక్షాన జెనరల్ సికోర్‌స్కీ మమ్మల్ని అభినందించాడు. దండెత్తి వచ్చేవారిని ప్రతిఘటించలేకపోవటం వల్లనో, మానవ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించేందుకు సాగిన సైనిక సంఘర్షణలలో మేము మా పాత్రను సక్రమంగా నిర్వర్తించని కారణంవల్లనో ఈ శాంతికాముక ప్రవృత్తి మాకు అలవడలేదు."

భారతీయులలో సహజంగా కానవచ్చే శాంతిప్రియత్వాన్ని రామస్వామి మొదలియారు సభ్య ప్రపంచానికి స్పష్టంగా తెలియజేశారు ఆ ప్రసంగంలో మరొక చోట ఆయన తన భావాన్ని ఇలా వ్యక్తం చేశారు :

"మాది శాంతికాముక దేశమని చెప్పడంలో నా అభిప్రాయం, శాంతికోసం ప్రార్థిస్తూ చేతులు ముడుచుకుని కూర్చునే వాళ్ళమని కాదు అర్థం ఈ యుద్ధంలో ఉత్తర ఆఫ్రికాలో డన్కిర్క్ వద్ద, ఇటలీలో, గ్రీసులో, మధ్యప్రాచ్య దేశాలలోనూ భారతదేశపు సైన్యాలు తమ వీరోచిత పాత్రను నిర్వహించాయి. (హర్ష ధ్వానాలు).

ఆ ప్రసంగంలో ఆయన ఎన్నో ప్రముఖ విషయాలు ప్రస్తావించారు. ఆర్థిక సాంఘిక అంశాలుకూడా ప్రస్తావించారు. సామాన్య మానవుని గౌరవ ప్రపత్తులు కూడా ఆ ప్రసంగంలో చోటుచేసుకున్నాయి. ఆయన యీ విషయమై ఇలా అన్నారు :

"మరొక అంశాన్ని కూడా మనం గుర్తించవలసి వుంది. మనం వాస్తవిక దృష్టిని కలిగి వుండాలి ఈ నాటి ప్రపంచంలో కనిపించే విభిధాంశాలను మనం గుర్తించాలి ఒక యథార్థం ఉంది; ఒక ప్రాథమికాంశం ఉంది. అన్ని మతాలు బోధించిన ఒక పరమ సత్యం ఉంది. అదే సామాన్య మానవుని గౌరవం. ఈ అంశాన్ని మనం స్ఫురణకు తెచ్చుకోవాలి ప్రాథమిక మానవ హక్కులు వేరు పరచరానివి; వాటిని ప్రత్యేకించలేము వినిమయం, ఆహారం, వర్ణం, వర్గం మొదలైన వాటిని పురస్కరించుకొని మనుషులకూ మనుషులకూ మధ్య ఈ హక్కుల్ని విడదీయ లేము (హర్షధ్వానాలు) ఆసియా పౌరునిగా చెపుతున్నాను, ఈ అంశం ఎప్పుడూ విస్మరించరానిదని ప్రపంచ పౌరులందరి ప్రాథమిక హక్కుల్ని గుర్తించినప్పుడు, అన్ని రంగాలలోనూ స్త్రీ పురుషుల్ని సమానులుగా తిలకించినప్పుడు మనం శాంతిస్థాపనకు పునాది వేసిన వాళ్ళమవుతాము. అప్పుడే ఆ శాంతి కొంత కాలం వరకైనా - రెండు తరాల వరకైనా - మనగలుగుతుంది. (హర్షధ్వానాలు)"

మహాసభ ప్రారంభంలో చాలామంది యువతీ యువకులు అధ్యక్షుని వెనక నిలబడ్డారు. ఆ దృశ్యం రామస్వామి మొదలియారుని బహుధా ఆకర్షించింది. భావి ప్రపంచం తరుణ వయస్కులదే నంటూ ఆయన తన ప్రసంగాన్ని ఇలా ముగించారు .

"భావి ప్రపంచం వారిదే (యువతీ యువకులది). మనం ప్రస్తుతం చర్చిస్తున్న శాంతి పథకం వారికోసమే; మనకోసం కాదు. ఇప్పుడు కనక మనం మన లక్ష్యసాధనలో విజయం సాధించకపోతే, సక్రమంగా పథక నిర్మాణం చెయ్యక పోతే భవిష్యత్తులో అందుకు మనం బాధ్యులముగా భావించబడతాము. ఈ పరిషత్తు మీద మోయలేనంత భారాన్ని మోపడం వాంఛనీయం కాదనే అంశంతో మనం ఏకీభవిస్తున్నట్టుగా నేను చెప్పాను కాని నేను భావిస్తున్న లక్ష్యాలకోసం ప్రధాన స్వరూపం, ప్రాథమిక విషయాలు మొదలైన వాటిని మనం అంగీకరించాలి."

చిరస్మరణీయమైన ఆ ప్రసంగంలో రామస్వామి మొదలియారు ఏ దేశమూ స్వతంత్రంగా ఉండజాలదనీ, ప్రపంచశాంతికి గాను ఒక దేశం మరొక దేశం మీద ఆధారపడ వలసిన అగత్యం ఉన్నదనీ స్పష్టాస్పష్టంగా తెలియజేశారు. ఈ సూచనను కొన్ని పత్రికలు విమర్శించాయి. అలా విమర్శకు పాల్పడిన ఆ అంశాన్ని అప్పటి ప్రధాని నెహ్రూ పండితుడు సమర్థించాడు. తత్ఫలితంగా విమర్శకుల నోళ్ళకు తాళం పడింది.

## రాజనీతిజ్ఞుడు :

శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజ్య సమితి ప్రారంభోత్సవం తరువాత నుంచీ రామస్వామి మొదలియారు జీవితం ఒక కొత్తమలుపు తిరిగినట్లు అభిజ్ఞులు భావిస్తారు. రాజకీయవాదిగా జీవితరంగంలో అడుగుపెట్టిన ఆయన ప్రముఖ రాజనీతిజ్ఞునిగా ద్యోతించారు. ఆ తరువాతి సంవత్సరం ఆర్థిక సాంఘిక మండలికి అధ్యక్షులయ్యారు. ఆ మరుసటి సంవత్సరం ఆయన యు.యన్. మారిటైం (సముద్ర విషయాల) మహాసభలో పాల్గొన్న భారతీయ ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించారు. అంతర్జాతీయ రంగంలో ఆయన ఒక విశిష్ట వ్యక్తిగా పేరు పెంపులు గడించారు.

1946 ఏప్రిల్ నుంచి జూన్ దాక జరిగిన ఐక్యరాజ్య సమితి సమావేశంలో అమెరికా సంయుక్త రాష్ట్రాల పక్షాన పాల్గొన్న ప్రతినిధులలో డామ్, వర్జీనియా క్రొమెరన్ గిల్డర్ స్లీప్ అనే విదుషి పేర్కొన దగింది ఆమె 'మెనీ ఎ గుడ్ క్రూసేడ్' అనే గ్రంథం వ్రాసింది అందులో రామస్వామి మొదలియారు ప్రతిభా విశేషాలను ఆమె యిలా అభివర్ణించారు

"మండలి సమావేశంలో పాల్గొన్న సభ్యులలో మా అధ్యక్షులైన సర్ రామస్వామి మొదలియారు బహు సమర్థులు. సౌజన్యమూర్తి నలుగురినీ ఆకట్టుకునే స్వభావం కలవారు. పొడగరి. దృఢగాత్రుడు కృష్ణ వర్ణుడు. మనోహరాకృతి కలవాడు. ఫాలభాగాన శ్రీ చూర్ణం. ఉత్తమ పార్లమెంటేరియన్ (వాద చతురుడు) భేదాలున్నప్పటికీ, చర్చలలో కాఠిన్యం తలెత్తినప్పటికీ యాభై దేశాల వారిని ఎలా నడిపించాలో ఆయనకి బాగా తెలుసు."

ఆర్థిక సాంఘిక మండలికి భారతదేశపు ప్రతినిధి వర్గం నాయకుడు అధ్యక్షత వహిస్తాడని వినగానే ఆమె తొలుత విభ్రాంతి చెందింది.బహుశః ఆమెకు మొదలియారు గారి ప్రతిభా విశేషాలు అంతగా తెలిసి వుండక పోవచ్చు మండలి సమావేశం ప్రారంభమైన తొలివారాలలో ఆయన సభ్యులకు మాట్లాడేందుకు బాగాస్వాతంత్రం ఇచ్చారు. తరువాత ఒకరినొకరు అర్థం చేసుకున్న తర్వాత, ఆయన కళ్ళెం బిగపట్టారు ఆయనంటే సభ్యులకు ఆదరాభిమానాలు ఏర్పడినట్లు ఆమె పేర్కొన్నారు. అంతేకాదు ఆమె చివరలో ఇలా ఒక ప్రశ్నవేసి, సమాధానం కూడా ఆమెయే చెప్పింది "ఇండియాలో అలాంటి ప్రముఖులు ఇంకా ఉన్నారా? ఉన్నారను కుంటాను" ఈ విషయాదికం తెలుసుకున్నప్పుడు రామస్వామి మొదలియారు భారతదేశం గర్వించదగిన మహాపురుషుడనీ, ఆయనవల్ల మన దేశానికి పేరు పెంపులు కలిగాయనీ నిస్సంశయంగా చెప్పవచ్చు.

గిల్డర్ స్లీప్ వలె మండలి కార్యకలాపాలలో పాల్గొన్న మరొక ప్రముఖుడు కూడా రామస్వామి మొదలియారుని బహుధా ప్రశంసించారు. ఆయన డాక్టర్ హెర్మన్ ఫినాన్ బ్రిజ్ మండలి ప్రథమ సమావేశంలో ఆయన పాల్గొన్నారు. ఆ తర్వాత ఆయన ఆర్థిక సాంఘిక మండలికి అధ్యక్షులయ్యారు ఆయన 'ఎ పేజ్ ఫ్రం ది యర్లీ హిస్టరీ ఆఫ్ ది యునైటెడ్ నేషన్స్' అనే పుస్తకం రచించారు. ఆ గ్రంథంలో రామస్వామి మొదలియారుని గురించి రిళ్ళకి కట్టేలా అభివర్ణించారు.

"అంతర్జాతీయ ఖ్యాతిగన్న ప్రముఖులు సమావేశమైన యీ మండలికి అధ్యక్షత వహించిన సర్ రామస్వామి మొదలియారు తన హోదావల్లనూ సామర్థ్యంవల్లనూ అందరినీ అధిగమించారు. ఆయనది విద్యుత్తులాంటి మేధ, ఉక్కులాంటి శక్తి; బంగారంలాంటి హృదయం అలాంటి సమావేశాలకు నేను క్రొత్త కావడంవల్లనేమో నేను ఆయన ప్రభావానికి లోనయ్యాను. ఫాలభాగాన ఆ శ్రీ చూర్ణం, శరవేగంతో తీర్మానాలు చర్చించడం చూస్తే ప్రాచ్య కథల లోని మాంత్రికుడు స్ఫురణకు వచ్చాడు మండలి తన కార్యకలాపాలు తొలుత ప్రారంభించినప్పుడు, ఆయన అధ్యక్షుడు కావడం సహేతుకమే ఎందుకంటే, శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశం తాలూకు తొలి సంఘానికి ఆయనే అధ్యక్షుడు. ఆ సంఘం ఆర్థిక సహకారానికి సంబంధించిన తీర్మానాన్ని తయారు చేసింది, పైగా సన్నాహక సంఘంలో ఆయన సభ్యుడు. చర్చిల్ యుద్ధకాలపు మంత్రివర్గంలో సభ్యుడు. 1947 లో ఆయన ఆర్థిక సాంఘిక మండలికి అధ్యక్షునిగా తిరిగి ఎన్నిక అయ్యాడు నేడు డెబ్భైఆరేండ్ల వయస్సులోఉన్నా, సర్ రామస్వామి తన నౌకా నిర్మాణ కార్యక్రమాలలో, అంతర్జాతీయ జీవితంలో సమితి తాలూకు పరిపాలనా ట్రిబ్యునల్ అధ్యక్షునిగా చురుకుగా వ్యవహరిస్తున్నారు.

ఆయనపట్ల నాకు అవధిలేని ఆదరభావం కలిగింది. వ్యక్తిగా అంతర్జాతీయ ఉద్యోగిగా ఆయనంటే నాకు గౌరవం కలిగింది. 1950 లో ఆయన ఆర్థిక సాంఘిక మండలిలో పాల్గొనడాన్ని నేను విస్మరించలేను."

శాన్ట్రాక్రజ్ మండలి అధ్యక్షునిగా ఎన్నిక అయినప్పుడు ఆయన రామస్వామి మొదలియారుని ఉపాధ్యక్ష పదవి నలంకరించవలసిందిగా అర్థించాడు. శక్తి సామర్థ్యాలలో, అనుభవ లో మొదలియారు అద్వితీయుడైనా, ఉపాధ్యక్ష పదవిని సహర్షంగా అంగీకరించారు ఆయన అలా అ గీకరించడం శాన్ట్రాక్రజ్‌ని ముగ్ధుణ్ణి చేసింది. అది మొదలియారుకి గల వినయాన్ని, అంతర్జాతీయ సహకారం పట్ల ఆయనకున్న ప్రగాఢమైన ఆసక్తిని అభివ్యక్తం చేస్తున్న దని శాన్ట్రాక్రజ్ పేర్కొనడం గమనించదగిన విషయం. బ్రిటిషు వారి హయాములో రామస్వామి మొదలియారు బాధ్యతాయుతములైన ఉన్నతపదవు లెన్నో అలంకరించారు. స్వపరిపాలనాధికారం లభ్యం కావడానికి ఆయన తోడ్పడ్డారు అటువంటి

రామస్వామి మొదలియారు మండలి ఉపాధ్యక్ష పదవికి అంగీకరించడం శాస్త్రజ్ఞని ముగ్ధుణ్ణి కావించింది

1946 లో ఇంగ్లండుకి, అమెరికాకి వెళ్ళిన భారతీయ ఆహార ప్రతినిధి వర్గాలకి రామస్వామి మొదలియారు నాయకత్వం వహించారు. బెంగాలులో క్షామం ఏర్పడినప్పుడు, ఆయన అమెరికా వెళ్ళి ఆదేశం మనకు ఆహార పదార్థాలు సహాయం చేసేలా తమ పలుకుబడినీ వాక్చాతురినీ వినియోగించారు

## స్వాతంత్ర్యానంతరం :

స్వాతంత్ర్యానంతరం రామస్వామి మొదలియారు ప్రతిభా విశేషాలను ప్రభుత్వం సద్వినియోగం చేసుకోలేదని కొందరి అభిప్రాయం. ఈ సందర్భంగా వైస్రాయి కార్య నిర్వాహక వర్గంలో సభ్యులుగా పనిచేసి ఆ తర్వాత సిలోన్‌లో (శ్రీలంక) ఇండియా హైకమీషనురుగా వ్యవహరించిన డాక్టర్ యం యస్. అణె అభిప్రాయం పరిశీలించ దగింది. ఆయన యిలా పేర్కొన్నారు :

'రెండు ముక్కలలో డాక్టర్ ఏ రామస్వామి మొదలియారుని గురించి యిలా చెపుతాను. ప్రస్తుత భారత ప్రభుత్వం తన పాక్షిక వైఖరిని విడనాడి ప్రముఖ పార్లమెంటేరియను, పరిపాలనాదక్షుడు, రాజనీతిజ్ఞుడు, ఉన్నత శ్రేణికి చెందిన వాగ్మి అయిన ఆయన సహకారం అర్థించి ఆయన్ని కేంద్ర మంత్రివర్గములో చేర్చుకోవాలి. ఆంతరంగిక వ్యవహారాల శాఖను గాని వాణిజ్య పరిశ్రమల శాఖను గాని, మరొక ముఖ్యమైన శాఖను గాని ఆయనకి ఇవ్వాలి.

'నా పార్లమెంటరీ జీవితంలో మంత్రివర్యులుగా ఉన్న ముగ్గురు భారతీయ నాయకులు నన్ను ముగ్ధుడిని చేశారు. వక్తలుగా, వివిధ సమస్యలతో విస్తృత పరిజ్ఞానం గలవారుగా, ప్రత్యర్థుల మనోభావాలను అవగాహన చేసుకోవాలనే తపన గలవారుగా ఆ నాయకులు ముగ్గురూ నన్ను ఆకర్షించారు వారు; యన్. యన్. సర్కారు, గోవింద వల్లభ పంత్, డా. ఏ. రామస్వామి మొదలియారు ప్రభృతులు. ఈ ముగ్గురిలోనూ కడపటి వారికి ఒక గొప్పశక్తి ఉండేది. ఉపన్యాసానంతరం అందరూ చాలా సేపు కరతాళధ్వనులు చేసేలా, ఆయన తన ఉపన్యాసాన్ని శక్తిమంతమూ, మధుర మంజులమూ అయిన భాషలో ముగించేవాడు'.

అంత ప్రతిభావంతుడైన రామస్వామి మొదలియారుకి కేంద్ర మంత్రి వర్గంలో స్థానం లభించకపోవడం ఆశ్చర్యంగానే కనిపిస్తుంది కాని మదరాసు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా పనిచేసిన ప్రముఖ విద్యావేత్త డాక్టర్ యన్.డి. సుందర వడివేలు ఈ అభిప్రాయాన్ని సమర్థించలేదు. ఆయన, 'స్వతంత్ర భారతం కూడా రామస్వామి మొదలియారు ప్రతిభాపాటవాలను చక్కగా వినియోగించుకుంది' అని పేర్కొన్నారు. ఆర్కాటు సోదరులతో సన్నిహిత పరిచయం గలవారు సుందర వడివేలుగారు.

రామస్వామి మొదలియారు పదేళ్ళపాటు (1952 - 1962) రాజ్యసభలో సభ్యులుగా ఉన్నారు. వివిధ విషయాలు గురించి ఆలోచనామృతము లనదగిన ఉపన్యాసాలు చేశారు దేశ క్షేమం తమ ప్రధాన ధ్యేయంగా భావించారు.

## మైసూరు దివాను పదవి :

స్వాతంత్ర్యానికి పూర్వం మన దేశంలో మైసూరు, హైదరాబాదు మొదలైన దేశీయ సంస్థానాలు చిన్నవీ పెద్దవీ చాలా ఉండేవి. సంగ్రహంగా చెప్పాలంటే, అవి స్వతంత్ర రాజ్యాలుగా వ్యవహరించేవి. ఆయా సంస్థానాలలో రాజులూ నవాబులూ ఆడంబరమైన జీవితం గడిపేవారని వేరుగా చెప్పనవసరం లేదు. వారికి బ్రిటిషు ప్రభుత్వం సహాయ సహకారాలు అందించేది.

రాజకీయపరమైన అభిప్రాయభేదా లున్నప్పటికీ ఆ నాటి జాతీయోద్యమ (కాంగ్రెసు) నాయకులు రామస్వామి మొదలియారు ప్రతిభను గుర్తించారు. రాజాజీగా లబ్ధప్రతిష్ఠులైన చక్రవర్తి రాజగోపాలాచారిగారు మైసూరు సంస్థానానికి రామస్వామి మొదలియారుని దివానుగా నియమించాలని సూచించారు. ఆ సూచన మేరకు ఆయన దివానుగా నియమితు లయ్యారు ఆయన మైసూరు దివానుగా మూడేండు (1946-1949) వ్యవహరించి, ఆ సంస్థానాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డారు. అన్నిటికంటె ముఖ్యమైన అంశం ఏమిటంటే, మైసూరు సంస్థానం భారత యూనియనులో విలీనం కావాలని రామస్వామి మొదలియారు సూచించారు. ఆ సూచన కార్యరూపం దాల్చింది. దేశభక్తి ప్రపూర్ణమైన రాజనీతిజ్ఞత రామస్వామి మొదలియార్‌లో పుష్కలంగా ఉండేదని పేర్కొనడానికి ఇదొక ఉదాహరణ.

'1946-1949 సంవత్సరాలమధ్య మైసూరు దివానుగా సర్ రామస్వామి మొద లియారు కావించిన సేవను మైసూరువారు చాలాకాలం స్మరించుకుంటారు' అని మైసూరు ప్రభుత్వపు ముఖ్యమంత్రిగా పనిచేసిన సి నిజలింగప్పగారు పేర్కొ నడం గమనించదగిన అంశం

రామస్వామి మొదలియారుకి గల దూరదృష్టి, సేవాతత్పరత ప్రశంసా ర్హములు. ఆయన సేవా నిరతిని పి శివశంకర్‌గారు ఇలా ప్రస్తుతించారు.

'1946 లో నేను బెంగుళూరు పురపాలక సంఘాధ్యక్షుడిగా ఉండేవాణ్ణి. అప్పుడే నాకు రామస్వామి మొదలియారుని కలుసుకునే అవకాశం ఏర్పడింది. ఆయన పదవిలో ఉన్నంతకాలం, నాకూ నా సహచరులకూ ఆయన సహకారం సలహా మొదలైనవి లభించేవి కావేరి నదీ జలాలు వినియోగించుకుని బెంగుళూరు నగర కార్పొరేషన్‌వారు ఒక బృహత్తర నీటి పథకం అమలుకు ప్రయత్నిస్తు న్నారు. 21 సంవత్సరాలకు పూర్వమే అలాంటి ప్రయత్నం అవసర మవుతుం దని ఆయన గ్రహించిన అంశాన్ని నే నిప్పుడు గుర్తు చేసుకుంటున్నాను. కావేరీ జలాన్ని బెంగుళూరుకి తీసుకువచ్చే పథక రచనకు 1946 లో డాక్టరు మొదలి యారు కార్పొరేషన్ ఉద్యోగులతోను నీటి సరఫరా శాఖోద్యోగులతోను ఒక సమావేశం ఏర్పాటు చేశారు. ఆయన పదవీ విరమణ చేసిన తర్వాత, ఎందుకో ఆ పథకానికి స్వస్తి చెప్పడం జరిగింది ప్రస్తుత ప్రభుత్వం దాన్ని పునరుద్ధ రించడానికి ప్రయత్నిస్తున్నది. మైసూరు ప్రభుత్వ యంత్రాంగాన్ని ఆదర్శవంత మైన పరిపాలనా యంత్రాంగంగా తీర్చిదిద్దడానికి కూడా డాక్టరు మొదలియారు తోడ్పడ్డారు'.

మైసూరు ప్రజల ఆదరాభిమానములే కాక మైసూరు మహారాజావారి ఆదర భావం కూడా లభించింది రామస్వామి మొదలియారుకి. మహారాజావారు ఆయనకి 'రాజమంత్ర చింతామణి' అనే ప్రత్యేక బిరుదు ఇచ్చి గౌరవించారు మైసూరు విశ్వవిద్యాలయం ఆయనకి డాక్టర్ ఆఫ్ లాస్ గౌరవ డిగ్రీ ప్రదానం చేసి, తన్ను తాను సత్కరించుకుంది ఆయన మైసూరు విశ్వవిద్యాలయంలో స్నాత కోపన్యాసం చేశారు కూడా ఇలా మైసూరుకీ రామస్వామి మొదలియారుకీ మధ్య ప్రగాఢమైన సంబంధం ఏర్పడింది.

## భారత యూనియన్‌లో హైదరాబాదు విలీనం :

ఉక్కు మనిషిగా పేరు ప్రఖ్యాతులు సముపార్జించిన సర్దార్ వల్లభ్‌భాయి పటేలు గౌరవాభిమానాలకు కూడా రామస్వామి మొదలియారు పాత్రులయ్యారు. దేశీయ సంస్థానాలను భారత యూనియన్‌లో విలీనం చెయ్యడానికి సర్దార్‌పటేల్ చేసిన కృషి చిరస్మరణీయం ఆ విధంగా దేశ సమగ్రతకు పాటుపడిన మహనీయుడు ఆయన! అలాగే హైదరాబాదు సంస్థానం యూనియన్‌లో లీనం కావడానికి ఎంతగానో కృషి చేసిన చిరస్మరణీయుడు రామస్వామి మొదలియారు. ఉక్కు మనిషికి సౌమ్యుడూ, అదే సమయంలో మహాశక్తి సంపన్నుడూ అయిన రామస్వామి మొదలియారు సహాయ సహకారాలు లభించడం పేర్కొనదగిన విషయం. ఆ విధంగా ఆ మహనీయు లిద్దరూ భారతదేశపు సమగ్రతను పరిరక్షించడానికి కృషి చేశారు

మన దేశంలోని యితర సంస్థానాధీశులు భారత యూనియన్‌లో చేరడానికి సమ్మతించినా, హైదరాబాదు సంస్థానాధిపతి అయిన నిజాము మాత్రం యూనియన్‌లో చేరడానికి సమ్మతించలేదు. రజాకార్ దళాన్ని విశ్వసించి ఆయన స్వతంత్ర రాజ్యం కలలుగన్నాడు. ఆ స్వప్నాన్ని భంగం చెయ్యడానికి హైదరాబాదుపై పోలీసు చర్య అవసరమయింది. 1948 లో జరిగిన పోలీసు చర్య తర్వాత హైదరాబాదు భారత యూనియన్‌లో లీనమయింది అంతటితో సంస్థానాల విలీనం పూర్తి అయింది

పోలీసు చర్య జరిగిన ఆ రోజులలో, భారతీయ విద్యాభవన్ సంస్థాపకులూ, ప్రముఖ జాతీయోద్యమ నాయకులూ అయిన కె.యం. మున్షీగారు హైదరాబాదులో భారత ప్రభుత్వం వారి ఏజెంట్ జనరల్‌గా ఉండేవారు. పోలీసు చర్య అనివార్య మవుతున్నదనగా నిజాం నవాబు ఆదేశానుసారం అప్పటి అతని ఉద్యోగులు భద్రతా సమితిలో ఈ విషయాన్ని లేవదీశారు. భారత ప్రభుత్వం పక్షాన సమర్థంగా వాదించవలసిన అగత్యం ఏర్పడింది. ఆ క్లిష్ట సమయంలో రామస్వామి మొదలియారు పేరు సూచించబడింది.

ఇక ఆ విషయాన్ని మున్షీగారి మాటలలోనే తెలియజేయడం సముచితమూ సమంజసమూను :.

'అప్పుడు నేను హైదరాబాదులో భారత ప్రభుత్వపు ఏజెంట్ జనరల్‌గా వ్యవహరించే వాణ్ణి. డాక్టర్ రామస్వామిగారి రాజకీయాభిప్రాయాలు మన అభిప్రాయాలకు విభిన్నంగా ఉన్నప్పటికీ, భద్రతా సమితిలో (సెక్యూరిటీ కౌన్సిలు) ఇండియా పక్షాన వాదించే భారాన్ని ఆయనకి ఒప్పగించడం శ్రేయస్కరమని నేను సర్దార్ పటేలుకి సూచించాను సర్దార్ పటేలు విశ్వాసానికి ఆయన పూర్తి న్యాయం చేశారు ఈ అతి ముఖ్యమైన ప్రశ్న విషయమై డాక్టరు మొదలియారు వలె మన దేశంలో మరెవ్వరూ అంత శక్తిమంతంగా భారతదేశపు అభిప్రాయాలను వ్యక్తీకరించి వుండరని నే ననుకుంటున్నాను.

భద్రతా సమితిలో రామస్వామి మొదలియారు భారత దేశపు అభిప్రాయాన్ని ఎంతో సమర్థంగా హృదయానికి హత్తుకునేలా వాదించిన విషయం జగద్విదితం. చివరికి భారత ప్రభుత్వం తీసుకున్న చర్యను ప్రపంచం ఆమోదించింది. ఈ విషయాదికం రామస్వామి మొదలియారుకి గల వాద నైపుణ్యాన్నే కాక ఆయనలో నిబిడంగా నెలకొన్న దేశభక్తిని కూడా తెలియజేస్తున్నది.

మున్షీవంటి సుప్రసిద్ధ దేశభక్తునికి రామస్వామి మొదలియారు పట్ల అంతులేని అభిమానం ఉన్నట్లు మరొక సంఘటన కూడా వ్యక్తం చేస్తున్నది ఆయన మాటలలోనే ఈ విషయాన్ని తెలియజేస్తాను

'పెక్కు అంతర్జాతీయ సభలలో రామస్వామి మొదలియారు ఇండియా ప్రతినిధిగా పాల్గొన్నారు. ఆయన అంతర్జాతీయంగా ప్రసిద్ధుడన్న విషయం నాకు తెలుసు నేను రోములో ఉన్నప్పుడు ఆయనకి ఐక్యరాజ్య సమితి యొక్క ఆహార వ్యవసాయ సంస్థ డైరెక్టర్ జనరల్ పదవి లభించాలని నలుగురి సహాయాన్ని అర్థించాను కాని మనకా అదృష్టం లేకపోయింది. చివరి క్షణంలో ఆయన ప్రత్యర్థి వైపు వాటికన్ మొగ్గు చూపింది ఆ ప్రత్యర్థి ఒక కేథలిక్ దేశానికి చెందిన వాడు. రెండు మూడు ఓట్ల తేడాతో మనం ఓడిపోయాము'.

1948 లో ఐక్యరాజ్య సమితి సమావేశ పరిచిన సముద్ర వాణిజ్య మహాసభకూ, స్వేచ్ఛా సమాచార మహాసభకూ రామస్వామి మొదలియారు భారత ప్రతినిధివర్గ అధ్యక్షులుగా హాజరయ్యారు. వెళ్ళిన చోటల్లా ఆయన

పేరు ప్రతిష్ఠలు గడించడమే కాక, మాతృదేశానికి అవి లభ్యం అయ్యేలా కృషి చేశారు

## కాశ్మీరు సమస్య :

రామస్వామి మొదలియారు కాశ్మీరు సమస్య విషయంలో శ్రద్ధాసక్తులు ప్రదర్శించారు. ఐక్యరాజ్యసమితి సమావేశాలలో ఆ విషయమై ఉత్తేజ పూరితమైన ప్రసంగాలు చేశారు. ఆ ప్రసంగాల ద్వారా ఆయన భారతదేశపు ప్రతిష్ఠను ఇనుమడింప జేశారు.

ఆయన మితవాది. ఏ విషయం గురించి మాట్లాడినా శ్రోతృ ప్రపంచాన్ని అనాయాసంగా ఆకట్టుకునే వారు. మహావక్తగా జాతీయ అంతర్జాతీయ ఖ్యాతి సముపార్జించారు వక్తగా ఆయనకి ఆయనే సాటి అనడం సముచితం. ఆయన ప్రసంగం ఆలంకారికమై మధుర పద గుంఫితమై ఉండేది. ఆయన ప్రపంచ వక్తలలో ఒక రనడం సత్య సన్నిహితం. ఆయన ఉపన్యాసాలు వినడానికి శ్రోతలు ఉవ్విళ్ళూరే వారు. అలాగే మదరాసు శాసనసభలో, ఢిల్లీ కేంద్రసభలో ఆ తర్వాత రాజ్య సభలో ఆయన వక్తగా, వాద చతురుడుగా రాణించారు. ఆయన చేపట్టిన ప్రతి రంగంలోనూ తనకంటూ ఒక ప్రత్యేక స్థానం సృష్టించుకున్నారు. అంతర్జాతీయ ప్రముఖుడుగా కీర్తించబడుతున్న రామస్వామి మొదలియారు తన వ్యక్తిగత జీవితాన్ని కూడా చక్కగా మలుచుకున్నారు.

ఆయనది భయపడే ప్రవృత్తి కాదు సత్యసాధకుడు. న్యాయ సమ్మతమైన విషయాన్ని సమర్థించే స్వభావం కలవాడు. మంచి మిత్రుడు. ఉన్నతాదర్శాలు కలవాడు. ఎప్పుడూ ఉల్లాసంగా కనిపించేవాడు. ప్రజా సంక్షేమాన్ని వాంఛించినవాడు ఈ విశిష్ట గుణం ఆయన్ని చిరంజీవిగా చేసింది. తక్కువ స్థితిలో ఉన్న వారికి సహాయం చేసేవాడు. ఆర్తులకు తోడుగా ఉండేవాడు.

రామస్వామి మొదలియారు జన్మతః దైవభక్తుడు. తాను విశ్వసించిన మత విశ్వాసాలను దృఢంగా అవలంబించడానికి ఆయన వెనుకాడ లేదు శ్రీ చూర్ణం ఆయన నెన్నొదుట ప్రతిభాసించేది. రామకృష్ణ మిషనువారి కార్య కలాపాలలో శ్రద్ధాసక్తులు కనబరిచారు. ఆయన కలకత్తా నివాసంలో ముందు

గదిలో దంతంలో చెక్కబడిన రథ చోదకుడైన శ్రీ కృష్ణుని విగ్రహం ఉండేదనీ, అది చూపరుల్ని ఆకర్షించేదనీ అభిజ్ఞులు చెపుతారు

శ్రీరంగంలోని శ్రీ రంగనాథస్వామి వారి ఆలయ జీర్ణోద్ధరణ సంఘం వారు రామస్వామి మొదలియారుని సంఘాధ్యక్షులుగా ఉండమని అర్థించారు. అందుకు ఆయన సమ్మతించారు అప్పుడాయన వృద్ధుడు. వార్ధక్యంలో ఉండికూడా అధ్యక్షపదవిని అంగీకరించారంటే, దైవకార్యం పట్ల ఆయనకి గల ప్రగాఢమైన అభిమానం వ్యక్తమవుతున్నది

## విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవి :

వాగ్మిగా, రాజనీతిజ్ఞునిగా, వాదచతురునిగా పరిపాలనా దక్షునిగా ఎనలేని పేరుపెంపులు ఆర్జించిన రామస్వామి మొదలియారు 1951 నుండి 1959 దాకా తిరువాన్కూరు విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు ప్రముఖ విద్యావేత్త కావడం వల్ల ఆయన విద్యాధికుల మన్ననలు పొందడంలో ఆశ్చర్యం లేదు ఆ విశ్వవిద్యాలయాభివృద్ధికి ఆయన యథోచితంగా కృషిచేసి కేరళీయుల ఆదరాభిమానములు చూరగొన్నారు.

రామస్వామి మొదలియారు తిరువనంతపురంలో ఉండే రోజుల్లో, ఒక సారి (1956 లో) యన్ డి సుందర వడివేలుగారు ఆయన్ని కలుసుకుని ఆయనతో కొన్ని నిమిషాలు సంభాషించారు. ఆ తర్వాత - పన్నెండేళ్ళకి - పారిస్ మహా నగరంలోని యునెస్కో ప్రధాన కార్యాలయంలో సుందరవడివేలుగారు రామ స్వామి మొదలియారుని కలుసుకున్నారు కలుసుకున్న మరుక్షణమే మొదలియారు తమ తిరువనంతపురపు సంభాషణను గుర్తు చేశారట! రామస్వామి మొదలియారు జ్ఞాపకశక్తికి ఇదొక మంచి ఉదాహరణ !

## విశిష్ట గౌరవాలు, గౌరవ డిగ్రీలు :

బహుముఖ ప్రతిభావంతులైన రామస్వామి మొదలియారుని విశిష్టగౌరవాలు, గౌరవ డిగ్రీలు వరించడంలో ఆశ్చర్యం అణుమాత్రమైనా లేదు. ఆయన ఎన్నో ఉన్నత పదవులు అలంకరించి వాటికి వన్నె చిన్నెలు సమకూర్చారు

ఆయన సేవలకు మెచ్చుకుని అప్పటి ప్రభుత్వం ఆయనకి దివాన్ బహదూర్ బిరుదమిచ్చింది 1937 లో ఆయనకి నైట్‌హుడ్ గౌరవం లభించింది. 1942లో కె. సి. ఐ ఇ. అయ్యారు. 1946 లో ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయం వారు డి. సి యల్ (డాక్టర్ ఆఫ్ సివిల్ లా) అనే అత్యున్నత గౌరవ డిగ్రీ ప్రదానం చేశారు 1954 లో దర్హాం విశ్వవిద్యాలయం వారు డి సి. యల్. గౌరవ డిగ్రీ యిచ్చారు. 1957 లో మదరాసు విశ్వవిద్యాలయం వారు, శత వార్షికోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన స్నాతకోత్సవంలో, డాక్టర్ ఆఫ్ లాస్ అనే గౌరవ డిగ్రీ ప్రదానం చేశారు ఉస్మానియా విశ్వవిద్యాలయం యల్. యల్. డి. (డాక్టర్ ఆఫ్ లాస్), తిరువాన్కూరు, మైసూరు విశ్వ విద్యాలయాలు మొదలైనవి ఆయనకి గౌరవ డిగ్రీలు ఇచ్చి సత్కరించాయి. ఇలా ఆయన్ని బ్రిటిష్, భారతీయ విశ్వవిద్యాలయాలు సముచితరీతిని గౌర వించాయి.

1970 లో ఆయనకి భారత ప్రభుత్వం పద్మ విభూషణ్ ఇచ్చింది. డాక్టర్ ఆఫ్ సివిల్ లా డిగ్రీ ప్రదాన సందర్భంగా ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాధ్యక్షులు హాలిఫాక్స్ ప్రభువు రామస్వామి మొదలియారుని ఇలా ప్రస్తుతించారు :

'అత్యుత్తములూ వాగ్మిశేఖరులూ అయిన మీరు, ఆర్థిక శాస్త్ర రంగంలో అంధకారంలో మునిగిపోయిన ప్రపంచానికి ప్రాగ్దిశ నుంచి మీ వివేక జ్యోతిని తీసుకు వచ్చారు '

1957, జనవరి 29 న ఉదయం 8-30 కి మదరాసు విశ్వవిద్యాలయ శతవార్షికోత్సవ స్నాతకోత్సవం విశ్వవిద్యాలయ అధ్యక్షులైన ఎ జె. జాన్‌గారి అధ్యక్షతను జరిగింది. సర్వేపల్లి రాధాకృష్ణన్, విలియం నార్మన్ బ్రౌన్, యం ఆర్. గురుస్వామి మొదలియారు, మహమ్మద్ ఉస్మాన్, సి.పి. రామస్వామి అయ్యరు, ఆర్కాటు రామస్వామి మొదలియారు ప్రభృతులకు గౌరవ డిగ్రీలు ప్రదానం చేశారు. తదవసరంగా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన లక్ష్మణ స్వామి మొదలియారు ప్రశంసా పత్రాలు చదివారు. తమ అన్నగారిని గురించి ఆయన యిలా చదివారు రామస్వామి మొదలియారు వివిధ విశేషాలు, ఆయన సాధించిన విజయాలు మొదలైనవి ఆ ప్రశంసాపత్రంలో సంగ్రహంగా వివరించ బడ్డాయి.

'డాక్టర్ ఆఫ్ లాస్ గౌరవ డిగ్రీని సర్ రామస్వామి మొదలియారుకి ప్రదానం చేసే యీ సందర్భంలో ఏ విశ్వవిద్యాలయోపాధ్యక్షుడూ పడని యిబ్బంది నేను ప్రస్తుతం పడుతున్నట్టు భావిస్తున్నాను. ప్రభవించిన మరుక్షణం నుంచీ పరిచయంగల వ్యక్తిని గురించి, అతని లోపాలనుగాని, సుగుణాలనుగాని, అతిశయోక్తులకు పాల్పడకుండా చెప్పడం కొంచెం కష్టమే అందువల్ల ఆయన జీవిత విశేషాలు సంగ్రహంగా వివరించి తృప్తి పడతాను.

"డాక్టర్ సర్ రామస్వామి మొదలియారు మదరాసు క్రైస్తవ, న్యాయ కళాశాలల్లో విద్యాభ్యాసం చేశారు. వెనువెంటనే ప్రజాహిత జీవన రంగంలో ప్రవేశించారు. మదరాసు పురపాలక సంఘంలోను, రాష్ట్ర కేంద్ర శాసన సభలలోనూ గణనీయమైన పాత్ర నిర్వహించారు. అంతర్జాతీయ రంగంలో, 1945 లో శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజ్య సమితి ప్రథమ సమావేశానికి ఇండియా ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించారు. ఐక్యరాజ్య సమితి తాలూకు ఆర్థిక సాంఘిక మండలికి ఆయన తొలి అధ్యక్షులు. జాతీయ, అంతర్జాతీయ స్థాయిని ఏర్పాటైన పెక్కు కమిటీలలోనూ కమీషనులలోనూ ఆయన సభ్యులు బ్రిటిష్, భారతీయ విశ్వవిద్యాలయాల నుంచి ఆయన గౌరవ డిగ్రీలు పొందారు''

గౌరవ డిగ్రీలు పొందడంతోపాటు, రామస్వామి మొదలియారు మదరాసు, మైసూరు, ఉస్మానియా, రూర్కి, పాట్నా, గౌహతి, తిరువాన్కూరు విశ్వవిద్యాలయాలలో స్నాతకోపన్యాసాలు చేసి విద్యార్థుల, అధ్యాపకుల ఆదరాన్ని చూరగొన్నారు

## పారిశ్రామిక రంగం :

స్వాతంత్ర్యానికి పూర్వం బాధ్యతాయుతమునైన ఉన్నత పదవులెన్నో సమర్థవంతంగా నిర్వహించిన రామస్వామి మొదలియారు స్వాతంత్ర్యానంతరం విజ్ఞానశాస్త్ర, పారిశ్రామిక రంగాలలో యథోచితంగా కృషిచెయ్య సాగారు. విజ్ఞానశాస్త్ర పారిశ్రామిక పరిశోధన మండలి వెలుగు చూడడానికి ఆయన కృషి చేశారు. జాతీయ శాస్త్ర ప్రయోగశాలలు (నేషనల్ లేబొరేటరీస్) మొదలైన వాటి ఏర్పాటుకు సంబంధించిన కార్యకలాపాలలో పాల్గొని మన దేశంలో విజ్ఞాన శాస్త్ర పురోగతికి సముచితంగా కృషి చేశారు విజ్ఞాన శాస్త్ర ప్రయోగశాలలకూ, పరి

శ్రమలకూ మధ్య సమన్వయం ఉండాలనీ, విజ్ఞానశాస్త్ర ప్రయోగశాలలకు పాలనా స్వేచ్ఛ ఉండాలనీ ఆయన సూచించారు.

పారిశ్రామిక రంగంలో ఆయన సలిపిన నిర్మాణాత్మక కృషి బహుధా ప్రశంసార్హం. రాజకీయాలకు స్వస్తి చెప్పి. రామస్వామి మొదలియారు దేశ ఆర్థిక పురోభివృద్ధికి పాటుపడినట్లు నిస్సంశయంగా పేర్కొనవచ్చు రాజనీతిజ్ఞునిగా జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిని గడించినట్లుగానే, ఆయన ఆర్థిక పారిశ్రామిక వాణిజ్య రంగాలలో సైతం దేశ విదేశాలలో అఖండమైన యశస్సు సముపార్జించారు ఇది ఆయన ప్రతిభకు ప్రబలోదాహరణం !

జాతీయ కాగితం కంపెనీ, ఇండియా షిప్పింగ్ కంపెనీ, అశోక్ లేలండ్ లిమిటెడ్, టి ఐ సైకిల్ కంపెనీ, హిందుస్థాన్ మోటార్స్ లిమిటెడ్ మొదలైన ఇరవై భారీ పరిశ్రమల సంస్థలకు రామస్వామి మొదలియారు నాయకత్వం వహించారంటే, అది ఆయన కార్యదీక్షకూ నితాంత పరిశ్రమకూ నిదర్శనాలు. ఒక కంపెనీ వ్యవహారాలనే సమర్థంగా నిర్వహించడం కష్టంతో కూడుకున్న పని. మరి, ఇరవై కంపెనీలకు అధ్యక్షునిగానో డైరెక్టరుగానో వ్యవహరించడం ఎంత బృహత్తరమైన కార్యమో మనం ఊహించుకోవచ్చు కృషియే ఆయనకి ప్రత్యక్ష దైవమనవచ్చు పైగా ఆయన ఆధ్వర్యంలో నడిచిన ప్రతి కంపెనీ పసిడిముద్ద అయిందంటే, ఆయన ప్రతిభను ఎంతని కొనియాడగలం? ఆ వివిధ కంపెనీలు దేశ ఆర్థిక పురోభివృద్ధికి కృషి చేస్తున్నాయి. అందువల్ల నిపుణులైన కార్మికులు నిపుణులు కానివారు ఉద్యోగులు - ఎందరెందరో - ఆ మహనీయుని కృషి ఫలితాన్ని అనుభవిస్తున్నారనడం అత్యుక్తి కాదు.

## నౌకా వ్యాపారం :

రామస్వామి మొదలియారు స్వయంగా కలకత్తాలో షిప్పింగ్ కంపెనీ స్థాపించారు కంపెనీ అభివృద్ధి కోసం ఆయన తన నివాసాన్ని కలకత్తాలో ఏర్పరచు కొన్నారు కూడా. ఆ కంపెనీ అంతర్జాతీయ ఖ్యాతి గడించింది. ఆ పేరు ప్రతిష్ఠలు రామస్వామి మొదలియారుకి సంక్రమిస్తాయి. ఎనభై యేళ్ళ అపర వయస్సులోకూడ ఆయన వివిధ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొన్నారు.

1963, సెప్టెంబరు 25 నాటి 'ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్' రామస్వామి మొదలియారు గురించి వ్రాస్తూ ఇలా పేర్కొన్నది: 'మదరాసులోను, కలకత్తా లోనూ నెలకొన్న పెక్కు కంపెనీల డైరెక్టర్లకి పారిశ్రామికవేత్తగా మారిన యీ రాజనీతిజ్ఞుడు మార్గదర్శకుడై వ్యవహరిస్తున్నారు. వాణిజ్యవేత్తల విమర్శలను అంగీకరించడానికి ప్రభుత్వం అంతగా సుముఖంగా లేదని ఆయన పేర్కొన్నారు. అయినా జాతీయ సంఘాలైన యఫ్. ఐ. సి. సి ఐ. మొదలైన వాటి పక్షాన ఆయన ఢిల్లీలో జరిగిన సంభాషణలలో పాల్గొన్నారు "

ప్రపంచ వ్యవహారాలలో శ్రద్ధాసక్తులతో పాల్గొన్న రామస్వామి మొదలియారు నిత్యయాత్రికుడన్నా అతిశయోక్తికాదు. ఆయన మూడు మిలియన్ల మైళ్ళకి (ముప్పయి లక్షలు) పైగా విమానయానం చేసినట్లు చెప్పుతారు. ఇందులో అతిశయోక్తి లేదనే చెప్పవచ్చు. ఆయన దేశ విదేశాలలో పాల్గొన్న సమావేశాలు ఒకటా రెండా! ఎన్నెన్నో! ఆయన పేరున వ్రాసిన ఉత్తరం ఆయన కార్యాలయానికి పంపడంకంటె 'కేరాఫ్ ఏర్ ఇండియా' అని వ్రాసి పంపితే, అవి త్వరగా ఆయనకి చేరేదని అభిజ్ఞులు చతురోక్తిగా అనేవారు. విమానయానం వల్ల ఏదో ఒక అపరాధ పరిశోధక నవల చదువుతూ కొన్ని గంటలసేపు విశ్రాంతి తీసుకొనే అవకాశం ఆయనకి కలిగేదనీకూడా చెపుతారు. కాగా నిర్వ్యాపారత్వం అయన మొదటి శత్రువని ఘంటాపథంగా చెప్పవచ్చు

ఈ సందర్భంగా లండన్ పత్రిక ఒకటి రామస్వామి మొదలియారు గురించి వ్రాసిన వ్యాసంలోని యీ క్రింది పంక్తులు అవశ్యపఠనీయాలు ·

'ఇండియా ప్రభుత్వంలో వాణిజ్య సరఫరా సభ్యుడుగా పనిచేసిన రోజుల్లో సర్ రామస్వామి మొదలియారు నౌకా వ్యాపారానికి గల ఆవశ్యకతను గుర్తించారు అప్పట్లో నౌకా వ్యాపారమన్నది ఇండియాలో లేదు. తదాదిగా నౌకా వ్యాపారాన్ని ఒక ప్రధాన జాతీయ లక్ష్యంగా పెట్టుకొని, దాని అభివృద్ధి చెయ్యాలని ఆయన ఆశించారు. అందుకు ఆయన తన నితాంత శక్తి యుక్తుల్ని ధార వోశారు ఆయన ఆధ్వర్యంలో 'ది ఇండియా స్టీమ్‌షిప్ కంపెనీ' బాగా అభివృద్ధి లోకి వచ్చింది. విదేశ వాణిజ్యం చెయ్యడానికి పూనుకున్న మొదటి భారతీయ కంపెనీ అదే. చాలా సంవత్సరాలు ఆయన భారత జాతీయ ఆవిరి ఓడల



ఆర్కాట్ సోదరులు : సర్ ఎ. రామస్వామి మొదలియార్‌కు
మద్రాసు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసినప్పటి చిత్రం.



సర్దార్ పటేల్‌తో సర్ ఆర్కాట్ రామస్వామి మొదలియార్.



భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూతో సర్ ఆర్కాట్ రామస్వామి మొదలియార్.

(స్టీం షిప్) యజమానుల సంఘానికి అధ్యక్షులుగా వ్యవహరించారు. 1961, నవంబరు 27 న, లాయడ్స్ రెజిస్టర్ ఆఫ్ షిప్పింగ్ తాలూకు ఇండియా సంఘానికి మొదటి అధ్యక్షుడయ్యాడు. డెబ్భైయెదేళ్ళ వయస్సులో ఉన్న సర్ రామస్వామి మొదలియారు గౌరవప్రదమైన తన గత జీవితాన్ని సింహావలోకనం చేసుకోవచ్చు ఆయన యధోచితంగా తన దేశానికీ ప్రపంచానికీ సేవ చేశారు. కాని ఆయనతో పరిచయం గలవారికి, అలా సింహావలోకనం చేసుకొనే సమయం ఇంకా రాలేదని తెలుసు.'

ఆర్థిక విషయాలలో నిష్ణాతుడైన రామస్వామి మొదలియారు దేశమంతటా ప్రముఖ పారిశ్రామిక సంస్థల్ని స్థాపించి, దేశ ఆర్థిక పురోగతికి గట్టి పునాదులు వేసినట్లు భావించవచ్చు.

## చిత్రపటావిష్కరణ :

ప్రసిద్ధ దేశభక్తులూ నాయకులూ అయిన శ్రీ వి.వి. గిరి గారి అధ్యక్షతను 1961, నవంబరులో జరిగిన సభలో తిరువాన్కూరు విశ్వవిద్యాలయం స్నాతకోత్సవ మందిరంలో డాక్టర్ జాకిర్ హుసేన్ రామస్వామి మొదలియారు చిత్రపటాన్ని ఆవిష్కరించారు. ఆయన బహుముఖ ప్రజ్ఞావంతులనీ, తిరువాన్కూరు విశ్వవిద్యాలయాభివృద్ధికి పాటుపడ్డారని జాకిర్ హుసేన్ రామస్వామి మొదలియారుని ప్రస్తుతించారు. గిరి గారు విశ్వవిద్యాలయానికి మొదలియారు చేసిన సేవను కొనియాడి దేశంలోని ప్రముఖ పారిశ్రామికవేత్తలలో ఒకరైన ఆయన అభ్యుదయకరమైన పారిశ్రామికీకరణంలో శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తున్నారనీ పేర్కొన్నారు.

ఏ. యం. యం. చారిటీస్ ట్రస్టువారు 1958 లో మదరాసులోని అంబత్తూరులో రామస్వామి మొదలియారు పేరున ఒక ఉన్నత పాఠశాలను స్థాపించారు. దానిని డాక్టర్ ఏ. ఆర్. మొదలియారు మైసూర్కలని వ్యవహరిస్తున్నారు

ఆంగ్ల భాషాభ్యసనం వాంఛనీయ మని ప్రగాఢంగా విశ్వసించిన వారిలో రామస్వామి మొదలియారు ప్రముఖులు 1954 లో బీహారు విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేస్తూ ఆయన ఆంగ్లం ఆవశ్యకతను స్పష్టం చేశారు. తమ ఉపన్యాసంలో ఆయన ఇలా అన్నారు.

'ఈనాడు ఆంగ్ల భాష ఒక జాతికి చెందింది కాదు. సామ్రాజ్యవాదుల భాష కూడా కాదు. ఆధునిక విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు, వైద్యశాస్త్రం ఇంకా మరి కొన్ని విషయాలను అభివ్యక్తం చెయ్యడానికి ఆ భాష ఒక వాహికగా ఉన్నది. ఆంగ్లభాషాభ్యాసాన్ని నిషేధించడంవల్ల మనం విజ్ఞాన కోశాగారాన్ని మూసివేస్తున్నామని భావిస్తున్నాను. అసలు అభ్యుదయం తలుపులనే మనం మూసివేస్తున్నామనీ భావిస్తున్నాను. హిందీ మాతృభాష కాని వారి యిబ్బందుల్ని, పరిమితుల్ని - అవి తాత్కాలికమైనవే కావచ్చు - అవగాహన చేసుకునేందుకు నిజంగా ప్రయత్నించాలి. బలవంతంగా కాక నచ్చజెప్పి ఆ విధంగా మన దేశంలో జాతీయ భాషను తత్ విజ్ఞానాన్ని వ్యాప్తిలోకి తీసుకురావాలని నా అభిమతం అలాగే, కళాశాలల్లో ఆంగ్ల భాషాభ్యసనం అవసరమని భావిస్తున్నాను. ఎందుకంటే భవిష్యత్తులో కూడా విజ్ఞానశాస్త్రం, వృత్తి విద్యాకోర్సులు సరిఅయిన అవగాహనతో కొనసాగాలి'

## అణ్ణా - నా నాయకుడు :

మదరాసులో అణ్ణాశాలై అని ప్రస్తుతం వ్యవహరించబడుతున్న మౌంటు రోడ్డులో తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి సి.యన్. అణ్ణాదురై గారి నిలువెత్తు శిలా విగ్రహాన్ని 1968, జనవరి 1 న రామస్వామి మొదలియారు ఆవిష్కరించారు. ఆయనే ఆవిష్కరించాలని అణ్ణాదురై అభిలషించారు. విగ్రహావిష్కరణ సందర్భంగా రామస్వామి మొదలియారు అణ్ణాదురైని 'నా నాయకుడు' అని పేర్కొన్నారు.

రామస్వామి మొదలియారు దంపతులకు నలుగురు సంతానం - ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. జ్యేష్ఠ కుమారుడైన డాక్టర్ ఏ కృష్ణస్వామి ప్రముఖ విద్యావేత్త ఆర్థిక విషయాలలో ప్రామాణికుడని పేరు గడించారు. తండ్రి వలె, ఆంగ్లంలో మంచి వక్త. రచయిత కూడ. రెండుసార్లు లోక్‌సభకు (1952-1962) ఎన్నిక అయ్యారు. ఆ రోజులలోనే రామస్వామి మొదలియారు రాజ్య

సభలో సభ్యులుగా ఉండేవారు. అలా తండ్రి కొడుకులు ఏక కాలంలో భారత పార్లమెంటు సభ్యులుగా-తండ్రి ఎగువ సభ సభ్యులుగా, కుమారుడు ప్రజా ప్రతినిధుల సభా సభ్యుడుగా ఉండడం పేర్కొనదగిన విశేషం. రెండవ కొడుకు ఏ ఆర్. దామోదరన్‌గారు కొంత కాలం మదరాసు శాసన మండలిలో సభ్యులుగా ఉండేవారు. వీరు కడలూరు పురపాలక సంఘాధ్యక్షులుగా వ్యవహరించారు.

మహావక్తగా, రాజనీతివేత్తగా, ప్రముఖ పారిశ్రామికవేత్తగా, జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన ఆర్కాటు రామస్వామి మొదలియారు 1976, జూలై 7న స్వర్గస్థులయ్యారు. అప్పటి కాయన ఎనభై తొమ్మిదేళ్ళ వృద్ధుడు. ఆయన చిరంజీవి! ప్రపంచ మహామరుషులలో ఆయన ఒకరు!

## తెలుగు కావ్యానికి కృతిభర్త :

ఆంగ్ల భాషలో అఖండ పాండిత్యం గడించినప్పటికీ, రామస్వామి మొదలియారుకి తెలుగు భాషా సాహిత్యాల పట్ల అభిమానం ఉండేదని చెప్పవచ్చు. ఇందుకు నిదర్శనం ఆయన ఆచార్య గంటి జోగి సోమయాజిగారి 'రామచంద్రుని హంపీ యాత్ర' అనే కావ్యాన్ని స్వీకరించడమే. అప్పట్లో రామస్వామి మొదలియారు భారత శాసన సభా సభ్యులు (1930) మదరాసు పురపాలక సంఘాధ్యక్షులు కూడా (1928-30).

సోమయాజిగారి కావ్యం ప్రస్తుతం అలభ్యం కనుక, ఆయన వ్రాసిన పది అంకిత పద్యాలను యథాతథంగా ఉదాహరిస్తున్నాను. ఈ పద్యాలలో రామస్వామి మొదలియారు వంశాభివర్ణనం ప్రముఖ స్థానం వహించింది.

1. ఎవ్వని యాజ్ఞను నినుఁడు చరించును
        నిత్యమ్ము విడక నిర్ణీత పథము
   కోటానఁ గోటులై వాటిల్లు నుడుగోళ
        వితతి ఎవ్వని స్వేద బిందు పాళి
   వికసించు పూమొగ్గ విలసిల్లు నెవ్వని
        సువ్యక్త శక్తులు సూక్ష్మగతిని
   నెవని సత్తయె యెల్ల యిరవుల గాన్పించి
        స్థితినిఁ గల్పించు నీ సృష్టి కెల్ల

నఖిల జగముల కారణంబగు నెవండో
యట్టి సచ్ఛక్తిమయుఁడగు నట్టి దేవుఁ
డాయు రారోగ్య భాగ్యంబు లధికముగను
నిచ్చి మత్కృతి భర్త రక్షించుఁగాత.

2. వనములఁదపియించు మునులకు శృతిరూప
మున సత్యమును దెల్పు ఘనుఁ డెవండు
పొదలోని మంటలో మోసెస్సునకుఁ దోఁచి
ధర్మ సూత్రాలనే తాత దెలిపెఁ
దన కుమారునిఁ బంపి ధర్మైక మార్గంబుఁ
బల్కఁ జేసిన భగవంతుఁ డెవఁడు
హీరా గిరీంద్రమ్ము నెక్క మహమ్మదు
జ్ఞానిఁ జేసిన మహాజ్ఞాని యెవఁడు
అన్ని మతముల కొక్కడై యలరు నెవఁడు
అట్టి యీశుండు శుభముల నమరఁ జేసి
రామసామిని నాతని భాతృవరుల
సంతతానందమునఁ దేల్చి సాఁకుఁ గాత.

3. కృతుల రచించి కొందఱు కవీంద్రులు రాజులకో మహాధనో
ద్ధతుల కొ యిచ్చి వారి కడ ద్రవ్యముఁ బొందిరి గాని మాకు నా
కత యిసుమంత చెల్లదు, సుఖంబగు ప్రేమము గౌరవంబునన్
హితమును గారణంబులుగ నిచ్చెద మత్కృతి రామసామికిన్.

4. వ్యక్తికి వ్యక్తికిన్ గలుగు బంధము లాంతర కారణంబులున్
వ్యక్తము లయ్యెడున్ వెలియుపాధులఁ బ్రేమము లాశ్రయింపవన్
సూక్తి నిజమ్ము మా యెడను సుస్థిరమైన యనేక బంధముల్
ప్రాక్తన జన్మ వాసనల భాసిలు నందురు శాస్త్ర కోవిదుల్.

5. ఆఱు వర్షమ్ములకు ముందు నయిన పరిచ
యమ్ము వడిగ వర్ధిలి బలమైన మైత్రి
యగుచుఁ నిప్పు డీరీతి కావ్యైక బంధ
మై ఫలించెను విధికృత మబ్బురంబు !

6. కాల మహా ప్రవాహమున క్షాళితమై జనవృత్త నామముల్
తేలయి పోవు బుద్బుద విధిన్ గవి సత్కృతు లన్న లంకలం
దేలిన వారి నామములు నిల్చు స్థిరంబుగ నందురెల్ల రా
లీలనె శాశ్వతమ్మయి వెలింగెడు మత్కృతి నాథు వృత్తమున్.

7. మొదలై పంట వలంతి ప్రాపుగొని సమ్మోదంబుఁ గల్పింపఁగా
మొదలై యార్థిక రాజకీయముల సంపూర్ణంబు శాసింపఁగా
మొదలార్ నాఁజను సార్థ కాహ్వయమునన్ బొల్పొందు వంశంబులో
నుదయం బందెను కుప్పుస్వామి సుగుణా నూనుండు పుణ్యాత్ముఁడై.

8. అల టిప్పుసుల్తాను నా జ్ఞాను వర్తులై
యలరు వీరుల వంశమందుఁ బుట్టి
యార్కాటులో విద్యనభ్యాస మొనరించి
కర్నూలులో రాజ కార్య దీక్ష
నుద్యోగ గరిమను నొప్పారి ఋజుమార్గ
వర్తియన్ ఖ్యాతిని వాసిగాంచి
మనసులో వర్తించు ననుకూల గతియైన
కుల కాంత సిద్ధమ్మ కుక్షిఁ గనియె
సుతులఁ బెక్కండ్ర కుపుసామి యతుల మతుల;
వారిలో రత్నములఁ బోలి వఱలు రామ
సామి దొరసామి లక్ష్మణ సామి యనెడు
వారు దక్షులై కీర్తిని ప్రబలు వారు.

9. ముగురును మూడు రత్నములమూల్యులు పల్కిన పల్కు నిల్వఁగా
దగిన సమర్థు లాప్తుల కుదారులు నమ్మిన మంచి కెప్పు దా
మగుదురు వీరు వారనక న్యాయము నెల్లర కబ్బునట్లుగాఁ
దగు పనిసేయు చుందురు సధర్ములు మీఁద నికేమి గావలెన్.

10. మాలికను వెల్గు నాయకమణి విధాన
నా మహితులలో నలరారు రామస్వామి
మొదలి కర్పింతుఁ బ్రేమ నీ పుస్తకంబు
తనరుఁగావుత మా చంద్ర తారకముగ.

# లక్ష్మణస్వామి మొదలియారు

## వైద్యశాస్త్రాధ్యయనం :

రామస్వామి మొదలియారు ప్రముఖ న్యాయవాదిగా, ప్రసిద్ధ రాజనీతి వేత్తగా లబ్ధప్రతిష్ఠులు కాగా, లక్ష్మణస్వామి మొదలియారు ప్రముఖ వైద్య శాస్త్రజ్ఞులుగా, ప్రసిద్ధ విద్యావేత్తలుగా అజరామరమైన యశస్సు గడించారు వారిద్దరూ అనురూపులే అయినా, చదువు సంధ్యల విషయంలో మాత్రం విభిన్నులు. కాని యిద్దరూ తాము నేర్చిన విషయాలలో అఖండు లనిపించుకున్నారు

యఫ్. యే. పరీక్షలో కృతార్థుడైన పిమ్మట రామస్వామి మొదలియారు క్రైస్తవ కళాశాలలో బి. ఏ. చదివి అనంతరం న్యాయశాస్త్ర పట్టభద్రులయ్యారు.

లక్ష్మణస్వామి మొదలియారు 1905 లో మదరాసు వైద్య కళాశాలలో చేరి వైద్యవిద్య అభ్యసించసాగారు. నాలుగేళ్ళ యల్. యం యస్ కోర్సు పూర్తి చేసి, ఆ పట్టం పొందారు. అప్పటికాయన ఇరవై రెండేళ్ళ యువకుడు.

లక్ష్మణస్వామి మొదలియారుకి ఉద్యోగం కోసం అన్వేషణ సాగించే అవసరం లేక పోయింది పట్టం చేతికి వచ్చిన వెంటనే ఆయనకి ప్రభుత్వ వైద్య శాఖలో ఉద్యోగం లభించింది. 1909, అక్టోబరులో ఆయన ఉద్యోగంలో చేరారు మొదటి సంవత్సరం మధురలో, పళనిలో గడిచింది ఆ తర్వాత ఆయన మదరాసుకి బదలీ అయ్యారు.

లక్ష్మణస్వామి మొదలియారు వైద్యవృత్తిని, ఉన్నతమైన బాధ్యతాయుతమైన వృత్తిగా భావించారు. రోగుల్ని శ్రద్ధగా పరీక్షించేవారు. రోగనిదానంలో ఆయన ఎంతో శ్రద్ధపాటించేవారు. సహనం, బాధ్యత ఈ రెంటికీ ఆయన సమ ప్రాధాన్య మిచ్చారు. ప్రతిదీ లోతుగా పరిశీలించడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య అనవచ్చు

## మదరాసులో ఉద్యోగం :

మదరాసులో మొదట ఆయన్ని జనరల్ హాస్పిటల్‌లో డొనోవన్ అనే ప్రసిద్ధ వైద్యుడికి సహాయకుడిగా నియమించారు. కాని లక్ష్మణస్వామి మొదలియారు ప్రతిభ అక్కడ పరిపూర్ణంగా వికసించలేదు. 1912 లో ఆయన్ని ఎగ్మోరులో ఉన్న ప్రభుత్వ మహిళల, శిశువుల ఆసుపత్రికి బదిలీ చేశారు. ఏ సుముహూర్తాన ఆ బదిలీ జరిగిందో కాని, ఆనాటి నుంచీ ఈయన ప్రతిభా విశేషాలు లోకానికి చక్కగా తెలియ సాగాయి. ఆయనకి నచ్చిన పని లభించింది. శ్రద్ధా సక్తులతో పనిచెయ్యసాగారు. భావి కాలపు కీర్తి సౌధానికి పునాది వేసి నట్లయింది.

1914 లో ఆయన బి. యే. పట్టం పొందారు ఆ సంవత్సరమే ఆయన్ని రాయపురంలోని మెటర్నటీ (ప్రసూతి) హాస్పిటలుకి బదిలీ చేశారు. అక్కడ కూడ ఆయన సమర్థుడైన వైద్యుడని పేరు గడించారు. అక్కడ ఆరేళ్ళు పనిచేశారు.

ఆ తర్వాత, అనగా 1920 లో, ఆయన్ని ప్రభుత్వ మహిళల శిశువుల ఆసుపత్రికి బదిలీచేశారు అక్కడ ఆయన అవిచ్ఛిన్నంగా అప్రతిహతంగా పాతి కేళ్ళకు పైగా పనిచేశారు ఆ రోజులలో ఆ ఆసుపత్రి పేరు ప్రతిష్ఠలు దేశ మంతట వ్యాపించాయి చివరికి అది అంతర్జాతీయంగా కూడ ఖ్యాతి పొందింది. ప్రాచ్య దేశాలలోనే ఆ ఆసుపత్రికి పెద్దది, ప్రశస్తమైనది అనే పేరు వచ్చింది. ఆ ఆసుపత్రికి బర్మా, మలేషియా, జావా, చైనా మొదలైన దేశాల నుంచి స్నాతకోత్తర వైద్య విద్యార్థులు తరచుగా రాకపోకలు సాగించాడు.

## వివాహం :

1916 లో లక్ష్మణస్వామి మొదలియారు దామోదర మొదలియారు చిన్నకూతురైన రాధాబాయిని వివాహం చేసుకున్నారు. ఆమె విద్యావతి. సాధు శీల. ఎన్నడూ సంఘంలో పేరు పెంపులకు తాపత్రయం చెందని గృహిణి. గృహనిర్వహణ బాధ్యత అంతా ఆ యిల్లాలిదే. ఆమెకు దైవభక్తి ఎక్కువ ఉదయం ఆమె పూజా గృహంలోనే చాలాసేపు గడిపేది ఇక శనివారం వచ్చిందంటే, శ్రీ వేంకటేశ్వరుని పూజాదికంలో ఆమె కాలం గడిపేది అంత భక్తి తత్పరత ఆమెకు!

## వైద్యశాస్త్రంలో అసమాన ప్రతిభ :

లక్ష్మణస్వామి మొదలియారు వైద్యకళాశాలలో విద్యార్థిగా ఉన్న రోజుల్లో, తరువాతి కాలంలో మదరాసు శాసన మండలికి ఉపాధ్యక్షురాలుగా వ్యవహరించిన డాక్టర్. యస్. ముత్తులక్ష్మి రెడ్డి అదే వైద్య కళాశాలలో విద్యార్థినిగా ఉండేవారు. 'విద్యార్థినీ విద్యార్థులు ఆ రోజులలో కలసిమెలసి ఉండేవారు కారు. లక్ష్మణస్వామి మొదలియారు విద్యార్థి జీవితం గురించి నా కంతగా తెలియదు' అని ఆమె పేర్కొన్నారు. కాని విద్యార్థులుగా ఉన్న రామస్వామి, లక్ష్మణస్వామి మొదలియార్లు ఆమెకు బాగా తెలిసినవారే. పరశువాకంలో వాళ్ళు ఇరుగు పొరుగు ఇండ్లలో నివసించారు

లక్ష్మణస్వామి మొదలియారు ఎగ్మూరు ఆసుపత్రిలో ఆసిస్టెంటు సర్జనుగా నియమితుడైనప్పుడు ముత్తులక్ష్మిరెడ్డిగారు హవుస్ సర్జన్‌గా నియమితులయ్యారు. ఆ ఆసుపత్రికి అప్పట్లో కల్నల్ గిఫర్డ్ సూపరింటెండెంటుగా ఉండేవారు. హవుస్ సర్జన్ విధానం అప్పుడే ప్రవేశపెట్టబడింది. ఇరుగు పొరుగు ఇండ్లలో నివసిస్తున్నా, అంతగా పరిచయం లేకపోయినా ఒకే ఆసుపత్రిలో పనిచేస్తున్న కారణంగా లక్ష్మణస్వామి మొదలియారు ప్రదర్శించిన వైద్యశాస్త్ర ప్రతిభను ఆమె తన 'ప్రపంచ అద్భుతాలలో ఒకటి' అనే వ్యాసంలో ఇలా పేర్కొన్నారు :

'డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియారు ప్రశాంతంగా నిజాయితీగా వ్యవహరించేవారు. ఇంగ్లీషులో మనస్సుకి హత్తుకునేలా మాట్లాడేవారు అందువల్ల యూరోపియన్ సూపరింటెండెంటు అయిన కల్నల్ గిఫర్డు తదితరులు ఆయన్ని ఎంతో అభిమానించేవారు. తత్ఫలితంగా ఆయనకి బదిలీల బెడద తప్పిపోయింది; ఆ ఆసుపత్రిలోనే అవిచ్ఛిన్నంగా పనిచేయగలిగారు. ఆ విధంగా ఆయన ప్రసూతి, శిశు సంక్షేమ విషయాలలో నిపుణులు కాగలిగారు 1914 లో నా తొలి కాన్పు కష్ట ప్రసవంగా తయారయింది. అనుభవజ్ఞుడు, ఘటికుడు అయిన ప్రసూతి వైద్యుడు నన్ను పరీక్షించాడు కాని ఆయన నా కష్ట ప్రసవానికి కారణమేమిటో తెలిసికోలేక పోయాడు అప్పుడు మావారు డాక్టర్ టి.యస్. రెడ్డి, (యఫ్ ఆర్ సి.యస్) ఆ అనుభవజ్ఞుడైన వైద్యుడికి సహాయ పడవలసిందిగా మా

ప్రక్క యింటి మొదలియారు గారిని అర్థించారు. నిజం చెప్పాలంటే, డాక్టరు మొదలియారే నన్నూ నా బిడ్డనూ కాపాడారు. అనుభవజ్ఞుడైన ఆ వైద్యుడేమో అసలు కారణాన్ని తెలుసుకోలేక పోయాడు; ఆ నిస్పృహకొద్దీ ఆయన బిడ్డ తలలో చిల్లులు పొడిచి నన్ను మాత్రం మృత్యుముఖం నుంచి కాపాడాలని అనుకున్నాడు. డాక్టరు మొదలియారు ఆయనకంటె ఎంతో జూనియరు అయినా, ఆయనకి తగిన సలహా యిచ్చి మొదలియారు నన్నూ నా బిడ్డను కాపాడారు. ప్రస్తుతం మా అబ్బాయి రామమోహన్ ఢిల్లీలో కేంద్ర వాటర్ అండ్ పవర్ కమిషనులో డైరెక్టరుగా పనిచేస్తున్నాడు జూనియరుగా ఉన్న రోజుల్లోనే లక్ష్మణ స్వామి మొదలియారు వయస్సుకి మించిన వైద్యవిజ్ఞానాన్ని అనుభవాన్ని ప్రదర్శించగలిగారు. ఆసుపత్రిలోనే కాక బయట కూడ ప్రసూతి వైద్యుడుగా ఎన్నో కేసులు చూసి ఎందరినో కాపాడి ఉంటారని నా అభిప్రాయం. ఆయన తన వృత్తికి ఒక గర్వకారణంగా భాసించారు. పైగా నిధివంటి వారు. ఆయన ప్రముఖ ప్రసూతి శాస్త్రజ్ఞుడు; స్త్రీల వ్యాధుల్ని నయం చెయ్యడంలో చాలా ఘటికుడు. ఆయనకీ నాకూ ప్రొఫెసరుగా ఉన్న కల్నల్ గిఫర్డుకి మొదలియారు అభిమాన పాత్రుడైన శిష్యుడు ప్రభుత్వ మహిళల శిశువుల ఆసుపత్రిలో గిఫర్డు పేరున వ్యవహృత మవుతున్న స్మారక పారశాల వల్ల ఆయన నిత్యమూ స్మరింపబడుతున్నాడు. ఆ తర్వాత డాక్టర్ ఏ యల్. మొదలియారు ప్రసూతి, శిశు సంక్షేమ విషయాలలో ప్రామాణికులని పరిగణింపబడ్డారు మదరాసు వైద్య కళాశాలలో ఆ శాస్త్ర విషయాలు చాలా కాలం వందలు వేల విద్యార్థులకు ఆయన బోధించారు.'

ముత్తులక్ష్మిరెడ్డిగారు యం. బి అండ్ సి. యం. డిగ్రీ పొందిన విదుషి ఆమె వైద్య వృత్తి అవలంబించారు. అలాంటి విదుషి పేర్కొన్న ఈ విషయాదికాన్ని అలవోకగా పరిశీలించినా లక్ష్మణస్వామి మొదలియారు వయస్సుకి మించిన వైద్య విజ్ఞానం ప్రదర్శించారనీ; మూర్తీభవించిన ప్రముఖ వైద్యశాస్త్రజ్ఞుడని అభివ్యక్త మవుతుంది కనుకనే ఆమె మొదలియారుని 'ప్రపంచ అద్భుతాలలో ఒక'రని సహేతుకంగా పేర్కొన్నారు.

ఇతరుల దయా దాక్షిణ్యాలవల్ల గాక స్వయం ప్రతిభతో పైకి వచ్చిన ప్రముఖుడు లక్ష్మణస్వామి మొదలియారని కట్టమంచి రామలింగారెడ్డి గారు

చెప్పిన మాటల్ని స్ఫురణకు తెచ్చుకోవటం అవసరం ఆయన శీలం, మనోహర ములైన పద్ధతులు యువకులకు ఆదర్శములనీ కట్టమంచివారు పేర్కొన్నారు. మొదలియారు చికిత్స విషయంలో ఎంతో శ్రద్ధ వహించారనీ, కనుకనే ఆయన అంతర్జాతీయ విఖ్యాతి గడించగలిగారనీ, వైద్యశాస్త్రంలో నిపుణులనీ, ఉత్తమ అధ్యాపకులనీ ఆయన తరగతులు విద్యార్థుల మన్ననకు పాత్రము లైనాయనీ కట్టమంచివారు ప్రశంసించారు.

లక్ష్మణస్వామి మొదలియారు శిష్యులలో ఒకరు ప్రముఖ విద్యావేత్త అయిన డాక్టరు పి జగన్నాథరెడ్డిగారు. ఆయన తమ గురువుగారికి ఇలా నీరాజనం అర్పించారు.

'వైద్య కళాశాలల్లో ఆచార్య పదవులు ఇండియన్ మెడికల్ సర్వీసులోని వారికే పరిమితమైన ఆనాళ్ళలో, లక్ష్మణస్వామి మొదలియారు వైద్య కళాశాలలో 1934 నుంచి 1942 దాకా ప్రసూతి, స్త్రీల వ్యాధులకు సంబంధించిన విజ్ఞాన శాఖలకు ఆచార్యులుగా వ్యవహరించారు. చాలాకాలం ఆయన గిఫర్డు ప్రసూతి, స్త్రీల వ్యాధుల స్కూలులో క్రిక్కిరిసిన శ్రోతల్ని, విద్యార్థులనీ ఉద్దేశించి ఉపన్యాసాలు చేశారు సూదిమోపిన సవ్వడి కూడ వినిపించనంత నిశ్శబ్దంగా ఉండేది ఆయన తరగతి. శ్రోతలు ఎంతో శ్రద్ధగా ఉపన్యాసం వినేవారు. ప్రసూతి, స్త్రీల వ్యాధులకు సంబంధించిన విషయాలలో ఆయనకిగల వైదుష్యం ఆ ఉపన్యాసాలవల్ల బహిర్గత మయింది. పైగా ఆయన ఉపన్యాసంలో స్పష్టత ఉండేది. ఆ ఉపన్యాసాలలో హాస్యరసం తరుచుగా తొణికిసలాడేది. అప్పుడప్పుడు ఆనందోత్సాహాలతో ప్రసూతి పట్కారు (ఫోర్సెప్స్) చరిత్రను సైతం వివరించేవారు. వార్డులు తనిఖీ చేస్తూ కేసుల్ని వివరించేటప్పుడు, రోగ నిదానం గురించి చెప్పేటప్పుడు, ఆపరేషన్ థియేటరులో ఉన్నప్పుడు బయట ఆయన ప్రతిభ అభివ్యక్త మవుతున్నప్పుడు అది రాత్రి అయినాసరే పగలైనాసరే ఆయన్ని స్నాతకోత్తర విద్యార్థులు కింది తరగతుల విద్యార్థులు చుట్టుముట్టి ఉండేవారు. లాహోరు, లక్నో, హైదరాబాదు, మైసూరు, ఆంధ్ర ప్రాంతాల విద్యార్థులేకాక రంగూను, దూర ప్రాచ్యం మొదలైన ప్రాంతాల విద్యార్థులూ ఆయన్ని చుట్టుముట్టి ఉండేవారు. కాగా ఆయన అధ్వర్యం వహించిన ఆ స్కూలు ప్రముఖ వైద్యవిద్యా కేంద్ర మయింది; పరిశోధనకు రోగ నివారణకూ నెలవయింది.

ఒకవైపు బోధన, మరొకవైపు చికిత్సగా ఆయన జీవితం సాగుతున్నా, మొదలియారు నిత్య విద్యార్థిగా ఉండేవారు. 1922 లో ఆయన యం. డి. (వైద్యశాస్త్రంలో డాక్టరేటు) పట్టం పొందారు మాతృత్వం, శిశు సంక్షేమం గురించి ఆయన ఆంగ్లంలో అద్భుతమైన పుస్తకం వ్రాశారు. ఈ శాస్త్ర విషయం గురించి భారతీయ రచయిత వ్రాసిన తొలి పాఠ్యపుస్తకం ఇదే ఇప్పటికి ఈ ప్రామాణిక రచన ఎన్నోసార్లు ముద్రితమై వైద్య విద్యార్థులకు ఉపయోగపడుతున్నది ఈ పుస్తకం రచయితకు పేరు ప్రతిష్ఠలు సమకూర్చింది నేటికీ ఇది ఒక ప్రామాణిక రచనగా భావించబడుతున్నదంటే, ఆ రచన ఎంత ప్రశస్తమైనదో ఊహించుకోవచ్చు.

తాను పొందిన అనుభవాన్ని, కనుగొన్న క్రొత్త విషయాలను లక్ష్మణస్వామి మొదలియారు తన క్లినిక్కులో చొప్పించారు 'భారతదేశంలోనే స్త్రీల వ్యాధుల చికిత్సకుడుగా ఆయన్నిమించినవారు మరొకరు లేరు' అనే కీర్తి ఆయన్ని వరించింది. ఆ విధంగా ఆయన 1928 నాటికి విఖ్యాత వైద్యుడుగా నలుగురి మన్ననలు పొందగలిగారు.

మదరాసు ప్రభుత్వం లక్ష్మణస్వామి మొదలియారు ప్రతిభను గ్రహించగలిగింది. పాశ్చాత్య దేశాలలోని వైద్యవిజ్ఞాన ప్రగతిని క్షుణ్ణంగా గ్రహించేదుకు వీలుగా పన్నెండు నెలలు ప్రపంచ పర్యటన చేయవలసిందిగా ఆయన్ని కోరింది. ఇదే ఆయన కావించిన తొలి విదేశ పర్యటన.

ఆ అవకాశాన్ని వినియోగించుకొని లక్ష్మణస్వామి మొదలియారు గ్రేట్ బ్రిటన్, ఐర్లండు, పారిస్, వియన్నా, బెర్లిన్, బ్రసెల్స్, ఆమ్‌స్టర్‌డం మొదలైన పెక్కు ప్రదేశాలు పర్యటించారు ఎడిన్‌బరోలో జరిగిన ప్రసూతి, స్త్రీల వ్యాధుల సదస్సులో పాల్గొన్నారు. కొన్ని ఆసుపత్రులు పనిచేసే తీరుతెన్నులు చక్కగా గమనించారు. కొన్ని విశ్వవిద్యాలయాలలో వైద్యశాస్త్రానికి సంబంధించిన స్నాతకోత్తర పాఠ్యప్రణాళికల్ని పరిశీలించారు కొత్త అంశాలు గ్రహించారు.

స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత ఆయన తాను విదేశాలలో గడించిన అనుభవాన్ని సద్వినియోగం చెయ్యడానికి పూనుకొన్నారు. స్నాతకోత్తర పాఠ్యాంశా

లలోను, పరిశోధనరంగంలోను మార్పులు ప్రవేశపెట్టారు. బిడ్డలకు వచ్చే రికెట్స్ మొదలైన వ్యాధుల విషయంలో పరిశోధన సాగాలని సూచించారు. భారతీయ విశ్వవిద్యాలయాల వైద్య విజ్ఞాన పత్రిక ఒకటి వెలుగులోకి రావాలని సూచించారు ప్రసూతి, స్త్రీల వ్యాధుల్ని గురించి ఒక డిప్లొమా కోర్సు ప్రారంభించాలని సూచించారు. ఆయన చేసిన వివిధ సూచనలలో ఇది తలమానికమైనదని విజ్ఞులు భావిస్తారు అంతకు ముందు మనదేశంలో ఏ విశ్వవిద్యాలయంలోనూ ఇలాంటి కోర్సు లేదు

ఆయన బ్రిటన్‌లో ఉన్న రోజుల్లో, వైద్యశాస్త్ర పరిషత్తుల సమావేశాలలో చురుకుగా పాల్గొన్నారు. పాల్గొన్న ప్రతి సమావేశంలోనూ తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్నారు. కనుకనే 1930 లో ప్రసూతి శాస్త్రజ్ఞుల, స్త్రీల వ్యాధుల శాస్త్రజ్ఞుల రాయల్‌కాలేజీ మొదటిసారిగా స్థాపించబడినప్పుడు, లక్ష్మణస్వామి మొదలియారుని విశిష్ట సభ్యునిగా (ఫెలో) ఎన్నుకున్నారు. ఈ విశిష్ట గౌరవం పొందిన మరో భారతీయుడు సర్ కేదారనాథ్ దాస్

లక్ష్మణస్వామి మొదలియారు ప్రసిద్ధ వైద్యపత్రికలకు వ్యాసాలు వ్రాయసాగారు. తత్ఫలితంగా ఆయన ఎలిజబెత్ మత్తయి ఉపన్యాసాలు, కర్జన్ ఉపన్యాసాలు, మొదలైనవి చేసి ప్రముఖుల మన్ననలు పొందారు.

## ఉత్తమ అధ్యాపకుడు :

'నే నెప్పుడూ మంత్రసానినే' (**I have always been a midwife**), అని లక్ష్మణస్వామి మొదలియారు సవినయంగా చెప్పుకొనే వారట. ఆయన 'ది సేఫెస్ట్ మిడ్ వైఫ్' (సురక్షిత మంత్ర సానిత్వం) అని కీర్తి గడించారు ప్రసూతిశాస్త్రజ్ఞుడైన ఆయన ఎందరో స్త్రీలను మృత్యుముఖం నుంచి తప్పించి వారికి ప్రాణదానం చేసిన ధన్యుడు. భేదభావం అణుమాత్రమైనా పాటించక సేవచేసిన పుణ్యపురుషు డాయన స్త్రీల వ్యాధులు గురించి, ప్రసూతి శాస్త్రం గురించి బోధించడంలో లక్ష్మణస్వామి మొదలియారు అద్వితీయుడని అభిజ్ఞులు ముక్తకంఠంతో పేర్కొంటారు. ఆయన ప్రసంగాలలో డొంకతిరుగుడు ఉండేది కాదు. అవి వినసొంపుగా ఉండేవి. మధ్య మధ్య రక్తి గొలిపే ఉదంతాలు

దొర్లుతూ ఉండేవి ఎక్కడా పాండిత్య ప్రకర్ష కనిపించేద కాదు. ఇతర విభాగా లలో ఉండే విద్యార్థులు కూడా ఆయన ఉపన్యాసాలు వినడానికి తహతహ లాడే వారట. అయినా ఆయన ఎప్పుడూ సహజ వినయంతో సంచరించేవారు. ఆయన నిండు కుండ!

నేటి విజ్ఞానానికి రేపటి నూత్న సిద్ధాంతాలవల్ల కాలదోషం పట్టవచ్చునని భావించిన ఉదార దృక్పథం ఆయనది అందువల్ల విద్యార్థులు నిత్యవిద్యార్థులై సంచరిస్తూ కొత్త విషయాలను సహర్షంగా ఆదరిస్తూ ఉండాలని ఆయన ఉద్బోధించే వారు అప్పుడు విద్యార్థి న్యూనతా భావాన్ని అధిగమించగలడని ఆయన అభిప్రాయం నిశితమైన పరిశీలనవల్ల, అధ్యయనంవల్ల వైద్యవిద్యార్థి భావి జీవితంలో వర్తకునిగా కంటె వృత్తిపరంగా నిపుణుడు కాగలడని ఆయన ప్రగాఢ విశ్వాసం. అందుకే ఆయన, 'విద్యార్థుల చేతిలో ఒక కత్తి, శవంలోని ఒక భాగాన్ని ఉంచి చూడండి' అనేవారట. అనగా విద్యార్థులు తమకు తామే అనుభవ పూర్వకంగా కొన్ని విషయాలు నేర్చుకోవాలని ఆయన ఆశించారు. పరీక్షలలో విజయం సాధించడానికి కొన్ని విషయాలను వల్లెవెయ్యడం మంచిదే కావచ్చు; కాని వైద్యశాస్త్ర నైపుణ్యం గడించాలంటే సునిశిత పరిశీలన అత్యవసర మని ఆయన భావించారు.

లక్ష్మణస్వామి మొదలియారు సాధారణంగా ఎంత ప్రశాంత గంభీరులో, క్లినిక్కులో కొన్ని సందర్భాలలో అంత పరిహాస కుశలురుగా కనిపించేవారు. ఆయన ఒకసారి ఒక విద్యార్థిని చూసి, 'ఒక స్త్రీకి నొప్పులు వస్తున్నాయి, కాని మర్మావయవం పెద్దది కాలేదు. అప్పుడేం చేస్తావు?' అని అడిగారట అందుకు ఆ విద్యార్థి, 'నేను లామినరీ టెన్ట్ ప్రయత్నించి చూస్తాను' అని సమాధాన మిచ్చాడు వెంటనే ఆయన యిలా అన్నారట 'నాయనా, గొడుగులూ గుడారాలు (టెన్ట్) ఎడారి మధ్యలో బాగానే వుంటాయి కాని స్త్రీ మధ్య భాగంలో కాదు.'

విద్యార్థిలోని ప్రతిభను పసిగట్టి దాన్ని ప్రోత్సహించడం ఉత్తమ అధ్యాపకుని లక్షణం. ఈ లక్షణం లక్ష్మణస్వామి మొదలియారులో ఉండేది. ఆయన ఎప్పుడూ విద్యార్థిలో నిగూఢంగా ఉన్న ప్రతిభను వెలికి తీయడానికి ప్రయత్నించే వారు. ఆయన తన వృత్తిని ఒక బరువుగా ఎన్నడూ భావించలేదు వృత్తి పట్ల

ఎంతో శ్రద్ధాసక్తులు ప్రకటించే వారు ఆయన తెల్లవారు జామున లేచేవారు. ఆయన నిత్య విహిత కర్మలలో దైవ ప్రార్థనకి అగ్రస్థానం లభించేది. ఆ తర్వాత ఆఫీసు కాగితాలు ఆయన దృష్టిని ఆకట్టుకొనేవి ఉదయం ఎనిమిదింటి కల్లా ఆయన తన కన్సల్టింగ్ గదిలో ఉండేవారు. విరామ మెరుగని వైద్యుడు! పైగా అద్భుతమైన జ్ఞాపక శక్తి జటిల సమస్యను కూడా అనాయాసంగా అవగాహన చేసుకొనే వారు. చర చర పని ముగించే వారు. కనుకనే ఆయన అంత ప్రసిద్ధ వైద్యుడు కాగలిగారు

## విశిష్ట గౌరవం :

1939 వ సంవత్సరం లక్ష్మణస్వామి మొదలియారు జీవితంలో బంగరు టక్షరాలతో వ్రాయదగింది. చాలా కాలం చిత్తశుద్ధితో సమర్థంగా పనిచేసిన ప్రభుత్వ మహిళల శిశువుల ఆసుపత్రికి ఆయన్ని ఆ యేడు సూపరింటెండెంటుగా నియమించారు. ఆ యేడే ఆయన్ని మదరాసు వైద్యకళాశాలకు ప్రిన్సిపాలుగా కూడ నియమించారు ఈ రెండు ఉన్నత పదవులలోను నియమితుడైన తొలి భారతీయుడు లక్ష్మణస్వామి మొదలియారే. ఆ రోజుల్లో ప్రిన్సిపాలు పదవిలో ఐ యం.యస్ కి (ఇండియన్ మెడికల్ సర్వీస్) చెందిన వారినే నియమించే వారు. ఈ విశిష్ట గౌరవం మొదలియారుకి కొంచెం ఆలస్యంగానేలభించిందని చెప్ప వలసి వుంటుంది. ఆ రోజుల్లో ఉద్యోగుల నియమ నిబంధనలు అలా ఉండేవి. పరిపాలనాదక్షుడుగా ఆయన ఈ రెండు గొప్ప పదవులలోను రాణించారు కాని ఆ తర్వాత చాలా కాలం ఆయన ఆ పదవులు నిర్వహించలేదు.

ప్రిన్సిపాలుగా ఆయన కాలేజిలోను, ప్రధానాధికారిగా ఆసుపత్రిలోను క్రమశిక్షణ నెలకొల్పడానికి గట్టి కృషి చేశారు కేవలం మార్కుల్ని బట్టి కాక విద్యార్థుల ప్రతిభను బట్టి కూడా వారిని కళాశాలలో చేర్చుకోవాలని ఆయన ఆశించారు. ఆ విషయంగా ఆయన ఒకసారి కోర్టుకి హాజరై తన వాదనను సమర్థించుకోవలసి వచ్చింది. ఫార్మసీలో (ఔషధాల తయారీ) డిగ్రీ కోర్సు ఏర్పాటు చెయ్యడానికి ఆయనే కారకుడు. అంతకుముందు ఏ భారతీయ విశ్వ విద్యాలయం లోను అలాంటి డిగ్రీ కోర్సు లేదు

వైద్యవిజ్ఞాన శాస్త్ర రంగంలో ఆయన కావించిన విశిష్ట సేవకు గుర్తింపుగా ఆయన్ని 1941 లో అమెరికన్ కాలేజ్ ఆఫ్ సర్జన్సుకి విశిష్ట సభ్యునిగా (ఫెలో) ఎన్నుకున్నారు వైద్యవృత్తిలో ఉన్న వారి సంక్షేమం కోసం కూడా ఆయన నిర్విరామంగా కృషిచేశారు 1912 లో మదరాసు వైద్య సంఘం స్థాపించబడింది. తదాదిగా ఆయన ఆ సంఘం అభివృద్ధికి పాటుపడ్డారు ఆయనే దానికి తొలి కార్యదర్శి చాలా కాలం అధ్యక్షునిగా వ్యవహరించారు.

## మాతా శిశు సంక్షేమం :

ప్రముఖ ప్రసూతి శాస్త్రజ్ఞుడు కనుక, లక్ష్మణస్వామి మొదలియారు దృష్టి సహజంగా మాతా శిశు సంక్షేమం వైపు ప్రసరించడంలో ఆశ్చర్యంలేదు మంత్రసానిత్వంలో ఆయన ఎంత పేరు గడించారో, అలాగే స్త్రీల వ్యాధులకు సంబంధించిన విజ్ఞానశాఖలోను అంత పేరు గడించారు ఆ విధంగా ఆయన ఎందరెందరో స్త్రీలకు ప్రాణదానం చేసి పుణ్యం మూట కట్టుకున్నారు. స్త్రీకి ప్రసవం పునర్జన్మ వంటిదని పెద్దలు చెపుతారు శిశు సంక్షేమ విషయంలో కూడా ఆయన ప్రత్యేక శ్రద్ధ వహించారు. అదే ఆ మహనీయుడు కావించిన ప్రశాంత సంఘసేవ !

ప్రసవకాలంలో ఏర్పడుతున్న మరణాల విషయమై ఆయన మదరాసు నగరంలో ఒక పరిశోధన (సర్వే) నిర్వహించి నిర్మాణాత్మక కృషికి ఆదర్శంగా నిలిచారు మదరాసులోనే కాదు, భారతదేశంలోనే ఆ విషయమై నిర్వహించబడిన తొలి సర్వే అదే. 1936 లో ప్రథమ అఖిల భారత ప్రసూతిశాస్త్ర మహాసభను దిగ్విజయింగా జరిపిన ఘనత కూడా ఆయనదే 1938 లో ఆయన చికిత్సాలయపు మంత్రసానిత్వం గురించి ఉత్తమ గ్రంథం ఆంగ్లంలో వెలయించారు. ఆ శాస్త్రం అధ్యయనం చేసే వారి కిందరికీ అది కల్పతరువు వంటి దనడం చర్విత చర్వణమే అవుతుంది. ఈ విషయాదికాన్ని పరిశీలిస్తే, లక్ష్మణస్వామి మొదలియారుకి ప్రసూతి శాస్త్రంలోను, స్త్రీల వ్యాధులకు సంబంధించిన విజ్ఞానశాస్త్రంలోను గల ప్రగాఢమైన అభినివేశం, అపారమైన పాండిత్యం అవగతము లవుతాయి.

మెదడుకి విద్య ఔషధం వంటిదని ప్లేటో మహనీయుడు సహేతుకంగా పేర్కొన్నాడు. ఇది పరమ సత్యం? చక్కగా నేర్చిన మెదడు శరీరాన్ని సక్ర

మంగా పరిరక్షించుకోగలదనీ ఆయన పేర్కొన్నారు. చదువు సంధ్యలకు గల ప్రాశస్త్యాన్ని ఇంతకంటె ఎవరు మాత్రం గొప్పగా చెప్పగలరు? లక్ష్మణస్వామి మొదలియారు విద్య, వైద్యశాస్త్రం అనే జోడు గుర్రాలమీద సమర్థవంతంగా స్వారీచేసిన విషయం జగద్విదితం.

## విశ్వవిద్యాలయ విద్యారంగంలో కృషి :

లక్ష్మణస్వామి మొదలియారు ప్రముఖ వైద్యశాస్త్రజ్ఞుడైనా, ఆయన ప్రసిద్ధ విద్యావేత్తఅనీ, విశ్వవిద్యాలయ పరిపాలనాధ్యక్షుడనీ చెప్పడంలో విప్రతిపత్తిలేదు 1923 వ సంవత్సరంలో ఆయన జీవితం ఒక కొత్త మలుపు తిరిగింది విశ్వవిద్యాలయ విద్యారంగంలో ఆయన అడుగుపెట్టిన సంవత్సరమది! అయినా ఆయన దృష్టి వైద్యశాస్త్రం నుంచి మరలలేదు. వైద్య విద్యారంగాలలో సరిసమానంగా కృషి సాగించిన సవ్యసాచి ఆయన !

పట్టభద్రుల నియోజక వర్గంనుంచి లక్ష్మణస్వామి మొదలియారు మదరాసు విశ్వవిద్యాలయ సెనేటుకి ఎన్నికయ్యారు ఏ పని చేపట్టినా, దాన్ని సక్రమంగా శ్రద్ధాసక్తులతో నిర్వహించే ప్రవృత్తి ఆయనది. ఆయన మొదటినుంచీ సమర్థుడైన నిర్వాహకుడుగా పేరుపొందారు. ఓట్లు సంపాదించడంలోనూ సమర్థులు. విశ్వవిద్యాలయ చట్టాలు, నియమ నిబంధనలు మొదలైన వాటిని శ్రద్ధగా పరిశీలించ సాగారు. కాలగమనంతో పాటు వాటిని క్షుణ్ణంగా గ్రహించిన వాడయ్యాడు. 1925లో ఆయన సిండికేటుకి ఎన్నికయ్యారు ఆ విధంగా విశ్వవిద్యాలయంలో ఆయన స్థానం బలపడింది. అందుకు తగ్గట్టు ఆర్థిక సంఘానికి ఆయన అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. తత్ఫలితంగా విశ్వవిద్యాలయ ఆర్థిక విషయాలు గురించి తెలుసుకోవడానికి సదవకాశం ఏర్పడింది. దానితోపాటు విశ్వవిద్యాలయ నిధుల్ని సంరక్షించవలసిన బాధ్యత కూడ ఆయనమీద పడింది.

అంతవరకూ సిండికేటు సభ్యులుగా ఉన్న సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు 1925 జూనులో విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా నియమితులయ్యారు. ఆ పదవిలో ఆయన 1928 దాకా ఉన్నారు. ఆ విధంగా సిండికేటులో ఖాళీ యేర్పడడం వల్ల, ఆ ఖాళీని భర్తీ చేసేందుకు లక్ష్మణస్వామి మొదలియారు పోటీచేశారు. పెద్ద మెజారిటీతో జయించారు.

విశ్వవిద్యాలయ నిధుల్ని పెంచడానికి లక్ష్మణస్వామి మొదలియారు శక్తి వంచన లేకుండా కృషిచేశారు ఆయన కృషి ఫలించింది. ప్రభుత్వ సహాయాన్నే నమ్మి విశ్వవిద్యాలయం వ్యవహరించ కూడదని ఆయన అభిమతం కాగా, ఆయన కృషివల్ల మదరాసు విశ్వవిద్యాలయం తన కాళ్ళమీద తాను నిలబడగల శక్తి సంపాదించ గలిగింది 1925 నుంచి 1942 దాకా ఆయన్ని సిండికేటుకి ఎన్ను కోసాగారు. విద్యావేత్తలు ఆయనపట్ల ప్రకటించిన అపార విశ్వాసానికి ఇది ఒక మంచి ఉదాహరణం.

1936 లో ఆయనకి విశ్వవిద్యాలయోపాధ్యక్షుని విధుల్ని తాత్కాలికంగా నిర్వహించే సదవకాశం లభించింది. 1942 లో ఆయన ఉపాధ్యక్షుడుగా నియమితులయ్యారు అంతవరకూ ఉపాధ్యక్షులుగా ఉన్న సర్ మహమ్మద్ ఉస్మాన్ గారు ప్రెసిడెన్సీ కార్యనిర్వాహక సభ్యులయ్యారు. ఆ యేడు ఆగస్టు 20న ఆయన ఆ పదవీ బాధ్యతలు స్వీకరించారు. నాటి నుంచీ ప్రతి మూడేళ్ళకి ఆయన్ని ఉపాధ్యక్ష పదవిలో నియమించడం జరిగింది ఆవిధంగా ఆయ తొమ్మిది పర్యాయాలు ఆ ఉన్నత పదవిలో నియమితులయ్యారు ఇరవై ఏడేళ్ళు మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా అవిచ్ఛిన్నంగా వ్యవహరించి ఆయన చరిత్ర సృష్టించారు. 1969లో జూలై 31న ఆయన పదవీ విరమణ చేశారు ఆ తర్వాత ఉపాధ్యక్షులయిన వారు యస్ డి. సుందరవడివేలు గారు.

నిర్దేశించబడిన ఒక రోజున సెనేటు సభ్యులు సమావేశమై ఉపాధ్యక్ష పదవికి పోటీచేసే అభ్యర్థులకు ఓట్లువేసేవారు ఎక్కువ ఓట్లు వచ్చిన వారిపేర్లను వరుస క్రమంలో గవర్నరుకి (చాన్సెలరు) పంపేవారు. ఆ పేర్లలోంచి ఒకరిని ఉపాధ్యక్షులుగా గవర్నరు నియమించేవారు ప్రతిసారి అందరు అభ్యర్థుల కంటె లక్ష్మణస్వామి మొదలియారుకే ఎక్కువ ఓట్లు లభించేవి. విశ్వవిద్యాలయ అధ్యాపకులు, అనుబంధ కళాశాలల అధ్యాపకులు ఆ విధంగా లక్ష్మణస్వామి మొదలియారు పట్ల తమ అభిమానాన్ని విశ్వాసాన్ని ప్రదర్శించారని పేర్కొనవచ్చు. 1967 లో ఆగస్టు 19-20 తేదీలలో ఆయన విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవి రజతోత్సవాన్ని, తమ ఎనభయ్యవ జన్మదినోత్సవాన్ని ఘనంగా జరుపుకున్నారు. అంతకు పూర్వమే, అనగా 1947, నవంబరు 14 న, మదరాసు

విశ్వవిద్యాలయావరణలో గ్రంథాలయ భవనానికి ఎదురుగా లక్ష్మణస్వామి మొదలియారు నిలువెత్తు కాంస్యవిగ్రహం ఆవిష్కరించబడింది. అప్పటి గవర్నర్ సర్ ఆర్చిబాల్డునై ఆ విగ్రహన్ని ఆవిష్కరించారు ఇలా ఒక విద్యావేత్తకు, విశ్వవిద్యాలయోపాధ్యక్షునికి నిలువెత్తు విగ్రహం ప్రతిష్ఠించబడటం పేర్కొన దగిన అంశం ఆయన పట్ల విద్యావేత్తలకు, ఇతరులకు గల ఆదరాభిమానములు ఇందువల్ల ప్రవ్యక్తము లవుతున్నవి

లక్ష్మణస్వామి మొదలియారుది విశాలమైన దృక్పథం. నిత్య విద్యార్థిగా భావించుకునే మనస్తత్వం ఆయనది. అందువల్ల ఎప్పటికప్పుడు విద్యార్థి కొత్త అంశాలను సహర్షంగా స్వీకరిస్తూ తన విజ్ఞానపరిధిని విస్తృతం చేసుకోవా లన్నది ఆయన అభిమతం. కనుకనే ఆయన మదరాసు విశ్వవిద్యాలయంలో ఉన్న శాఖలను అభివృద్ధి పరచి, కొత్త శాఖలను ప్రారంభించారు. అలా ఆయన ప్రారంభించిన శాఖల వివరాలు : న్యాయశాస్త్రం, వాణిజ్యం, సామాజికశాస్త్రం, హిందీ, రష్యన్, గ్రంథాలయ శాస్త్రం, పురాతత్వ శాస్త్రం, మానవశాస్త్రం (ఆంత్రొపాలజి), మనస్తత్వ శాస్త్రం, గృహనిర్మాణ శాస్త్రం, కర్బన రసాయన శాస్త్రం, కర్బనేతర రసాయనశాస్త్రం మొదలైనవి

ఆయన హయాములో ఒక్కొక్క శాఖకు సంబంధించి ప్రత్యేకంగా కొంత మొత్తం కేటాయించడం జరిగింది. అంతకుపూర్వం కేటాయించిన డబ్బుని కనుక ఆ శాఖ పూర్తిగా వినియోగించని పక్షంలో, మిగిలిన డబ్బుని మరోశాఖకు ఇచ్చేవారు. ఈ సంప్రదాయాన్ని మార్చి ఏ శాఖకు కేటాయించిన డబ్బుని ఆ శాఖకే పూర్తిగా వినియోగించాలని లక్ష్మణస్వామి మొదలియారు కొత్త విధానం ప్రవేశ పెట్టారు. ఇందువల్ల, ఏ కారణంవల్లనైనా ఒక శాఖ ఒక సంవత్సరంలో కేటాయించబడిన మొత్తాన్ని పూర్తిగా వినియోగించకపోతే, మిగిలిన డబ్బుని ఆ శాఖకు చెందిన డబ్బుగానే జమకట్టేవారు. కనుక ఆ శాఖ ఎప్పటికైనా అభివృద్ధి చెందేందుకు ఒక అవకాశం లభించింది.

గణితశాస్త్రంలో మహా మేధావిగా పరిగణించ బడుతున్న శ్రీనివాస రామానుజం పేరున వ్యవహృత మవుతున్న గణిత శాస్త్రాధ్యయన సంస్థ వెలుగు

లోకి రావడానికి, అది బలం పుంజుకోవడానికీ, అభివృద్ధి చెందడానికి లక్ష్మణ స్వామి మొదలియారు చేసిన కృషి ప్రశంసార్హం.

అలాగే లక్ష్మణస్వామి మొదలియారు వైద్యశాస్త్ర విషయంలో కూడా గణనీయమైన కృషిచేశారు. వైద్యవిద్యకు సంబంధించిన స్నాతకోత్తర మండలిని 1945 లో ప్రారంభించారు. వైద్యవిద్యలో ఈ మండలి స్థాపన ఒక మైలు రాయిగా గణించబడుతున్నది.

విశ్వవిద్యాలయ మంటే పరీక్షల నిర్వహణ, పరీక్షా ఫలితాల ప్రకటన కేంద్రం అనే అభిప్రాయాన్ని లక్ష్మణస్వామి మొదలియారు రూపుమాపారు పరీక్షల నిర్వహణ, పరీక్షా ఫలితాల ప్రకటన ముఖ్యమైన విధులని ఆయన గ్రహించక పోలేదు. అయినా పరిశోధనకు ఆయన ప్రాధాన్యం కల్పించారు. ఉన్నత విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించారు ఆయన హయాములో అనుబంధ కళాశాలలు కొత్తవి ఎన్నో వెలుగులోకి వచ్చాయి. ముఖ్యంగా స్త్రీల కళాశాలలు ఎన్నో స్థాపించబడ్డాయి. లక్ష్మణస్వామి మొదలియారు ఉపాధ్యక్షులు కావడానికి ముందు మదరాసు విశ్వవిద్యాలయానికి అనుబంధ కళాశాలలు అరవైయేడు మాత్రమే ఉండేవి. ఆయన ఉపాధ్యక్షులైన తర్వాత అనుబంధ కళాశాలల సంఖ్య నూటయాభై నాలుగు దాకా పెరిగింది. అలాగే విశ్వవిద్యాలయంలో ఉన్న 17 శాఖలు 40 అయినాయి; విశ్వవిద్యాలయ అధ్యాపకులు 30 మంది మాత్రమే. ఆ తర్వాత వారు 150 మంది అయ్యారు. పరిశోధక విద్యార్థుల సంఖ్య 69 నుంచి 206 దాకా పెరిగింది.

మదరాసు గిండీలో ప్రస్తుతం ఎ.సి కాలేజ్ ఆఫ్ టెక్నాలజీ అని వ్యవహృత మవుతున్న అళగప్ప చెట్టియార్ సాంకేతిక కళాశాల లక్ష్మణస్వామి మొదలియారు కాలంలోనే వెలుగులోకి వచ్చింది. ఈ కళాశాలాభి వృద్ధికి ఆయన చేసిన కృషి అనిర్వచనీయమైనది. అలాగే చర్మ (పదును చేయబడింది) పరిశోధన శాఖ విషయంలోను ఆయన తగినంత శ్రద్ధ వహించారు. మదరాసులోని కేంద్ర చర్మ పరిశోధనా సంస్థను (**Central Leather Research Institute**) అభివృద్ధి చేసిన ఘనత ఆయనకే చెందుతుంది.

లక్ష్మణస్వామి మొదలియారు ఉపాధ్యక్షులుగా ఉన్న రోజులలో మదరాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ పరిశోధనాశాఖగా ఉండేది ప్రాచ్య పరిశోధన సంస్థకు అనుబంధంగా ఉండేది. కుమార సంభవం, తెనుగు కవుల చరిత్ర, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయం వంటి ఉద్గ్రంథాలు మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర గ్రంధాలుగా వెలువడ్డాయి.

మదరాసులో ఐ ఐ.టి. (ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ) స్థాపించబడినపుడు, దాని మొదటి పాలనామండలి (బోర్డ్ ఆఫ్ గవర్నర్స్) అధ్యక్షులుగా ఆయన నియమితులయ్యారు. ఆ సంస్థ అభివృద్ధికి ఆయన చేసిన సేవ విస్మరించరానిది.

## మదరాసు విశ్వవిద్యాలయ శతవార్షికోత్సవం :

మన దేశంలోని అతి ప్రాచీన విశ్వవిద్యాలయాలలో ఒకటైన మదరాసు విశ్వవిద్యాలయ శత వార్షికోత్సవం 1957 లో మహావైభవంగా జరిగింది. దక్షిణా పథంలో ఉన్న విశ్వవిద్యాలయాల కన్నిటికి ఇది మాతృ విశ్వవిద్యాలయ మనవచ్చు. శతవార్షికోత్సవాన్ని జయప్రదంగా జరిపించిన యశస్సు లక్ష్మణ స్వామి మొదలియారుకి చెందుతుంది. అప్పటి భారత ప్రధాని పండిత జవహర్ లాల్ నెహ్రూ, సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి మహామహులు ఆ శతవార్షికోత్సవాలలో పాల్గొన్నారు.

సాధారణంగా అలాంటి విశిష్ట సందర్భాలలో ప్రముఖులైన వారికి గౌరవ డిగ్రీలు ప్రదానం చేయడం విశ్వవిద్యాలయ సంప్రదాయం. తదనుగుణంగా మదరాసు విశ్వవిద్యాలయం సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రభృతులకు గౌరవ డిగ్రీలు ప్రదానం చేసి తనను తాను సత్కరించుకుంది. ఆ శతవార్షికోత్సవాల సందర్భంగా లక్ష్మణస్వామి మొదలియారుకి కూడ గౌరవ డిగ్రీ సమర్పించి ఉంటే సముచితంగా ఉండేదని పలువురు భావించారు. అప్పటికే ఆయన అవిచ్ఛిన్నంగా పదిహేనేళ్ళు విశ్వవిద్యాలయోపాధ్యక్షునిగా వ్యవహరించారు అదీకాక ప్రాచ్య పాశ్చాత్య విశ్వవిద్యాలయాలు ఎన్నో ఆయన్ని గౌరవ డిగ్రీలతో సత్కరించాయి. కనుక ఆయన్ని ఆ విశిష్ట సమయాన మదరాసు విశ్వవిద్యాలయం కూడా సత్కరించడం సహేతుకమని విజ్ఞులు భావించడం అసంగతం కాదు. కాని అందుకు లక్ష్మణస్వామి మొదలియారు సమ్మతించలేదు. ఆ సంగతి బయటి



మద్రాసు విశ్వవిద్యాలయం సమావేశంలో ఆసీనులై ఉన్న
( ఎడమ నుంచి కుడికి ) జవహర్‌లాల్ నెహ్రూ, డాక్టర్ లక్ష్మణస్వామి
మొదలియార్, సర్వేపల్లి రాధాకృష్ణన్ ప్రభృతులు.

వారికి తెలియకపోవచ్చు గాని విశ్వవిద్యాలయంతో సంబంధం ఉన్న వారికి తెలుసు ఆ తర్వాత, అనగా 1961 లో, ఆయనకి మదరాసు విశ్వవిద్యాలయం గౌరవ పట్టా సమర్పించింది.

శతవార్షికోత్సవాల సందర్భంగా విశ్వవిద్యాలయం ఆవరణలో (చేపాకం) నిర్మితమైన ఉన్నత భవనం, కళా మందిరం ఆయన కార్యనిర్వహణ శక్తికి ప్రబల నిదర్శనాలు. అలాగే ఆయన ఎంతో సమర్థంగా నిర్వహించిన క్లినిక్ (కెన్సింగ్టన్ చికిత్సాలయం) కూడా పేర్కొనదగిందే.

## స్వార్థరాహిత్యం :

విశ్వవిద్యాలయ విద్యారంగంలో, వైద్యశాస్త్ర రంగంలో, సాంకేతిక విద్యారంగంలో నిర్విరామంగా కృషిసలిపి తనకూ, ఆయా సంస్థలకూ పేరు పెంపులు సమకూర్చిన లక్ష్మణస్వామి మొదలియారు ఆదర్శ పురుషుడనీ, ఆయన జీవితం నుంచి పెక్కు పాఠాలు నేర్చుకోవాల్సిన అవసరమున్నదనీ అభిజ్ఞులు భావిస్తారు ఇది పొల్లు మాట కాదు. నితాంత కార్యదీక్ష, నిశ్చలమైన మనస్సు, క్రమశిక్షణతో కూడిన జీవిత విధానం, సహచరుల్ని ఆదరభావంతో చూడడం, సహన శీలం, కాల నియమం పాటించడం, సౌమ్యస్వభావం మొదలైనవి ఆయనకి పెట్టని భూషణాలు. ఈ విశిష్టగుణాలు నెలకొన్న కారణంగా, ఆయన ఆదర్శపురుషుడు కాగలిగాడు.

ఒకసారి ఉన్నత పదవి నలంకరించిన ఒక విద్యావేత్త విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యులకు ఉపాధ్యక్షుని జీతభత్తెముల పెంపు విషయంగా విడివిడిగా ఉత్తరాలు వ్రాశారు ఆ లేఖాంశాలు :

'జీతాన్ని పురస్కరించుకుని పదవికి విలువకట్టే ప్రపంచంలో మనం జీవిస్తున్నాము భారతదేశంలో ఇతర ప్రాంతాలలోని విశ్వవిద్యాలయోపాధ్యక్షులకు నెలకు మూడు వేల రూపాయల జీతం, ఉచితంగా బంగళా, ఉచితంగా కారు మొదలైన వసతులు లభిస్తున్నాయి. మదరాసు విశ్వవిద్యాలయోపాధ్యక్షునికి ఉచితంగా బంగళా గాని, కారు గాని ఇవ్వడంలేదు. జీతం కూడ నెలకు రెండు

వేలు మాత్రమే ఇది అసమంజసం, కనుక ఈ విషయాలు గుర్తించి, ఇతర ఉపాధ్యాయులతో సరిసమానంగా ఉండేటట్లు నిబంధనలు మార్చగోరుతున్నాను '

ఈ లేఖను పరిశీలించే అవకాశాన్ని కూడ సిండికేటు సభ్యులకు ఇవ్వలేదు, లక్ష్మణస్వామి మొదలియారు ఒక చిరునవ్వు నవ్వి, ఆ విషయాన్ని పరిశీలనకు ఆస్కారం లేకుండా చేశారు. అంతటితో కథ ముగిసింది లేకపోతే విశ్వవిద్యాలయ సిండికేటు సభ్యులూ, ప్రభుత్వాధికారులూ తదితరులు తర్జనభర్జనలు చేసి వుండేవారు. కాని స్వార్థరహితులైన లక్ష్మణస్వామి మొదలియారు అలాంటి వాతావరణాన్ని కల్పించకుండా హుందాగా ప్రవర్తించారు. అదీ ఆయన గొప్ప తనం! నలుగురికీ సంబంధించిన వ్యవహారాలను తన మన అనే దృష్టితో కాకుండా నిష్పాక్షికంగా పరిశీలించడం, వాటిని గురించి నిర్దిష్టమైన అభిప్రాయాలు కలిగి ఉండడం, మనోగతాభిప్రాయాలను సౌమ్యంగానే అయినా దృఢంగా వ్యక్తీకరించడం మొదలైనవి ఆయనలో గోచరించే మరికొన్ని సుగుణాలు. కనుకనే ఆయన్ని అఖిలలోకం ప్రశంసించింది.

## ప్రపంచ సంస్థలతో సంబంధం :

ప్రసూతి శాస్త్రజ్ఞులుగా, స్త్రీల వ్యాధులకు సంబంధించిన విజ్ఞానశాస్త్రజ్ఞులుగా లక్ష్మణస్వామి మొదలియారు కీర్తి దిగంతాలదాకా వ్యాపించింది. ఆయన యునెస్కోలోను, ప్రపంచ ఆరోగ్య సంస్థలోను (WHO) ప్రముఖపాత్ర నిర్వహించారు అంతేకాదు ఆయన ఆ ఆరోగ్య సంస్థ కార్యనిర్వాహకవర్గ అధ్యక్ష పదవికి ఒకసారి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఆ తర్వాత ఆర్థిక విషయాల కమిటీకి కూడా అధ్యక్షులు కాగలిగారు. 1954 లో యునెస్కో కార్యనిర్వాహక వర్గ అధ్యక్షులుగా ఎన్నిక అయి, రెండేళ్ళపాటు ఆ ఉన్నత పదవిని జయప్రదంగా నిర్వహించారు 1959 లో ఆయన భారతీయ విజ్ఞానశాస్త్ర పరిషత్తు (ఇండియన్ సైన్సు కాంగ్రెసు) సభకి అధ్యక్షత వహించారు 1966 లో వైద్యవిద్యకు సంబంధించిన మూడవ ప్రపంచ మహాసభ అధ్యక్షస్థానం అలంకరించారు. ఇలా లక్ష్మణస్వామి మొదలియారు జాతీయ, అంతర్జాతీయ సభలలో పాల్గొని భారత దేశానికి పేరుప్రతిష్ఠలు సమకూర్చారు.

రెండవ ప్రపంచయుద్ధం జరిగిన రోజులలో, లక్ష్మణస్వామి మొదలియారు ప్రముఖ వైద్యుల్ని, వైద్యశాస్త్ర నిపుణుల్ని మదరాసు నుంచి పెక్కు మందిని పంపి, ఆ విధంగా యుద్ధ కార్యక్రమాలకు సహాయపడినట్లు అభిజ్ఞులు పేర్కొంటారు. అయితే దేశస్వాతంత్ర్యాన్ని అభిలషించిన మన జాతీయోద్యమ నాయకులు భారతదేశం నుంచి బ్రిటిషువారు వైదొలగాలని వాంఛించారు బ్రిటిషువారు మన అభిప్రాయాలను సరకుసేయకుండానే తాము కావిస్తున్న యుద్ధంలో భారత దేశాన్ని పాల్గొనేలా చేసిన విషయం సర్వవిదితం.

## ఉన్నత ప్రమాణాలు :

లక్ష్మణస్వామి మొదలియారు విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా ఉన్నంత కాలమూ, ఆయన మదరాసు విశ్వవిద్యాలయంలో ఉన్నత ప్రమాణాలను నెలకొల్పాలనీ, వాటిని పరిరక్షించాలనీ ఆశించారు విద్యార్థుల సంఖ్య, కొత్త కళాశాలల సంఖ్య పెరిగిన దృష్ట్యా, ఉన్నత ప్రమాణాలు నెలకొల్పడం సామాన్యులకు కష్టమనిపించేది. కాని ఆయన తన లక్ష్యాలను సాధించారు. విశ్వవిద్యాలయ పరిధిలో ఉండే కళాశాలల నన్నిటిని ఆయన ప్రతియేడూ స్వయంగా తణిఖీ చేసేవారు. ఒకటికి రెండుసార్లు కళాశాలలకు వెళ్ళేవారు. కళాశాలల తణిఖీ సంఘాలలో ఆయన ఉండేవారు కళాశాలల నిర్వాహకులకు సకాలంలో ఆయన సలహాలు ఇచ్చేవారు. భవనాలు, పరికరాలు మొదలైనవన్నీ ఉండి, ఉపాధ్యాయులకు తగు రక్షణ కల్పించబడినప్పుడే, ఆయన కొత్త కళాశాలలు పనిచేసేందుకు సమ్మతించేవారు. ఆ విషయంలో ఆయన ప్రదర్శించిన దృఢ వైఖరివల్ల, కొత్త కళాశాలలు ఉన్నత ప్రమాణాలు నెలకొల్ప గలిగాయి. ప్రతి అనుబంధ కళాశాల ఐదు లక్షల రూపాయల నిధిని శాశ్వతంగా నెలకొల్పాలని ఆయన కళాశాలల పాలక వర్గాలను కోరారు. అధ్యాపకులకు నెలసరి జీతాలు సక్రమంగా ముట్టేందుకే ఆయన అలాంటి నిబంధన చేశారు. అధ్యాపకుల యోగక్షేమాలకు ఆయన ప్రాధాన్యమిచ్చారు. కళాశాలల్లో వారికి లభించే వసతుల్ని కూడా ఆయన సునిశితంగా పరిశీలించేవారు కళాశాలల్లో పనిచేసే ఉపన్యాసకుల జీతాలు పెరగాలని ఆయన ఆశించారు ఈ విషయమై ఆయన విశ్వవిద్యాలయ విరాళాల సంఘం వారితో (యు.జి.సి) చర్చించారు. ఆయన ఆ సంఘంలో సభ్యులు. ఆయన ఆశించిన మేరకు కాకపోయినా, ఉన్నంతలో ఉపన్యాసకుల జీతాలు పెరగడానికి విశేషంగా తోడ్పడ్డారు

ఇక పరిశోధన విషయంలో కూడా ఉన్నత ప్రమాణాలు నెలకొనాలని ఆయన ఆశించారు. మొదటి పరిశోధనపట్టానికి వ్రాత పరీక్ష, మౌఖిక పరీక్ష (వైవా) అవసరమని ఆదేశించారు. విజ్ఞానశాస్త్ర విద్యార్థులకైతే, ఈ రెంటితో పాటు ప్రయోగ (ప్రాక్టికల్) పరీక్ష కూడా ఉంటుంది. ఆమోదింపబడిన విద్యా సంస్థలో, ఆమోదింపబడిన పర్యవేక్షకుని కనుసన్నల్లో పరిశోధన కొనసాగాలని ఆయన ఆదేశించారు. విశ్వవిద్యాలయంలో శాస్త్ర, శాస్త్రేతర విభాగాలలో ఆయన పెక్కు పరిశోధన శాఖలు ప్రారంభించారు కొత్త పీఠాలు (చేర్స్) నెలకొల్పారు అంతర్ కళాశాల బోధన కార్యక్రమం ప్రవేశపెట్టారు. ఈ కార్యక్రమం అనుసరించి, విశ్వవిద్యాలయోపాధ్యాయులు కళాశాలల విద్యార్థులకు తమ పరిశోధనానుభవాన్ని తెలియజేసే అవకాశం పొందగలిగారు. ఈ విధానం స్నాతకోత్తర తరగతులకే పరిమితం చేయబడింది. పరిశోధన, బోధన-వీటికి ఒక సమన్వయం చేకూర్చాలన్నది ఆయన లక్ష్యమై ఉండవచ్చు. అనగా, విశ్వవిద్యాలయోపాధ్యాయులు ఆయా విషయాలు బోధిస్తూ తాము తెలుసుకున్న పరిశోధనాంశాలు బహిర్గతం చెయ్యాలి తత్ఫలితంగా పరిశోధనలోను బోధనలోను ఒక కొత్త వేగం వచ్చింది. ఇలా కొత్త పద్ధతులు ప్రవేశపెట్టే సమయాలలో, ఆయన శాస్త్ర, శాస్త్రేతర శాఖలలో సమతూకం ఉండేలా చూసేవారు.

లక్ష్మణస్వామి మొదలియారు ప్రదర్శించిన చొరవ వల్లనే ప్రసూతి శాస్త్రమూ, స్త్రీల వ్యాధులకు సంబంధించిన విజ్ఞానశాస్త్రంలో డిప్లొమా కోర్సు ప్రారంభించడం జరిగింది. ఆ తర్వాత శస్త్ర చికిత్సలోను, ఔషధ విభాగంలోను డిప్లొమా కోర్సులు కొన్ని ప్రవేశపెట్టబడ్డాయి. చాలా సంవత్సరాల కృషికి ఫలితంగా, జర్నలిజంలో (పత్రికా రచన) డిప్లొమా కోర్సు ప్రారంభించారు. అలాగే సంఘసేవ, శరీర వ్యాయామం, అంతర్జాతీయ న్యాయశాస్త్రం, ఫ్రెంచి, జర్మన్, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, వ్యాపార నిర్వహణ, గణాంక శాస్త్రం మొదలైన వాటిలో డిప్లొమా కోర్సులు ప్రారంభించబడ్డాయి ఈ వివిధ కోర్సులకు విద్యార్థుల ఆదరణ బాగా లభించింది ఈ వివిధ విషయాలను స్థూలంగా పరిశీలించినా, లక్ష్మణస్వామి మొదలియారు హయాములో మదరాసు విశ్వవిద్యాలయం బాగా అభివృద్ధి చెందినట్లు నిస్సంశయంగా చెప్పవచ్చు ఆ విశ్వవిద్యాలయ పురోగతి కోసం ఆయన తన జీవితాన్ని మీదు కట్టారన్నా అతిశయోక్తి కాదు ఆయన

సాధించిన విజయాలను, విశ్వవిద్యాలయం చెందిన అభివృద్ధిని చూసి విదేశాలలో మదరాసు విశ్వవిద్యాలయానికి 'డాక్టర్ మొదలియారు యూనివర్సిటీ' అనే నామాంతరం ఏర్పడినట్లు అభిజ్ఞులు చెపుతారు.

విశ్వవిద్యాలయం తన ఉన్నత ప్రమాణాలను ఎలా పరిరక్షించు కుంటుంది? అనే విషయమై ఆయన ఎప్పుడూ ఆలోచన చేసేవారు. ఆయన సహనశీలం, సౌమ్య ప్రవర్తన నలుగురి వాదోపవాదాలను వినే ఔదార్యాన్ని ఆయనకి కల్పించాయి. ఆయన అధ్యక్షత వహించిన సెనేటు, అకడమిక్ కౌన్సిల్ సమావేశాలు స్నేహపూరిత వాతావరణంలో సాగేవనీ, సభ్యుల ప్రతిపాదనలను ఆయన శ్రద్ధగా ఆలకించేవారనీ చెపుతారు. పైగా ఆయన మొండిపట్టుకు చోటిచ్చేవారు కాదు. భారతీయతకు విరుద్ధమనే అభిప్రాయంతో ఆయన మొదట్లో కళాశాలల్లో సహవిద్యకు (Co-education) విముఖులై ఉండేవారు కాని స్త్రీవిద్యను దృష్టిలో ఉంచుకుని, ఆ తర్వాత తన అభిప్రాయాన్ని మార్చుకున్నారు. కాని కొన్ని షరతులు విధించారు. విద్యార్థినులకు కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడాలని కోరారు నియతిగా ఒక ఉపన్యాసకురాలిని నియమించాలన్నది కూడా ఆ షరతులలో ఒకటి.

లక్ష్మణస్వామి మొదలియారు ఒక్క అధ్యాపకుల యోగక్షేమములనే కాదు, విద్యార్థుల ఆరోగ్యానికి కూడా ప్రాధాన్యమిచ్చారు. ప్రతి కళాశాలలోను ఒక డాక్టరు ఉండాలనీ, సంవత్సరం మొదట్లోనే ఆయన కొత్తగా చేరే విద్యార్థుల్ని ఆరోగ్య రీత్యా పరీక్షించాలనీ, కొన్ని రకాల అంగదోషాలు విద్యార్థులలో కనిపించినట్లయితే వాటిని శరీర వ్యాయామం ద్వారా చక్కదిద్దేందుకు ఫిజికల్ డైరెక్టరుకి చెప్పాలనీ ఆయన ఆదేశించారు. అలాంటి విషయాలలో ఆయన సిండికేటుకి నచ్చజెప్పి, వారి ఆమోదాన్ని పొందేవారు.

ఉపాధ్యాయుల, విద్యార్థుల విషయాలలో అలా శ్రద్ధాసక్తులు ప్రదర్శించిన కారణం వల్ల లక్ష్మణస్వామి మొదలియారుని అందరూ గౌరవించారు. ఆయన విద్యావేత్తల ప్రశంసకు పాత్రులు కావడంవల్ల, విశ్వవిద్యాలయానికి కొన్ని లాభాలు కలిగాయి పెక్కు సంస్థలలో కమీషనులలో విశ్వవిద్యాలయానికి ప్రాతినిధ్యం లభించింది తత్ఫలితంగా మదరాసు విశ్వవిద్యాలయంవారి డిగ్రీలను

పాశ్చాత్య దేశాలలోకూడా గుర్తించారు విదేశాలకు వెళ్ళి విద్యాభ్యాసమో, పరిశోధనో చేయదలచిన విద్యార్థులకు విదేశ విశ్వవిద్యాలయాలలో ప్రవేశం లభించింది. అంతేకాదు, విశ్వవిద్యాలయం చేపట్టిన పెక్కు పరిశోధనా పథకాలకు నలుమూలల నుంచి విరాళాలు లభ్యం కాసాగాయి.

## విద్యావిషయిక సంఘాలలో ప్రాతినిధ్యం :

ప్రముఖ విద్యావేత్తగా పేరు పొందిన లక్ష్మణస్వామి మొదలియారుకి పెక్కు విద్యావిషయిక సంఘాలలో ప్రాతినిధ్యం లభ్యం కావడంలో ఆశ్చర్యమేమీలేదు ఢిల్లీ మొదలైన చోట్ల జరిగిన అంతర్విశ్వవిద్యాలయ సమావేశాలలో ఆయన సభ్యులుగా పాల్గొన్నారు అంతర్విశ్వవిద్యాలయ బోర్డుకి ఒకసారి ఆయన అధ్యక్షులు. విజ్ఞానశాస్త్ర పారిశ్రామిక పరిశోధనా మండలి, సాంకేతిక విద్యా మండలి మొదలైన వాటి పాలకవర్గ సభ్యులు. కేంద్ర విద్యాసలహా సంఘ సభ్యులు. సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతను ఏర్పాటైన విశ్వవిద్యాలయ విద్యా సంఘంలో సభ్యులు. భారతదేశపు ఉన్నత పాఠశాలల్లో చదువుసంధ్యల స్థితిగతుల్ని పరిశీలించేందుకు భారత ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. అందులో ఎనిమిదిమంది సభ్యులు. ఆ సంఘానికి లక్ష్మణస్వామి మొదలియారే అధ్యక్షులు. దేశమంతట పర్యటించి విద్యావేత్తల్ని, ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయుల్ని మాత్రమే కాక చదువు సంధ్యలలో అక్కరగల ప్రముఖుల్నికూడా సంప్రదించి మొదలియారు ఒక నివేదికను సమర్పించారు దానికి మొదలియారు కమీషన్ నివేదిక అనే పేరు వచ్చింది. మనదేశ విద్యారంగంలో అతి ముఖ్యమైన నివేదికగా అది పేరుపొందింది ఆ నివేదిక ననుసరించి ఆ తర్వాత విశ్వవిద్యాలయ విద్యావిధానంలో కొన్ని మార్పులు చేయవలసి వచ్చింది. విద్యా సంస్థల విద్యా విషయక స్వాతంత్ర్యాన్ని ఆయన మనసార అభిలషించినవాడు కనుకనే ఆ విషయమై ఆయన ఎక్కువ శ్రద్ధ వహించారు యునెస్కో, ప్రపంచ ఆరోగ్య సంస్థ, కామన్‌వెల్తు విశ్వవిద్యాలయోపాధ్యక్షుల సంఘం- మొదలైనవాటి సమావేశాలకు ఆయన హాజరయ్యేవారు అందువల్ల వివిధ దేశాలలోని విద్యావిధానాలను పరిశీలించే అవకాశాలు ఆయనకి ఎన్నో లభించాయి. పాఠశాలలో విద్యాభ్యాసం ముగించే ప్రతి విద్యార్థి జీవితరంగంలో ప్రవేశించడానికి అర్హుడై ఉండాలన్నదే ఆయన లక్ష్యం.

బహుళకార్య నిమగ్నులైనా, లక్ష్మణస్వామి మొదలియారు ఇతర కార్య కలాపాలలో కూడా తగినంత శ్రద్ధ వహించేవారు. ఆయనకి రెడ్‌క్రాస్ సొసైటీకి చిరకాల సంబంధం ఉంది. మదరాసులోని పచ్చయప్ప ట్రస్టుబోర్డుకి ఆయన వరుసగా నాలుగేళ్ళు (1937-1941) అధ్యక్షులుగా వ్యవహరించారు. ప్రసిద్ధ కళాశాలల్లో ఒకటిగా పరిగణించబడుతున్న పచ్చయప్ప కళాశాల నూతనభవనాల నిర్మాణానికి ఆయన ఎంతో శ్రమించారు. ఆయన కృషివల్ల, నూతనభవనాలు వెలిశాయని చెప్పవచ్చు.

## మదరాసు శాసనమండలిలో సభ్యత్వం :

లక్షణస్వామి మొదలియారు రాజకీయవాది కాదు. ఆయన ఏ రాజకీయ పక్షానికీ చెందినవాడు కాదు. ఆయన్ని అలా పేర్కొనడం ఆయనకి నచ్చేది కాదు. కాని రాజకీయవాది కాకుండానే, ఆయన రాజకీయాలలో శ్రద్ధాసక్తులు ప్రదర్శిం చారు. అవసరమైనప్పుడు ప్రభుత్వాన్ని ప్రతిఘటించారు; ప్రభుత్వ విధానం తనకు నచ్చినప్పుడు, ఆయన దాన్ని సమర్థించారు కనుక ప్రతిఘటన కోసం ప్రతిఘటన అనే తత్త్వం కాదు ఆయనది.

1946 లో లక్ష్మణస్వామి మొదలియారుని మదరాసు శాసనమండలికి నామినేట్ చేశారు. 1952 లో పెద్ద మెజారిటీతో పట్టభద్రుల నియోజకవర్గంనుంచి ఆయన శాసనమండలి సభ్యులుగా గెలుపొందారు ఆ తర్వాత కూడా ఆయన ఎన్నికలలో జయిస్తూ సభ్యులుగా ఉన్నారు. అలా ఆయన శాసనమండలి సభ్యు లుగా 1969 దాకా వ్యవహరించారు. ఆయన చాలా కాలం ప్రతిపక్ష నాయకులుగా వ్యవహరించి రాష్ట్ర పురోగతికి యథాశక్తిగా తోడ్పడ్డారు. రాజకీయ కుట్రల్ని ఆయన ఏ మాత్రమూ సహించేవారు కారు ఆయన ప్రసంగాలు విషయ ప్రధా నాలు; సహేతుకాలు; నిష్పాక్షికాలు. కనుకనే, ఇతర సభ్యులు ఆయన ప్రసంగా లను శ్రద్ధగా ఆలకించేవారు. ఆయన విమర్శలు నిర్మాణాత్మకంగా ఉండేవని అభిజ్ఞుల అభిప్రాయం.

ఒకసారి శాసనమండలి ఉపాధ్యక్షురాలైన డాక్టర్ యస్ ముత్తులక్ష్మి రెడ్డి ఇలా అన్నారు :

"అధ్యక్షా! మన మిప్పుడు ధైర్యోపేతం, యుక్తి యుక్తం, వాగమృతం, అయిన ప్రసంగం విన్నాము. ఆ ప్రసంగం చేసినవారు పెక్కు ప్రపంచ సమావేశాలలో పాల్గొన్నవారు. రకరకాల మానవుల్ని జాతుల్ని చూసిన వారు; వారి ప్రగతిని పరిశీలించినవారు. మనమందరం గౌరవనీయ సభ్యులైన డా సర్ ఏ. యల్ మొదలియారుకి కృతజ్ఞులం'

రాజాజీవంటి ప్రసిద్ధ రాజనీతివేత్తకూడా లక్ష్మణస్వామి మొదలియారుని ప్రశంసించారు అప్పుడు రాజాజీ ముఖ్యమంత్రి. మొదలియారు ప్రతిపక్ష నాయకుడు

'వీలు కాదనుకుంటే తప్ప, కడమ సందర్భాలలో మనతో సహకరించేందుకు ప్రస్తుతం శక్తివంతమైన ఒక అనుసంధానం ఏర్పడి వుంది. డా. లక్ష్మణస్వామి మొదలియారు పేర్కొన్నట్లుగా, ఇతరులు మనల్ని పలకరించే విధంగా మనల్ని మనం పరిశీలించుకునేందుకు వీలుగా న్యాయ సమ్మతమైన ప్రతిపక్షం, అన్వేషణ దీపిక నెలకొన్నాయి. మనం కనుక తప్పుచేస్తే, డా మొదలియారు ఆయన పక్షం వారు తమ వివేకం, అనుభవం, నిష్పాక్షిక దృష్టి మొదలైన వాటిని పురస్కరించుకుని మనకు సహాయం చేస్తారు. కాగా శాసనమండలి మండలి కార్యకలాపాలు మునుపటికంటె యిక మెరుగుగా ఉండగలరని నేను భావిస్తున్నాను.'

మొదలియారుపట్ల రాజాజీకిగల అభిమానమూ విశ్వాసమూ పైమాటలవల్ల అభివ్యక్తము లవుతున్నాయి.

ఒకసారి ఒక బిల్లుని గురించి శాసన మండలిలో చర్చ జరుగుతూవున్నది. ఆ బిల్లుని ప్రవేశపెట్టిన మంత్రి కళా వెంకటరావు గారు. అలాంటి సమయాలలో ఏ కారణంవల్లనో మంత్రులుకొందరు, సభకు హాజరుకాకుండా వుంటారు. మంత్రులు గంటల తరబడి యిక్కడ కూర్చోవాలనే నియమం లేదని కళావారు తన సహచరుల్ని సమర్ధించారు ఆది నచ్చలేదు మొదలియారుకి. ఆది ప్రజాస్వామ్య విధానానికి విరుద్ధమనితోచింది ఆయనకి. వెంటనే ఆయన తాను గోడలు, ఖాళీకుర్చీలను ఉద్దేశించి మాట్లాడ గలనని అన్నారు బిల్లు మంత్రివర్గం సమష్టి బాధ్యత అనీ ఆయన పేర్కొన్నారు.

ఒకసారి గవర్నరు ప్రసంగం గురించి మాట్లాడుతూ లక్ష్మణస్వామి మొదలియారు ప్రజాస్వామ్య పద్ధతిని సభవారికి తెలియజేశారు. గవర్నరు ప్రసంగం తయారుచేసే బాధ్యత మంత్రివర్గానిది కనుక, ఆ ప్రసంగాన్ని విమర్శించే హక్కు సభవారికి ఉన్నదనీ, అంతమాత్రాన గవర్నరుగారిని విమర్శిస్తున్నట్టు భావించరాదనీ ఆయన పేర్కొన్నారు.

1952 లో కాంగ్రెస్ పార్టీ పరాజయం పొందింది మెజారిటీ సాధించలేక పోయింది అయినా కాంగ్రెసే మంత్రివర్గం ఏర్పాటు చేయగలదని ఆయన విశ్వసించారు.

శాసనమండలిని రద్దు చెయ్యాలని ఒక సభ్యుడు సూచించగా, లక్ష్మణస్వామి మొదలియారు ఆయనకి ఇలా చురక తగిలించారు. 'ఈ మండలి సభ్యులు శాసన సభకు వెళ్ళలేరు; వెళ్ళాలనీ అభిలషించడం లేదు విజ్ఞానాన్ని ఇనుమడించడానికి వారు ప్రయత్నిస్తారు. అందువల్ల మరే అర్హత లేకపోయినా 21 సంవత్సరాలు గాని అంతకు మించిన వయస్సుగాని కలిగిన సభ్యులలోనే విజ్ఞానం యావత్తూ కేంద్రీకృతమైనట్లు నా మిత్రుడు భావించవద్దని కోరుతున్నాను.' అలా అవసరమైనప్పుడు ఆయనలో పరిహాస రసికత తొంగిచూసేది.

పంచాయతీ బిల్లు చర్చకు వచ్చినప్పుడు, ఆయన దాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. దేశంలో ఎనభై శాతం మంది వోటనవేళ్ళ ముద్రల మూలంగా తమను తాము గుర్తించుకొంటున్నప్పుడు, పంచాయతీ బిల్లును ప్రవేశపెట్టడం తొందరపాటు చర్య అని ఆయన అభిప్రాయపడ్డారు. పంచాయతీ సభ్యుల ఒత్తిడివల్ల, అధికారుల ఒత్తిడివల్ల బిల్లు ఆచరణ యోగ్యం కాదనీ ఆయన విశ్వసించారు.

మద్యపాననిషేధం బిల్లు చర్చకు వచ్చినప్పుడు లక్ష్మణస్వామి మొదలియారు ప్రభుత్వాన్ని సమర్థించడమే కాక, బిల్లు పరిధిలోకి రక్షణదళాల వారిని కూడా తీసుకురావాలని ఆయన ఉద్బోధించారు. రక్షణదళాలవారిని బిల్లు పరిధిలోంచి మినహాయించింది ప్రభుత్వం అది ఆయనకి నచ్చలేదు. ఆ సందర్భంగా ఆయన అన్నమాటలివి: 'మనకంటె సైన్యంలో ఉన్న మన సోదరులు

ఎలా భిన్నులు? నన్ను తాగవద్దని చెపుతున్న యీ ప్రభుత్వం సైన్యంలో పని చేసే నా సోదరుడు తాగవచ్చునని ఎలా చెప్పగలుగుతుంది?' ఇలా ప్రశ్నిస్తూ ఆయన ఫీల్డ్ మార్షల్ అచిన్‌లెక్ అభిప్రాయాన్ని ఉదాహరించారు. ఫీల్డ్ మార్షల్ అన్నదేమిటంటే: 'మీరు మీ సైన్యాన్ని సంరక్షింపదలుచుకుంటే, మీరు క్రమ శిక్షణతో కూడిన రక్షణదళాన్ని చూడదలుచుకుంటే, మద్యపాన ఆకర్షణ నుంచి సైన్యాన్ని తప్పించవలసి వుంటుంది.'

మదరాసు ఎస్టేట్ (ఆస్తి లేక భూస్థితి) బిల్లు చర్చకు వచ్చినప్పుడు, ఆయన తన తీవ్ర ప్రతిఘటనను తెలియజేశారు. అలాగే జాతీయీకరణ బిల్లుని కూడా ప్రతిఘటించారు 'జాతీయీకరణ అంటే ప్రత్యేక వ్యక్తుల హక్కుల్ని హరించడమో లేక వాటికి భంగం కలిగించడమో కాదు. భూస్థితికి సంబంధించిన సంస్కరణలు ప్రవేశపెట్టండి. లేదా మీ యిచ్ఛ వచ్చిన మరో సంస్కరణ ప్రవేశపెట్టండి. కాని ఈ ప్రాథమిక సిద్ధాంతాన్ని మాత్రం గుర్తుంచుకోండి' అని ఆయన తన ప్రసంగంలో అన్నారు తాను ప్రతిఘటించినా, బిల్లు తప్పక పాసవుతుందనీ, కాని అది తిప్పికొట్టగలరనీ పేర్కొన్నారు. ఎస్టేటు బిల్లుని అమలులోకి తెచ్చిన ప్రాంతాలనుంచి 1952 ఎన్నికలలో ఒక్క కాంగ్రెసువాదీ జయించకపోవడం గమనించదగిన అంశం. రేషనింగు అమలులో ఉన్న ఆ రోజు లలో ఆయన కంట్రోళ్ళు సడలించాలని ఉద్బోధించారు. ఆహార వస్తువులు కనుక యథేచ్ఛగా లభ్యమవుతూ వుంటే నిలవచేసుకోవడం, లాభాల దృష్టి, నల్ల బజారు వ్యాపారం మొదలైన వాటికి ప్రజలు అలవాటు పడరని ఆయన పేర్కొన్నారు.

ఒక్క మాటలో చెప్పాలంటే, ఏ రాజకీయ పక్షానికి చెందని సభ్యుడుగా లక్ష్మణస్వామి మొదలియారు నిర్భయంగా నిశ్చలంగా శాసన మండలిలో వివిధ సమస్యలు గురించి తన మనోగతాభిప్రాయాలను వ్యక్తీకరించారని చెప్పవచ్చు ఆయన వివేకం, ధైర్యం శాసనమండలిలోని వివిధ వర్గాలవారి ప్రశంసకు పాత్రమయినాయి

## గౌరవాలు, గౌరవ డిగ్రీలు :

లక్ష్మణస్వామి మొదలియారు సేవను గుర్తించి అప్పటి బ్రిటిష ప్రభుత్వం ఆయనకి 1925 లో రావుబహదూర్ అనే బిరుదు ఇచ్చింది. దివాన్

బహదూర్ బిరుదు 1942 లో వచ్చింది. ఆయన విజ్ఞానశాస్త్ర వైదుష్యాన్ని గుర్తించి ఆంధ్ర విశ్వవిద్యాలయం 1943 లో డాక్టర్ ఆఫ్ సైన్స్ (డి యస్సి.) యిచ్చి ఆయన్ని సత్కరించింది ఆ మరుసంవత్సరం లక్నో విశ్వవిద్యాలయం ఆ తర్వాతి సంవత్సరం పాట్నా విశ్వవిద్యాలయం డి.యస్సి. గౌరవ డిగ్రీలు ఇచ్చాయి. పదహారు విశ్వవిద్యాలయాలు ఆయనకి గౌరవ డిగ్రీలు ప్రదానం చేసి గౌరవించాయి.

1945 లో బ్రిటిషు ప్రభుత్వం ఆయనకి అత్యున్నతమైన 'సర్' బిరుదు బహూకరించింది

1948 లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం ఆయన్ని డాక్టర్ ఆఫ్ సివిల్ లా (డి.సి.యల్ ) గౌరవ డిగ్రీతో సత్కరించింది.

గ్లాస్గో, హాంకాంగ్, లండన్ మొదలైన పాశ్చాత్య విశ్వవిద్యాలయాలు కూడా ఆయన్ని గౌరవ డిగ్రీలతో గౌరవించాయి.

స్వతంత్ర ప్రభుత్వం కూడా లక్ష్మణస్వామి మొదలియారును గౌరవించింది ఆయనకి 1954లో పద్మభూషణ్ వచ్చింది. 1963 లో పద్మ విభూషణు లయ్యారు

విజ్ఞానశాస్త్ర పారిశ్రామిక పరిశోధనా మండలికి రామస్వామి మొదలియారు జనకుడు. ఆ మండలి పాలకవర్గంలో సభ్యులుగా పెక్కేండ్లు పనిచేసి ఆ సంస్థ అభివృద్ధికి లక్ష్మణస్వామి మొదలియారు కృషి చేశారు.

లక్ష్మణస్వామి మొదలియారు పాల్గొన్న కొన్ని జాతీయ, అంతర్జాతీయ సమావేశాలు; ఆయన సభ్యులుగానో, అధ్యక్షులుగానో వ్యవహరించిన కొన్ని సంస్థలు ఈ దిగువ పేర్కొనబడుతున్నవి

మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా సభ్యుడు (ప్రారంభమైన 1931 సంవత్సరం నుంచి)

భోర్ కమిటీ సభ్యుడు.

హెల్త్ సర్వే ప్లానింగ్ కమిటీ అధ్యక్షుడు.

సి. యస్ ఐ ఆర్ పాలకమండలి సభ్యుడు.

పారిశ్రామిక విద్యకు సంబంధించిన అఖిల భారత కౌన్సిల్ సభ్యుడు

యం. ఐ. టి.&ఐ ఐ. టి గవర్నర్ల బోర్డు అధ్యక్షుడు.

అంతర్విశ్వవిద్యాలయ బోర్డు అధ్యక్షుడు.

విశ్వ విద్యాలయ విరాళాల సంఘం (యు. జి సి) సభ్యుడు.

ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ పాలకమండలి సభ్యుడు.

బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ సభ్యుడు.

వైద్య విద్యాభివృద్ధికి సంబంధించిన భారతీయసంఘం స్థాపక - అధ్యక్షుడు.

ప్రపంచ ఆరోగ్యసంస్థ (WHO) తాలూకు వార్షిక సమావేశాలకు (1949-1956) హాజరయిన భారతీయ ప్రతినిధివర్గ సభ్యుడు.

WHO కార్యనిర్వాహకవర్గ అధ్యక్షుడు

యునెస్కో (UNESCO) భారతీయ ప్రతినిధివర్గ సభ్యుడు.

యునెస్కో కార్యనిర్వాహకవర్గ అధ్యక్షుడు 1954-1956.

కామన్వెల్త్ విశ్వవిద్యాలయాల సంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యుడు 1948-1958.

ప్రపంచ ఆరోగ్యసంస్థ సమావేశ అధ్యక్షుడు, 1961.

కొత్తఢిల్లీలో జరిగిన తృతీయ ప్రపంచ వైద్యవిద్యా మహాసభకు అధ్యక్షుడు

## దేశభాషలలో ఆసక్తి :

లక్ష్మణస్వామి మొదలియారుకి గల ఆంగ్ల భాషా వైదుష్యం సర్వవిదితం. ఆయన ఆంగ్లంలో ప్రముఖ వక్త విశ్వవిద్యాలయ స్థాయిలో ఆంగ్లం బోధనా భాషగా ఉండాలని ఆయన ఆశించారు. ఆంగ్ల విద్యాభ్యాసం అవసరమని ఆయన ఉద్ఘాటించారు. దేశభాషల విషయంలో ఆయన అంత ఆసక్తి ప్రదర్శించ లేదని కొందరు భావిస్తారు. కాని యిది సత్యసన్నిహితం కాదని భావించేవారు కొంద



భారత రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ నుండి పద్మవిభూషణ్ బిరుదును
స్వీకరిస్తున్న సర్ లక్ష్మణస్వామి మొదలియార్.



భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూతో డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియార్.



ఇంగ్లండు రాణితో సర్ లక్ష్మణస్వామి మొదలియార్.

రున్నారు. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం మొదలైన దక్షిణాది భాషలలో ఎన్నో పుస్తకాలు ప్రకటించిన దక్షిణ భాషా పుస్తక సంస్థ అభివృద్ధి పట్ల ఆయన ఎంతో ఆసక్తి ప్రదర్శించినట్లు అభిజ్ఞులు చెపుతారు. దక్షిణ భాషా పుస్తక సంస్థ తాలూకు ముఖ్యమైన అన్ని సమావేశాలలోను తాను పాల్గొన్నట్లు ఆయన ఒక బహిరంగ సమావేశంలో పేర్కొన్నారు. ద్రావిడ భాషలలో ఆధునిక విషయాలమీద రచనలకు మదరాసు విశ్వవిద్యాలయం బహుమతులు ఇచ్చే విషయం నలుగురికి తెలిసిందే ఈ విషయంలో లక్ష్మణస్వామి మొదలియారు శ్రద్ధాసక్తులు ప్రకటించేవారు. తాత్కాలిక ఉపాధ్యక్షులుగా ఉన్నరోజుల్లో ఆయన ప్రాచ్య భాషలలో బి.ఓ.యల్ (బాచిలర్ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజెస్), బి.ఓ.యల్. (ఆనర్సు) డిగ్రీ కోర్సులు ప్రారంభించారు. మదరాసు విశ్వవిద్యాలయంలో ఆయన హయాము ముగింపులో 13 భాషా శాఖలు పనిచేసేవి.

వైద్యుడుగా, విద్యావేత్తగా ప్రథిత యశస్కులయిన లక్ష్మణస్వామి మొదలియారుకి నలుగురు సంతానం - ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. జ్యేష్ఠ కుమారులైన డాక్టర్ వేణుగోపాల్‌గారు మదరాసులో ప్రముఖ వైద్యులు.

బహుముఖ ప్రతిభా సంపన్నులైన డాక్టర్ సర్ లక్ష్మణస్వామి మొదలియారు 1974, ఏప్రిలు 15 న దివంగతులయ్యారు అప్పటి కాయన ఎనభైయేడేళ్ళ వృద్ధులు. ఆ యశఃకాయునికి జేజేలు !

## ఒక ముచ్చట :

జీవితమంతా నిర్విరామంగా కృషి సలిపిన లక్ష్మణస్వామి మొదలియారుకి సంబంధించిన ముచ్చటలు ప్రచారంలో ఉండడం ఒక వింత కాదు. అందులోను ఆయన పేరెన్నికగన్న వైద్యుడు; ప్రసూతి శాస్త్రజ్ఞుడు

ఆయన ఎగ్మూరు ఆసుపత్రిలో పనిచేసే రోజులలో, ఒకనాటి రాత్రి ఆయన వార్డులు తణిఖీ చేస్తున్నారు ఉన్నట్టుండి ఆయన దృష్టి ఒక గోడమీద పడింది. ఆ గోడమీద నెత్తుటి చారలు. ఆయనకి ఆశ్చర్యం కలిగింది. ఆ రాత్రి ఆస్పత్రికి వచ్చినప్పుడు ఆ గోడ మామూలుగానే ఉంది. ఇంతలో ఆ నెత్తుటిచారలు

ఎలా వచ్చాయి ? అదే ఆయన ఆశ్చర్యం నెత్తుటి చారలున్న గోడవైపుగా వెళ్ళారు. అక్కడినుంచి మూలుగులు వినవస్తున్నాయి తాననుకున్నదే నిజమను కున్నట్టుగా ఆయన ముఖంలో ప్రశాంతత కనిపించింది దగ్గరికివెళ్ళి చూడగా, ఒక స్త్రీ పురిటినొప్పులు పడుతోంది. ఆ ప్రసవ వేదనను భరించలేకపోతోంది. దయనీయమైన దృశ్యం! ఏమనుకున్నారో యేమిటో, లక్ష్మణస్వామి మొదలి యారు వెంటనే ఆమెను తన గదికి చేర్పించారు. సహవైద్యులు లేరు. నిమిషాల మీద ఆమెకు శస్త్రచికిత్స చేయడం అవసరమనిపించింది ఆయనకి అలాగే చేశారు. బంగారంలాంటి శిశువుని, ఆ తల్లి ప్రాణాన్ని కాపాడారు ఆమె ఒక కార్మిక స్త్రీ. తనకు ప్రాణదానం చేసిన ఆ మహనీయుణ్ణి ఆ యిల్లాలు ఎంతగానో అభినందించి వుంటుంది!

## మరో ముచ్చట :

సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు విశ్వవిద్యాలయోపాధ్యక్షు లుగా నియమితులు కావడంవల్ల, సిండికేటులో ఖాళీ ఏర్పడింది. ఆ ఖాళీని భర్తీ చేసేందుకు లక్ష్మణస్వామి మొదలియారు ఎన్నికలో నిలబడ్డారు. ఆయనతోపాటు మరి యిద్దరు ప్రముఖులు పోటీ చేశారు. ఎక్కువ ఆధిక్యంతో లక్ష్మణస్వామి మొదలియారు ఆ ఎన్నికలో గెలుపొంది సిండికేటు సభ్యులయ్యారు ఆ విషయం ఆ మరునాడు పత్రికల్లో వెలువడింది

ఆ రోజు విక్టోరియా హాస్టలులో ఒక విందు సందర్భంగా రామస్వామి మొదలియారు న్యాయకళాశాల ప్రిన్సిపాలు ఆర్థర్ డేవిస్‌ను కలుసుకున్నారు. డేవిస్ ఆంగ్లేయుడు. వాళ్ళిద్దరూ పక్కపక్కనే కూర్చున్నారు. ఆ రోజు పత్రికలో పడిన సిండికేటు వృత్తాంతం వారి మాటలలో ప్రముఖస్థానం వహించడం సహజం. లక్ష్మణస్వామి మొదలియారు సిండికేటు సభ్యుడు కావడం డేవిస్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఆశ్చర్యం ప్రకటిస్తూ, "యూనివర్సిటీ వ్యవహారాలు ముందు ముందు ఎలా వుంటాయో? సిండికేటుకి వైద్యుడివల్ల ఏం లాభం వుంటుం దని? ఇంతకూ ఆయనకేం తెలుసు?'' అన్నాడు.

"అవునవును మీ కాయన తెలుసా ?" రామస్వామి మొదలియారు ప్రశ్నించారు.

"నాకు తెలీదు. మీకు తెలుసా?" డేవిస్ అడిగాడు.

"ఏదో ఒక మాదిరిగా తెలుసు."

"ఆయన మీ కెలా తెలుసు?"

"నాకు తమ్ముడవుతాడు."

అంతే. డేవిస్ ముఖం మారిపోయింది. క్షమించమన్నట్టుగా చూశాడు.

రామస్వామి మొదలియారు ఆయన్ని మామూలు స్థితికి తీసుకువచ్చి "ఈసారి సిండికేటు మీటింగులో మా తమ్ముణ్ణి కొంచెం గమనించండి" అన్నారు.

ఆ తర్వాత డేవిసే కాదు, ఇతర సభ్యులు కూడా లక్ష్మణస్వామి మొదలియారుకి గల పరిపాలనాదక్షతను, శక్తియుక్తుల్ని గ్రహించగలిగారు.

# ఉపసంహారం

కవల పిల్లలు సర్వ సాధారణంగా అనురూపులై ఉంటారు. ఆకృతిలోనే రూపసామ్యం కనిపిస్తుంది. కాని వారి పేరు ప్రతిష్ఠలలో సామ్యం కనిపించాలని నియతి ఏమీ లేదు అయితే ఆర్కాటు సోదరులుగా జగద్విఖ్యాతులైన రామస్వామి మొదలియారు, లక్ష్మణస్వామి మొదలియారు వేష భాషలలోనేకాక పేరు పెంపుల లోను సమానత్వం గడించి చరిత్ర సృష్టించినవారయ్యారు. కనుకనే లోకం ఆ కవలల్ని అపూర్వ సహోదరులుగా సహేతుకంగా భావిస్తున్నది.

ఆర్కాటు సోదరులు సుశ్లోకులు; ఉన్నత పదవులు సమర్థవంతంగా నిర్వహించిన గరీయః ప్రతిభులు. వారి ప్రతిభ అనన్యసామాన్య మనక తప్పదు జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిని సరిసమానంగా గడించారు. ప్రపంచ సంస్థల కార్యకలాపాలలో పాల్గొని అందరి మన్ననలకు పాత్రులై ప్రపంచ పౌరులనిపించుకున్నారు మొదలియారు అంటే ప్రపంచానికి స్ఫురణకు వచ్చేది రామస్వామి, లక్ష్మణస్వామి మొదలియారులే అలాంటి ప్రతిభా సంపన్నులు అరుదుగా ప్రభవిస్తారనడం చర్విత చర్వణం ఆ అపూర్వ సోదరుల ప్రతిభను జాతీయ అంతర్జాతీయ సంస్థలు గుర్తించడమేకాక, సముచిత రీతిని సత్కరించాయి. కాని రామస్వామి మొదలియారు ప్రతిభను స్వతంత్ర భారత ప్రభుత్వం అంతగా గుర్తించలేదని ఒక అపప్రథ లేకపోలేదు. 'మన దేశం నిస్సంశయంగా గర్వించదగినవారు ఆర్కాటు సోదరులు' అనీ, 'వారు మన దేశపు ఉత్తమ దేశభక్తులు అనీ సర్వేపల్లి రాధాకృష్ణన్, రాజాజీ ప్రభృతుల ప్రశంసకు పాత్రులైన రామస్వామి మొదలియారు, లక్ష్మణస్వామి మొదలియారు నిర్ద్వంద్వంగా భారతమాత కన్న పుత్ర రత్నాలు. ఆ రత్న ద్వయం ప్రపంచానికే గర్వకారణం!

ఆర్కాటు సోదరుల రాజకీయాభిప్రాయాలు జాతీయోద్యమ నాయకుల అభిప్రాయాలకు విభిన్నములై ఉండవచ్చు. రామస్వామి మొదలియారు జస్టిస్ పార్టీలో ప్రముఖ నాయకుడై ఉండవచ్చు. పిట్టి త్యాగరాయసెట్టివంటి త్యాగమూర్తుల ఆదర భావాన్ని ఆయన బహుధా చూరగొన్నవారు. బ్రిటిషు వారి

హయాములో ఆయన ఎన్నో ఉన్నత పదవులు అలంకరించారు. అత్యున్నతము లైన గౌరవాలు పొందారు. అలాగే లక్ష్మణస్వామి మొదలియారు కూడా బ్రిటిష్ వారి పరిపాలనలో ఎన్నో విశిష్ట గౌరవాలు పొందారు మన విద్యావిధానంలో ఆంగ్లభాషకు విశిష్ట స్థానం ఉన్నదని వారిద్దరూ గాఢంగా విశ్వసించారు.

అంత మాత్రాన రామస్వామి, లక్ష్మణస్వామి మొదలియారులకు దేశభక్తి లేదని అనుకోవడం పొరపాటు వారిద్దరు తాము నేర్చిన చదువు సంధ్యల్ని జాతి సంక్షేమం కోసం మీదుకట్టారు. తమ కార్యకలాపాల వల్ల తమ దేశానికి అంతర్జాతీయంగా పేరుపెంపులు సమకూర్చారు. ఆర్థిక శాస్త్రవేత్త అయిన రామస్వామి మొదలియారు పారిశ్రామికరంగంలో ఎంతో కృషిచేసి, ఆ రంగం ప్రగతికి తోడ్పడ్డారు. అలాగే విశ్వవిద్యాలయ విద్యారంగంలో, వైద్యశాస్త్రంలో గణనీయమైన కృషిచేసి లక్ష్మణస్వామి మొదలియారు మార్గదర్శకు లయ్యారు. ఆర్థికంగా బలహీనులైన వారి పట్ల రామస్వామి మొదలియారు సహజమైన సానుభూతి ప్రదర్శించగా, లక్ష్మణస్వామి మొదలియారు తన వైద్యశాస్త్ర వైదుష్యాన్ని పురస్కరించుకుని మహిళా లోకానికి, శిశు సంక్షేమానికి ఎంతగానో తోడ్పడ్డారు. ఇది దేశసేవ కాదా? ఆర్కాటు సోదరులది నిర్మాణాత్మకమైన కృషి. సంగ్రహంగా చెప్పాలంటే, మన దేశంలో పారిశ్రామిక రంగమనే సరికి రామస్వామి మొదలియారు, విశ్వవిద్యాలయ విద్యారంగ మనేసరికి లక్ష్మణస్వామి మొదలియారు స్ఫురణకు వస్తారు.

కొమ్ములు తిరిగిన వారైనా సరే, వారు సమకాలికుల మెప్పుని పొందడం అనుకున్నంత సులభం కాదు. చేమకూర వేంకటకవి చెప్పినట్లుగా "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!" సమకాలికుల మెప్పును పొందడం చాలా కష్టం. కాని ఆర్కాట్ సోదరులు చేమకూర వేంకటకవి వాక్యాన్ని పరాస్తం చేశారు. దేశ విదేశాలలోని ప్రముఖులు పలువురు ఆ అపూర్వ సహోదరుల ప్రతిభకు సహర్షంగా నివాళు లర్పించారు వారి రాజకీయాభిప్రాయాలలో విభిన్నులైన వారు కూడా వారిని ప్రశంసించారంటే రామస్వామి, లక్ష్మణస్వామి మొదలియారుల ప్రతిభను ఎంతని కొనియాడగలం ?

ఆర్కాటు సోదరులు ప్రశాంత గంభీరులు. వారు ఎంత సౌమ్యంగా కనిపించే వారో, వారి అభిప్రాయాలు అంత ఖచ్చితంగా, దృఢంగా ఉండేవి. అవి లోకజ్ఞాన సహితములని అభిజ్ఞుల అభిప్రాయం. ఈ సందర్భంలో సుప్రసిద్ధ విద్యావేత్తలైన డా. సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారి మాటలు స్మరించదగినవి. తమ వృత్తులకు సంబంధించి ఆర్కాటు సోదరులు తమ మౌలిక భావాలను నిశ్చలంగా, విజయవంతంగా ఆచరణలో పెట్టగలిగారని ఆయన పేర్కొన్నారు ఇతరులను గ్రుడ్డిగా అనుసరించకుండా ఆర్కాటు సోదరులు తమ మౌలిక భావాలను విజయవంతంగా కార్యరూపంలో పెట్టడం వల్ల వారు తమకంటూ ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకో గలిగారు.

లక్ష్మణస్వామి మొదలియారు గురించి చెపుతూ సర్. సి. పి. రామస్వామి అయ్యరు '**Suaviter in modo, fortiter in re**' అనే ఒక లాటిన్ సుభాషితాన్ని ఉదాహరించారు. 'ప్రవర్తనలో సరసత, కార్యనిర్వాహణలో స్థైర్యం- అని ఈ సుభాషితానికి అర్థం చెప్పుకోవచ్చు. నిజానికి ఈ రెండు విశిష్ట లక్షణాలు లక్ష్మణస్వామి మొదలియారులో కొట్టవచ్చినట్టు గోచరిస్తాయి సరసమైన ప్రవర్తన, స్థిరచిత్తంతో కూడిన కార్యనిర్వాహణ పరిపాలనా దక్షునికి ఉండవలసిన ప్రధాన లక్షణాలు. ఇవి రామస్వామి మొదలియారులో కూడా కనిపిస్తాయి.

'రాజకీయ వాదిగా వ్యవహరించకుండానే రాజకీయాలలో వ్యవహరించిన విజ్ఞుడు' అని సి. పి. రామస్వామి అయ్యరు గారు లక్ష్మణస్వామి మొదలియారుని ఉద్దేశించి పేర్కొన్నారు రామస్వామి మొదలియారు రాజకీయవాదిగా జీవిత రంగంలో ప్రవేశించి చివరికి ప్రముఖ రాజనీతివేత్తగా, పార్లమెంటేరియనుగా (వాద చతురుడు) ఎనలేని పేరు పెంపులు గడించారు కాని లక్ష్మణస్వామి మొదలియారు అలా కాదు. ఆయన జీవితరంగంలో ప్రభుత్వోద్యోగిగా ప్రవేశించడంవల్ల రాజకీయాలలో ప్రత్యక్షంగా పాల్గొనలేదు. అయినా మదరాసు శాసన మండలిలో ఆయన ఇరవై ఒక్క సంవత్సరాలు సభ్యులుగా వ్యవహరించారు పైగా, మండలిలో ప్రతిపక్ష నాయకులు. ప్రతిఘటన అవసరమైనప్పుడు ఆయన ప్రభుత్వాన్ని విమర్శించరు; ప్రభుత్వ ప్రతిపాదనలు సరసమైనవిగా తోచినప్పుడు ప్రభుత్వంతో సహకరించడానికి ఆయన మీనమేషాలు లెక్కపెట్ట లేదు. ఇంతటి

విజ్ఞతతో ప్రవర్తించిన కారణంగా రాజాజీ వంటి ప్రముఖుల ప్రశంసను ఆయన చూరగొన్నారు కనుక సర్ సి. పి మాటలలో గంభీరార్థం ఇమిడి వున్నట్లు భావించవచ్చు

ఇక తమ వృత్తులలో ఆర్కాటు సోదరులు అద్వితీయులనడం సత్య సన్నిహితం. న్యాయవాదిగా రామస్వామి మొదలియారు రాణించి నలుగురి మెప్పుని పొందారు అలాగే రాజకీయవాదిగా కీర్తిగడించారు. ఆ తరువాత ఆయన ఆర్థిక శాస్త్రవేత్తగా అంతర్జాతీయఖ్యాతి గడించారు. లక్ష్మణస్వామి మొదలియారు వైద్య శాస్త్రజ్ఞునిగా చిరకీర్తి గడించారు. నాడి పరీక్షించి ప్రసవకాలంలో స్త్రీ దేహంలో జరిగే మార్పుల్ని గ్రహించడంలో ఆయకి ఆయనే సాటి అని అభిజ్ఞుల అభిప్రాయం తన తల్లి స్మృత్యర్థంగా ఆయన వైద్యవృత్తి చేపట్టినట్టు చెబుతారు.

లక్ష్మణస్వామి మొదలియారు బహుముఖమైన ప్రతిభను ప్రశంసిస్తూ "ఆయన కేవలం తన ప్రతిభ వల్లనే ఉన్నతి గడించినవాడు" అని కట్టమంచి రామలింగారెడ్డిగారు పేర్కొన్నారు. ఇది అక్షరాలా నిజం. ఇతరుల దయాదాక్షిణ్యాలవల్లనో లేక కుట్రలవల్లనో ఆయన పైకి రాలేదు. ప్రశాంతంగా కనిపించినా, అభిప్రాయ ప్రకటనలో ఆయన స్వతంత్రుడని, స్థిరచిత్తుడని కట్ట మంచివారు పేర్కొన్నారు

రామలింగారెడ్డిగారి ఈ మాటలు రామస్వామి మొదలియారుకి కూడా వర్తి స్తాయి. ఆయనకూడా తన ప్రతిభవల్లనే ఉన్నత పదవులు అలంకరించి ప్రజాభి మానానికి పాత్రులయ్యారు.

స్వదేశంలోనే కాక విదేశాలలో సైతం ఆర్కాటు సోదరులు పెక్కు సభల, సమావేశాలలో పాల్గొన్నారు అంతర్జాతీయ సంఘాలలో సభ్యులుగా ఉండేవారు. ఏదేశ మేగినా, ఏపీఠ మలంకరించినా, వారి జరీ తలపాగలు, ఫాల భాగాన శ్రీ చూర్ణం గోచరించేవి. భారతీయత ఉట్టిపడుతూ కనిపించేవారు. వేష భాషలు పాశ్చాత్యమైనా, వారి సంప్రదాయాలు మాత్రం భారతీయ సంప్రదా యాలే. అదే వారిలోని విశిష్టత! వారివలె, వారి సహధర్మచారిణులు కూడ దైవ చింతన, పాపభీతి కలవారు.

కర్నూలులో ప్రభవించి, మదరాసులో విద్యాభ్యాసం చేసి, ఉన్నత పదవు లెన్నో అలంకరించి, జాతీయ అంతర్జాతీయ ఖ్యాతి సముపార్జించి చరిత్రలో నిలిచిపోయిన సుశ్లోకులు ఆర్కాటు సోదరులు భారతావనికే కాదు, సభ్య ప్రపంచ నికే వారు గర్వకారణం. సామర్థ్యం ప్రదర్శన, కీర్తి సముపార్జన-అన్నది వారి జీవితధ్యేయమని పేర్కొనవచ్చు. తమ శక్తి సామర్థ్యాలు మీదుపెట్టి మానవ సేవ చేసిన మహితాత్ములు వారు. ఆ అపూర్వ సోదరుల జీవిత చరిత్రను పరిశీ లిస్తే వారు ప్రదర్శించిన విజ్ఞత, వారి సౌశీల్యం భావితరాల వారికి శిరోధార్యాలని పేర్కొనవచ్చు. అఖిలలోకం మెచ్చిన ఆ సోదరులకు మనం సమకాలికులం కావడం మన భాగ్య విశేషం. చరిత్రకెక్కిన ఆ చరితార్థులకు భక్త్యంజలి!

వివిధ రంగాలలో ఆర్కాటు సోదరులు కావించిన విశిష్ట కృషిని, వారు సాధించిన విజయాలను ప్రాచ్య పాశ్చాత్య ప్రముఖులు పలువులు బహుధా ప్రశంసించారు. వారిలో ఒకరు అప్పట్లో ప్లానింగు కమిషన్ సభ్యులు. ప్రస్తుతం మన రాష్ట్రపతి అయిన గౌరవనీయులు శ్రీ ఆర్. వెంకటరామన్ గారు ఆర్కాటు సోదరుల విశిష్ట సేవలను కొనియాడిన తీరు పరిశీలించదగింది.

'మహత్తరమైన రాజకీయ పరిణామాలతో నిమిత్తం లేకుండా యాభై సంవత్సరాలకు పైగా మనదేశ వ్యవహారాలలో కవలలైన డా॥ ఏ. రామస్వామి మొదలియారు, డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలియారు నిర్వహించిన ప్రముఖ పాత్రకు బ్రిటిష్ పరిపాలనను స్వతంత్ర భారతాన్ని దర్శించిన తరం వారు సాక్షులు.

నేనింకా విద్యార్థిగా ఉన్న రోజులలోనే డా ఏ. రామస్వామి మొదలియారు రాజకీయంగా ఎంతోఖ్యాతి గడించారు ఇంగ్లీషు భాష మీద ఆయనకిగల అధి కారం, ఆ వాగ్ఝరీ ఈర్ష్య చెందేవి ఉండేవి ఆయన ప్రసంగాలు వినడానికి నేను దూరం లెక్కచేసే వాణ్ణి కాను. ఆయన ప్రసంగాలలో దొర్లే ఆ మధుర పదబంధాలను, ఆ అనుసంధాన వాక్యాలను నేను కంఠస్థం చేసేవాణ్ణి. ఆయన అలంకరించిన ప్రతి పదవికి జీవం, కాంతీ సమకూర్చారు కార్యాచరణపట్ల చిత్త శుద్ధి పాటించి మార్గదర్శకులయ్యారు జాతీయ, అంతర్జాతీయ స్థాయిని ఆయన ఇంచుమించు అన్ని ఉన్నత పదవులూ అలంకరించారు. షెక్యూ ఐక్యరాజ్య

సమితి సంస్థలకు ఆయన్ని అనుసరించి వెళ్ళే అవకాశాలు నాకు లభించాయి. అందువల్ల ఆయా సంస్థలలో ఆయనపట్ల ప్రదర్శితములైన ఆదరాభిమానాలకు నేను ప్రత్యక్ష సాక్షిని ECO SOC అధ్యక్షుడుగా, ఐక్యరాజ్యసమితి తాలూకు పెక్కు కమిటీలు కమిషన్ల అధ్యక్షుడుగా ఆయన భారతదేశపు ప్రతిష్ఠను ఇనుమడింప జేశారు. అంత ప్రతిష్ఠ అంతకు ముందెన్నడు మనకు కలగలేదు. ప్రకృతం ఆయన పరిణతి చెందిన తన వివేకాన్ని, విజ్ఞానాన్ని, అనుభవాన్ని దేశ ఆర్థికాభివృద్ధికి వినియోగిస్తున్నారు. ఇది ఆయన ఇంతకుపూర్వం నిర్వహించిన వివిధ పదవులవలె, జాతికి ఎంతో ముఖ్యమైనది.

అభిమాన పూర్వకంగా డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియారును గురించి నేను చెప్పకుండా ఉండలేను మదరాసు శాసనమండలిలో ఆయనకి అభిముఖంగా కూర్చున్న ఆ పది సంవత్సరాలలోను నేను ఆయన విద్వత్తుని, బహుముఖ ప్రతిభను, మితవాదిత్వాన్ని, అచంచలమైన కార్యదీక్షను చూసి మురిసిపోయ్యేవాణ్ణి. ఆయనది శాస్త్రీయమైన ఆలోచనా విధానం; వివిధ సమస్యలను విజ్ఞానశాస్త్ర దృష్టితో పరిశీలించేవారు. విజ్ఞానశాస్త్రంలో గాని, సాంకేతికరంగంలో గాని డా॥ ఏ యల్. మొదలియారు విశిష్ట సేవ లభించని శాఖ లేదు. గత మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో మదరాసులో స్థాపించబడిన విజ్ఞానశాస్త్ర సాంకేతిక సంస్థల ఉనికికి ఆయన నిరంతర కృషి శక్తిసామర్థ్యాలు కారణ మనవచ్చు. ఐ ఐ టి., చర్మ సాంకేతికశాస్త్ర సంస్థ, రాష్ట్రంలోని ఇంజనీరింగు వైద్య కళాశాలలు మొదలైనవి ఆయన సాధనలకు సజీవోదాహరణాలు.

రాష్ట్రంలోనే కాక మన దేశంలో కూడా విద్యారంగానికి డా॥ ఏ.యల్. మొదలియారు చేసిన సేవ శాశ్వత మయింది. పాతికేండ్లకు పైగా మదరాసు విశ్వవిద్యాలయానికి ఆయనలా మరొకరు సారథ్యం వహించలేదు.

డా॥ ఏ యల్. మొదలియార్ WHO, UNESCO లలో భారత దేశానికి కీర్తి ప్రతిష్ఠలు సమకూర్చారు ఇతర ప్రతినిధి వర్గాలు ఆయన్ని అభిమాన పూర్వకంగా గుర్తు చేసుకుంటున్నారు

విద్వాంసులు, రాజనీతిజ్ఞులు అయిన ఆ కవలలకు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం డి సి.యల్. గౌరవ పట్టం ప్రదానం చెయ్యడం భారతదేశ చరిత్రలోనే కాక, ఆ విశ్వవిద్యాలయ చరిత్రలో కూడా విలక్షణమైన విషయం.

# ప్రశంసా స్తబకం

(ఆర్కాటు సోదరులకు అశీతి వర్షాలు నిండిన సందర్భంగా బహుముఖమైన వారి సేవలను ప్రశంసిస్తూ ప్రాచ్య పాశ్చాత్య ప్రముఖులు సందేశాలు పంపారు; ప్రత్యేక వ్యాసాలు వ్రాశారు. వాటి లోంచి ఈ క్రింది ప్రశంసా వాక్యాలు ఉద్ధృతాలు.)

మనదేశం నిస్సంశయంగా గర్వించదగినవారు ఆర్కాటు సోదరులు.

**-సర్వేపల్లి రాధాకృష్ణన్**

యాభై యేళ్ళకు మించిన ప్రజాహితజీవితంలో వారు సాధించిన విజయాలు సర్వవిదితం.

**-జాకిర్ హుసేన్**

ప్రముఖ విద్యావేత్తలైన వారిద్దరూ సంస్థల వంటివారు. ఎన్నో పదవులు విజయవంతంగా నిర్వహించారు.

**-వి. వి. గిరి**

వారు మనదేశపు ఉత్తమ దేశభక్తులు.

**-సి. రాజగోపాలాచారి**

బహురంగాలలో మూర్తీభవించిన సేవ ఆర్కాటు సోదరులు.

**-మైసూరు మహారాజా జయచామరాజ ఒడయరు**

మహనీయులైన తన కుమారు లిద్దరిని చూసి నవ భారతం గర్వించవచ్చు.

**-సి. వి. నరసింహన్**

'నేనింకా విద్యార్థిగా ఉన్న రోజులలోనే డా. ఎ రామస్వామి మొదలియారు రాజకీయంగా ఎంతో ఖ్యాతి గడించారు ఇంగ్లీషుభాష మీద ఆయనకి గల

అధికారం, ఆ వాగ్ధోరణి ఈర్ష్య చెందేవిగా ఉండేవి. ఆయన ప్రసంగాలు వినడానికి నేను దూరం లెక్కచేసేవాణ్ణి కాను. ఆయన ప్రసంగాలలో దొర్లే ఆ మధుర పదబంధాలను, ఆ అనుసంధాన వాక్యాలను నేను కంఠస్థం చేసేవాణ్ణి. ఆయన అలంకరించిన ప్రతి పదవికి జీవం, కాంతీ సమకూర్చారు. కార్యాచరణ పట్ల చిత్తశుద్ధి పాటించి మార్గదర్శకులయ్యారు జాతీయ, అంతర్జాతీయ స్థాయిని ఇంచుమించు అన్ని ఉన్నత పదవులూ అలంకరించారు .. .. ఆయన భారత దేశపు ప్రతిష్ఠను ఇనుమడింప జేశారు.

మదరాసు శాసన మండలిలో ఆయనకి (డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలి యారు) అభిముఖంగా కూర్చున్న ఆ పది సంవత్సరాలలోను నేను ఆయన విద్వత్తుని, బహుముఖ ప్రతిభను మితవాదిత్వాన్ని, అచంచలమైన కార్యదీక్షను చూసి మురిసిపోయ్యే వాణ్ణి. ఆయనది శాస్త్రీయమైన ఆలోచనావిధానం; వివిధ సమస్యలను విజ్ఞానశాస్త్ర దృష్టితో పరిశీలించే వారు విజ్ఞాన శాస్త్రంలో గాని సాంకేతిక రంగంలో గాని డా॥ ఎ. యల్. మొదలియారు విశిష్టసేవ లభించని శాఖ లేదు గత మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో మదరాసులో స్థాపించ బడిన విజ్ఞానశాస్త్ర సాంకేతిక సంస్థల ఉనికికి ఆయన నిరంతర కృషి, శక్తి సామర్థ్యాలు కారణమనవచ్చు

-ఆర్. వెంకటరామన్

ప్రజాహిత జీవితంలో సోదరు లిద్దరూ సరిసమానంగా పేరు పెంపులు గడించడం అపూర్వం.

-ఫ్రాంక్ మొరేస్

వారు ప్రసిద్ధ వక్తలు.

-సి యన్. అణ్ణాదురై

వారి వంటి నిస్స్వార్థ నాయకులు నేడు మనకు చాలా అవసరం

-ఆర్ అరుణప్ప

పందొమ్మిదవ శతాబ్ది చివరి పాదంలో మన దేశంలో ప్రభవించిన వారిలో వారిద్దరూ మహనీయులు, మహోన్నతులు, సౌజన్యమూర్తులు.

-సి. డి దేశ్‌ముఖ్

దేశనిర్మాణ కార్యక్రమంలో ఈ ఆదర్శ సహోదరులు సలిపిన కృషి అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వాన్ని ప్రజల్ని ముగ్ధుల్ని చేసింది.

-రాబర్ట్ యు. కాల్డువెల్

అశుతోష్ ముఖర్జీ కలకత్తా విశ్వవిద్యాలయానికి ఎలాంటి వాడో, మదరాసు విశ్వవిద్యాలయానికి డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియారు అలాంటివాడు.

నేటి భారత ప్రభుత్వం తన పక్షపాత వైఖరిని విడనాడి ప్రముఖ పార్ల మెంటేరియను, పరిపాలనా ధక్షుడు, రాజనీతిజ్ఞుడు, ప్రసిద్ధ వక్త అయిన రామ స్వామి మొదలియారు సహకారం అర్థించి, కేంద్ర మంత్రివర్గంలో ఆయనకి స్థానం కల్పించి, ఆంతరంగిక వ్యవహారాలుగాని, వాణిజ్యం పరిశ్రమలు లేదా మరేదైనా ముఖ్యమైన శాఖను ఆయనకి ఇచ్చివుండవలసింది

-యం. యస్. అణే

తమ వృత్తులకు సంబంధించి వారిద్దరూ తమ మౌలిక భావాలను నిశ్చలంగా విజయవంతంగా ఆచరణలో పెట్టగలిగారని పేర్కొనవచ్చు.

-సి పి రామస్వామి అయ్యరు

వారిద్దరూ ఒకటిగా జన్మించారు ఒకే రకంగా జీవితంలో ఉన్నతులయ్యారు సమకాలిక భారతంలో వివిధ రంగాలలో వారు తమ అకుంఠిత శక్తి వల్లనూ, నిర్మలమైన శీలం వల్లనూ విశేషఖ్యాతి గడించారు.

-కె యం మున్షి

తిరుపతి శ్రీ వేంకటేశ్వరుని భక్తులు వారిద్దరూను

-కె ఏ నీలకంఠశాస్త్రి

కవల పిల్లలైన వారిద్దరిలోనూ ఎన్నో విశిష్ట సామాన్య లక్షణాలున్నాయి.

-జీవరాజ్ మెహతా

వారిద్దరూ భారతదేశంలోనే కాదు, ప్రపంచమంతట గౌరవించబడుతున్నారు.

-నీలం సంజీవరెడ్డి

వారు అపూర్వ సహోదరులు. వారి సేవలు, విజయాలు గణనీయమైనవి.

-కె. సంతానం

భారతదేశంలో ఈ శతాబ్దికి చెందిన ప్రముఖులలో వారు విశిష్టులు. వివిధ రంగాలలో వారు చేసిన సేవల వల్ల జాతీయ విఖ్యాతి గడించగలిగారు.

-కె.యల్. రావు

వారిద్దరూ ప్రపంచ మహాపురుషులచే ప్రశంసితులు. తమిళ దిఙ్మండలంలో ప్రతిభాసించే రెండు నక్షత్రాలు.

-టి.పి. మీనాక్షిసుందరమ్

అఖిలభారత స్థాయిలో వారిలా విఖ్యాతులైన సోదరులెవరూ నాకు స్ఫురణకు రావడం లేదు. అది ఒక విశిష్టమైన రికార్డు. వారికి రామలక్ష్మణులని పేర్లు పెట్టడం సమంజసం.

-బి. గోపాలరెడ్డి

అతి నిరాడంబరత, ప్రగాఢ భక్తిభావం, భారతీయ సంస్కృతిపై అకుంఠిత విశ్వాసం - ఈ సోదరులలో కానవచ్చే విశిష్ట లక్షణాలు

-పి. చంద్రారెడ్డి

లక్ష్మణస్వామి మొదలియారు కేవలం తన ప్రతిభవల్లనే ఉన్నతి గడించినవాడు. అంతేకాని యితరుల అభిమానం వల్లనో, అదృష్టం వల్లనో, ఈ రెంటినీ మించి శక్తిమంతమైన కుట్రలవల్లనో ఆయన పైకి రాలేదు. ఆయన సౌశీల్యం, చక్కని పద్ధతులు యువతకు ఆదర్శాలు. ఆయన ప్రశాంతుడై కనిపించినా, అభిప్రాయ ప్రకటనలో స్వతంత్రుడు; స్థిరచిత్తుడు.

-సి.ఆర్. రెడ్డి

వారి నిరుపమాన జీవితాలు సమాంతర రేఖలలో పయనించాయి భారత దేశపు సాంస్కృతిక చరిత్రలోనే గాక ప్రపంచ చరిత్రలో కూడా ఇది ఒక అపూర్వ దృశ్యం కవలలు సమానులుగా జన్మించాలని లేదు

**-వి కె. గోకాక్**

ఆర్కాటు సోదరులు ఎన్నో విషయాలలో అద్వితీయులు.

**-సి ఆర్. పట్టాభిరామన్**

సోదరులిద్దరూ దేశానికెంతో సేవ చేశారు; ఇప్పుడూ చేస్తున్నారు

**-పి. వెంకటరమణరావు**

ఈ సోదరుల జీవితోదంతం ప్రపంచ అద్భుతాలలో ఒకటి.

**-యస్. ముత్తులక్ష్మి రెడ్డి**

వారిద్దరూ గొప్ప వక్తలు. శాసనసభలలో బర్కో-నియన్ పద్ధతి పార్లమెంటరీ విధానం తు.చ. తప్పకుండ అవలంబించిన వారు, ప్రజల ప్రశంసకు పాత్రులైన వారు.

**-డి. జగన్నాథరెడ్డి**

ఒక సోదరుడు ప్రసిద్ద ఆర్థిక శాస్త్రవేత్త. ప్రపంచానికే ఆహారం సరఫరా చేసే బాధ్యత వహించాడు. ప్రాచీనులు ఏ శాస్త్రమైతే భగవద్దత్తమనీ పవిత్రమైనదనీ భావించారో ఆ శాస్త్రానికి అంకితమైన వాడు మరో సోదరుడు.

**-ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం**

విస్తృతంగా ప్రపంచ పర్యటన కావించినా, వారు మన సంస్కృతికే అంకితమైనవారు. వారి జీవనవిధానాలు పాశ్చాత్యం కాలేదు; తమ విధానాలు మార్చుకోలేదు.

**-యం. అనంతశయనం అయ్యంగారు**

ఆర్థికాభివృద్ధికీ, విద్యాభివృద్ధికి వారుచేసిన సేవ మహత్తరమయింది.

**-యం.యస్. స్వామినాథన్**

వారిద్దరూ తమ రంగాలలో ఆశ్చర్యంగొలిపే ఉన్నతి సాధించారు. విమర్శనాదృష్టి గల పరిశీలకులూ, స్నేహశీలురైన అభిమానులూ వారిని ప్రశంసించారు.

-ఆర్.ఆర్. దివాకర్

ఆ సోదరులిద్దరూ పాత తరానికి చెందినవారు ఆంగ్లం క్షుణ్ణంగా నేర్చినవారు. సంప్రదాయప్రియులు. తోడివారికి సేవచెయ్యాలన్న అభిలాష కలవారు. తాము గ్రహించిన దానికంటె జాతికి ఎక్కువగానే యిచ్చారు.

-యం.కె వెంకటరామ అయ్యరు

భారతదేశం ఈ అపూర్వ సోదరుల్ని చూసి గర్విస్తున్నది.

-బి.డి. జత్తి

మన దేశంలో అలాంటి సోదరులు జన్మించడం మనం చేసుకున్న అదృష్టం.

-డి.యస్. కొఠారి

భారతదేశానికి చెందిన యీ సోదరులు తమ పేరుపెంపుల్ని అదృష్టానికి ఒప్పగించలేదు.

-లండన్ విశ్వవిద్యాలయం

ఆ సోదరులు అనురూపులనీ, సుశ్లోకులనీ, భారతదేశంలో ముఖ్య విశ్వవిద్యాలయాలకు అధిపతులనీ మాకు తెలుసు.

-డర్హాం విశ్వవిద్యాలయం

వారిద్దరూ సంస్థల వంటివారు. గర్వించదగిన వ్యక్తులు.

-కె.యం. కరియప్ప

బుద్ధి వైశద్యానికి, హృదయ గాంభీర్యానికి వారు సజీవోదాహరణలు.

-కె.యస్. రామస్వామిశాస్త్రి

డా॥ రామస్వామి మొదలియారుకీ, డా॥ లక్ష్మణస్వామి మొదలియారుకీ అభినందనలు పంపడానికి మెక్‌గిల్ విశ్వవిద్యాలయం ఆనందిస్తున్నది.

-హెచ్. రాబర్ట్‌సన్

భావప్రకటనా పటిమ, ఆంగ్లభాషమీద అమోఘమైన అధికారం, శ్రోతల్ని తన్మయుల్నిచేసే నైపుణి-మొదలైన శక్తులు డా లక్ష్మణస్వామి మొదలియారుకి ఉన్నాయి వివిధ రంగాలలో పేరు గడించడానికి ఆయనకవి ఉపకరించాయి.

-జీవరాజ్ మెహతా

డా లక్ష్మణస్వామి మొదలియారు అభిప్రాయాలు ఖచ్చితమైనవి; దృఢమైనవి. అవి లోకజ్ఞాన సహితములు.

-సి.పి. రామస్వామి అయ్యరు

విద్యాసంస్థల విద్యావిషయక స్వాతంత్ర్యాన్ని సంరక్షించడంలో డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియారు నిర్భయంగా వ్యవహరించారు.

-అమర్‌నాథ్ ఝూ

లక్ష్మణస్వామి మొదలియారుది బహుముఖీనమైన ప్రతిభ.

-జాకిర్ హుసేన్

మా అధ్యక్షులైన సర్ రామస్వామి మొదలియారు బహు సమర్థులు, సుజనులు. నలుగురినీ ఆకట్టుకునే స్వభావం గలవారు. పొడగరి. దృఢగాత్రుడు. కృష్ణవర్ణుడు. మనోహరాకృతి గలవాడు. ఫాలభాగాన శ్రీ చూర్ణం. ఉత్తమ పార్లమెంటేరియను (వాద చతురుడు) భేదాలున్నప్పటికీ, చర్చలలో కాఠిన్యం తలెత్తినప్పటికీ యాభై దేశాలవారిని ఎలా ప్రవర్తింపజేయాలో ఆయనకి తెలుసు.

-వర్జీనియా గిల్డర్ స్లీవ్

-

అంతర్జాతీయ ఖ్యాతిగన్న ప్రముఖులు కొద్దిమంది సమావేశమైన యీ సభకు అధ్యక్షత వహించిన సర్ రామస్వామి మొదలియారు తన హోదావల్లనూ ప్రజ్ఞా పాటవాల వల్లనూ అందరినీ అధిగమించారు. ఆయనది విద్యుత్తులాంటి మేధ; ఉక్కులాంటి శక్తి; బంగారంలాంటి మనస్సు. అలాంటి సమావేశాలకు నేను

కొత్తకావడంవల్లనేమో ఆయన ప్రభావానికి లోనయ్యాను. కాని ఫాలభాగాన ఆ శ్రీ చూర్ణం, శరవేగంతో తీర్మానాలు చర్చించే ఆ ధోరణి చూస్తే, ప్రాచ్య కథలలోని మాంత్రికుడు స్ఫురణకు వచ్చాడు ........ ..ఆయనపట్ల నాకు అవధిలేని గౌరవభావం కలిగింది. వ్యక్తిగా అంతర్జాతీయ ఉద్యోగిగా ఆయ నంటే నాకు గౌరవం కలిగింది. 1950లో ఆయన ఆర్థిక సామాజికసంఘంలో తిరిగి పాల్గొనడాన్ని నేను విస్మరించలేను.

-హెర్మన్ శాన్ట్రక్జ్

డా సర్ ఏ. రామస్వామి మొదలియారు సర్వమానవులలో అగ్ర రాజనీతిజ్ఞుడు. ఆయన అసీతి సంవత్సరాలలో చివరి నలభై యేళ్ళు, అందులోనూ చివరి పాతికేళ్ళు చరిత్రపుటలలో గణనీయమైనవి. దూరదృష్టి, నిజాయితీ, సాహసం మొదలైనవాటిని పురస్కరించుకుని ఆయన ప్రపంచపౌరులకు సేవ చేశారు .. ..శాన్‌ఫ్రాన్సిస్కో మహాసభలో డాక్టర్ రామస్వామి నిర్వహిం చిన పాత్ర వల్లనే ఐక్యరాజ్యసమితి తాలూకు ఆర్థిక, సాంఘిక మండలికి ఆయన సహజంగా తప్పనిసరిగా మొదటి అధ్యక్షుడు కాగలిగారు. ఆయన అధ్యక్షుడుగా ఉన్న కాలంలో ప్రతిభాశాలురైన పాల్ మార్టిన్ (కెనడా), పియర్‌మెన్డెస్ (ఫ్రాన్సు), వాల్టర్‌నాష్ (న్యూజిలాండు), ఫిలిప్‌నోయెల్ బేకర్ (బ్రిటన్), క్లైఫెన్స్ (నెదర్‌లాండ్స్), జాన్‌వినన్ట్ (అమెరికా సంయుక్తరాష్ట్రాలు) ప్రభృతులు సహచరులు. ఆ మండలి విశ్వజనుల ఆర్థిక సాంఘిక మండలిగా రూపుదాలు స్తుందని స్ఫురించింది.

ఇరవై యేళ్ళకు ముందు కవలపిల్లలైన ఆ సోదరులు అంతర్జాతీయసేవలో నిమగ్నులై ఉన్నప్పుడు జెనీవాలోగాని, మదరాసులోగాని నలుగురికీ వారిరువురూ సుపరిచిత వ్యక్తులు. ఇతరులవలె నేను కూడా వారిద్దరినీ పోల్చుకోడంలో ఇబ్బందిపడ్డాను. నేను డాక్టర్ రామస్వామిని గురించి మాత్రమే వ్రాయడానికి కారణం నాకు డాక్టర్ లక్ష్మణస్వామితో వ్యక్తిగతంగా పరిచయం తక్కువ కావడమే.

-విల్ఫ్రెడ్ జెన్క్స్

బహు రంగాలలో వారు చేసిన నిస్వార్థ సేవకూ దీక్షానిరతికీ గుర్తింపుగా డాక్టర్ సర్ ఏ. రామస్వామి మొదలియారూ, పద్మవిభూషణ్ డాక్టర్ సర్ ఏ. లక్ష్మణస్వామి మొదలియారూ విద్యావిషయకమైన, ప్రభుత్వపరమైన విశిష్ట గౌరవాలు పొందారు. విద్యాభివృద్ధికిగాను వారు చేసిన సేవ బహు విశిష్టమైనది. భారతదేశపు విభిన్న ప్రాంతాలలోను వారి పేర్లు సర్వసాధారణంగా వినవస్తాయి. ఇది ఒక గొప్ప సాధన.

-సూరజ్ ఖాన్

వారిద్దరూ యాభై యేళ్ళుగా ప్రభుత్వ కార్యకలాపాలలో,వాణిజ్య పరిశ్రమ రంగాలలో, శాసనసభలలో, విద్యారంగంలో, ప్రజాసంక్షేమ కార్యాలలో విశిష్టమైన పాత్ర నిర్వహించారు. వారు చేపట్టిన ప్రతి రంగానికి నిరుపమానమైన సేవ చేశారు.

-ఎ.సి. జోషి

మనదేశంలో ప్రజహిత కార్యకలాపాలకు చెందిన వివిధ రంగాలలోను వారిది ఉత్సాహంగొలిపే ఉజ్జ్వలమైన ఉదాహరణ.

- హెచ్. వి. పటాస్కర్

డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలియారులో వృత్తిపరంగా అత్యున్నతమైన సామర్థ్యాన్ని, విశాలమైన దృక్పథాన్ని, లోకజ్ఞానాన్ని, దర్శించవచ్చు. మదరాసు విశ్వవిద్యాలయంలో ఉన్నత ప్రమాణాలు పరిరక్షింపబడడానికి కారణం చాలా వరకు ఆయన, ఆయన ప్రభావం అని పేర్కొనవచ్చు.

- పి. వి. రాజమన్నార్

డాక్టర్ ఏ.రామస్వామి మొదలియారుకిగల బుద్ధికుశలత,అపార పాండిత్యం మన సమాజంలోని బలహీన వర్గాలవారిపట్ల అభిమానం, అన్ని పరిస్థితులలోనూ వారికి అండగా ఉండాలనే తీవ్రాకాంక్ష మొదలైన వాటివల్ల ఆయనంటే నాకు ఆదరాభిమానాలు. అవి నాలో గతనాలుగు దశాబ్దుల కాలంలోనూ అధికమైనాయి.

మదరాసు విశ్వవిద్యాలయం, భారతదేశంలో వైద్య విద్య, ప్రపంచ ఆరోగ్యసంస్థ (డబ్ల్యు. హెచ్ ఒ), యునెస్కో - వీటి చరిత్రలు డా॥ ఏ. యల్. మొదలియారు చరిత్రతో ముడివడివున్నాయి

పారిశ్రామిక రంగంలో మనదేశం సాధించిన ప్రగతికి, విశ్వవిద్యాలయ విద్యారంగంలో మదరాసు విశ్వవిద్యాలయం సాధించిన అభివృద్ధికీ విజయోపేతులైన యీ కవలల నాయకత్వం కారణ మనవచ్చు

- యస్. డి. సుందరవడివేలు

సర్ రామస్వామికి నేను సన్నిహితుణ్ణి అయ్యాను. అచిరకాలంలోనే ఆయన సచ్ఛీలం, లోతైన అభిప్రాయాలు, ఆర్థిక వ్యాపార భావాలు, దూరదృష్టి మొదలైనవి నాకు అవగతములైనాయి. సంభాషణా చతురుడైన ఆయన నిష్పాక్షికత తెలియవచ్చింది. వీటన్నికంటె అతి ముఖ్యమయింది ఆయన నిజాయితీ. ఆయనతో సంబంధం పెట్టుకోవడం సంతోషదాయకమే కాక గొప్ప అనుభవం కూడా. వ్యాపారసంబంధి అయిన మా అనుబంధం నిజమైన స్థిరమైన స్నేహంగా పరిణమించడంలో ఆశ్చర్యంలేదు.

ఒకదేశానికి చెందిన ఒకే వ్యక్తిలో ఇన్ని విశిష్ట గుణాలు నెలకొని వుండడం అపూర్వమే. ఈ గుణసంపద ఆదరాభిమానాలకు పాత్రమవుతుంది. ఇతర త్రాకంటె మాదేశంలో ఇవి మరింత ఆదరాన్ని చూరగొంటాయి. ఇందుకు రెండు ఉదాహరణలు - ఇక్కడ - అంటే యు. కె. లో - యుద్ధకాలపు మంత్రివర్గంలో ఆయన ఒక సభ్యుడు. ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయం ఆయన్ని గౌరవ డాక్టర్ ఆఫ్ సివిల్ లా (డి సి యల్) డిగ్రీతో గౌరవించింది.

- ఇవాన్ స్టెడ్‌ఫోర్డ్

డైరెక్టర్లమండలి ఆజ్ఞానుసారం, ది కార్పొరండం కంపెనీ (న్యూయార్క్) డాక్టర్ సర్ ఏ. రామస్వామి మొదలియారుకి ఆయన ఎనభై ఒకటవ జన్మదినం సందర్భంగా అభినందనలు తెలియజేస్తున్నది.

-విలియం హెచ్. వెన్గెల్

ఇండియాలో ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ అభివృద్ధి చరిత్రలో సర్ రామస్వామి మొదలియారుకి ఒక విశిష్టమైన స్థానమున్నది ..ఇండియాలో మా కంపెనీల స్వల్ప ప్రారంభాల నుంచి యీ నాటి ఉన్నతదశవరకూ గల అభివృద్ధి ఆయన ఆధ్వర్యంలో సాధించబడింది. వివేకవంతమైన ఆయనపర్యవేక్షణకీ,రాజనీతిజ్ఞతతో కూడిన ఆయన నాయకత్వానికీ మేము ఋణపడి వున్నాము. ఆయన నాయకత్వం వల్ల మా కంపెనీలకు లాభం కలగడమే కాక ఉద్యోగులకూ లాభం కలిగింది. ఆయన పరిచయం మాకు ప్రోత్సాహక శక్తి.

-ప్లవ్‌వెన్ ప్రభువు

ప్రాచ్య పాశ్చాత్యదేశాలవారి మనోభావాలు ఆలోచనలు గురించి డాక్టర్ సర్ ఏ. రామస్వామి మొదలియారుకి సరిఅయిన అవగాహన ఉంది. పైగా చరిత్రలో అపార పాండిత్యముంది. వివిధ దేశాలకు ప్రజలకు వాణిజ్యరంగానికి ఆయన ఎంతో సేవ చేశారు. అలా చేసేటప్పుడు తన మాతృదేశానికి ఏది సర్వోత్కృష్టమైనదో దానిని ఆయన విస్మరించలేదు.

-జె. ఏ. విలియంసన్

బ్యాంకులో (**International Bank for Reconsruction & Development**) ఇండియాని గురించి పనిచేస్తున్న మాకు మొదలియారు (రామస్వామి మొదలియారు) పేరు సుపరిచితం. ఆ పేరుని మేమెంతో గౌరవిస్తాము కూడా. బ్యాంకు ప్రారంభించబడినప్పటినుంచీ **IC ICI** తో సన్నిహిత సంబంధం ఉంది. ఆ **IC ICI** బోర్డులో డాక్టర్ రామస్వామిమొదలియారు సభ్యులని మాకు తెలుసు.

-అలెగ్జాండర్ యఫ్. కిర్క్

అవధిలేని ఆయన క్షమాగుణం, వాదచతురత - వీటిని మించినవి సర్ రామస్వామి మొదలియారుకి గల వివేకం, నిష్పాక్షికత, స్థైర్యం మొదలైనవి వ్యక్తిగతమైన ఆయన గుణగణాలు ఆదరాభిమానాలకు పాత్రములవుతాయి.

-డి. స్టైన్‌బవర్

భారతదేశపు ఉత్తమ పుత్రుడు, విఖ్యాత ప్రపంచ పౌరుడు, ఐక్యరాజ్య సమితి ముఖ్య నిర్మాతలలో ప్రముఖుడు అయిన డాక్టర్ సర్ ఏ. రామస్వామి

మొదలియారుకి ఆయన 81-వ జన్మదినం సందర్భంగా అభినందనలు తెలపడం సంతోషకారణం.

ఐక్యరాజ్య సమితిలో ఆయనతో పరిచయమున్న వారికందరికీ ఆయన ఒక ఉత్సాహ కారణం పైగా, శాంతియుత సహకారంకోసం, విస్తృత స్వాతంత్ర్య పరిధిలో సుఖావహమైన జీవితంకోసం ఆర్రులు చాస్తూ సమితివైపు దృష్టులు సారించే అసంఖ్యాకులైన ప్రజల ఆదరాభిమానాలకు ఆయన అర్హుడు.

-వాల్టర్ కోష్‌నిగ్

సాధారణంగా కవలపిల్లలు వివిధ రంగాలలో తమ దేశానికే కాక యావ త్ప్రపంచానికే విశిష్టమైన సేవచేసిన ఘట్టాలు చరిత్రలో చాలా తక్కువగా ఉండవచ్చు.

-డేవిడ్ ఏ. మోర్స్

ఆయన (రామస్వామి మొదలియారు) ప్రతిభా సంపన్నుడైన ప్రముఖ వక్త. ఆయన ఉపన్యాసాలు స్పష్టతకు, పదగుంపనకు పెట్టిందిపేరు. ఆయనకి (ఇంగ్లీషు) భాషమీద మంచి అధికారం ఉంది. విమర్శించాలనుకుంటే, యిక అంతే రాజకీయవాదిగా, పరిపాలనాదక్షునిగా, రాజనీతిజ్ఞునిగా - ఆయన వివిధ రంగాలలో మంచి పేరు గడించారు. రాజ్యసభలో ఆయన ఉపన్యాసాలు వినడం మేధకు విందు సమకూరినట్లే. యునెస్కో కార్యనిర్వాహకవర్గాధ్యక్షునిగా ఆయన అంతర్జాతీయ విఖ్యాతి గడించారు.

-బాంబే క్రానికల్

కవలపిల్లలైన ఆ సోదరులు తమ తమ రంగాలలో చరిత్ర సృష్టించారు.

-వి జి. హార్నిమన్

ఆకృతి, కంఠం, భాష, ఉచ్చారణ-అన్నీ ఒకేలా ఉండేవి. కాని ఒక భేదం లేకపోలేదు వారు నేర్చిన విభిన్న విషయాలలో వారు పొందిన వృత్తిపరమైన శిక్షణే ఆ భేదం. అగ్రజుడు తాను నమ్మిన విషయాలకోసం సమరం సలిపే వాడు. అప్పట్లో ఆయన ప్రధాన ప్రత్యర్థి స్వర్గీయ శ్రీ యస్. సత్యమూర్తి. తమ్ముడేమో బాధావహులైన మహిళల పక్షాన విజ్ఞప్తి పూర్వకంగా మాట్లాడేవాడు.

ఆయన తన జీవితాన్ని మహిళల సేవకే వినియోగించారు. అగ్రజుడు ఒక నిర్దిష్ట రాజకీయ లక్ష్యం ఆశించి న్యాయవాదివలె వాదించేవాడు; తమ్ముడు చేసేది ధర్మోపదేశంలా ఉండేది; దానికి మానవతా దృక్పథం నేపథ్యం.

-యం జి నాయుడు

డా॥ సర్. ఏ. యల్. మొదలియారు ఆమోదకరమైన సభాధ్యక్షుడు, మాట్లాడేందుకు ఆయన అందరికీ అవకాశం ఇచ్చేవాడు నిష్పాక్షికంగా సభా వ్యవహారాలు సమీక్షించేవాడు. విద్యాసంస్థల విద్యావిషయిక స్వేచ్ఛను సంరక్షించడానికి ఆయన దీక్ష వహించారు. ఆయన మదరాసు విశ్వవిద్యాలయ విషయంలో ప్రదర్శించిన పరిపాలనాదక్షతను కనక పరిశీలిస్తే, విద్వాంసుడు కూడా ప్రముఖ పరిపాలనాదక్షుడు కావచ్చుననే అంశం అవగతమవుతుంది.

-అమరనాథ్ ఝా

జాతీయ స్థాయినిగాని, అంతర్జాతీయస్థాయినిగాని పెక్కు దశాబ్దులుగా మానవసంక్షేమానికి సంబంధించిన వివిధ రంగాలలో నిర్మాణాత్మక పాత్ర నిర్వహించే అవకాశం కొద్దిమందికి మాత్రమే లభిస్తుంది. భారతమాత తన ప్రముఖ సంతానమైన డాక్టర్ ఏ లక్ష్మణస్వామి మొదలియారుని చూసి సహేతుకంగా గర్వించవచ్చు.

-బి. సెన్‌గుప్త

అన్నిటికంటె ముఖ్యంగా, సర్ రామస్వామి మొదలియారు జన్మతః వక్త, లోకజ్ఞానం గల పరిపాలనాదక్షుడు, అనుభవజ్ఞుడైన పారిశ్రామికవేత్త

(మదరాసులో 1966 లో నిర్వహించబడిన ఒక సభలో)

ఇద్దరు ఉత్తమ పురుషులతో మానవజాతిని సుసంపన్నం చేసిన ఆ తండ్రికి మన దేశమే కాదు, ప్రపంచమే కృతజ్ఞత తెలియజేయవలసివుంది

-యం వి. అరుణాచలం

అనుబంధం-1

# డాక్టర్ రామస్వామి మొదలియారు జీవితంలో కొన్ని ముఖ్య సంఘటనలు

1887 అక్టోబరు 14 న కర్నూలులో జననం; జననీ జనకులు శ్రీమతి సిద్దమ్మ, శ్రీ ఆర్కాటు కుప్పుస్వామి మొదలియారు.

1902 మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థత.

1903 మదరాసు క్రైస్తవ కళాశాలలో ఉన్నత విద్యాభ్యాసం (యఫ్.ఏ., బి. ఏ.); తెలుగు రెండవ భాష.

1907 మదరాసు న్యాయ కళాశాలలో బి. యల్. చదువు.

1911 మదరాసు ఉన్నత న్యాయస్థానంలో వకీలుగా చేరడం.

1916 రాజకీయ రంగ ప్రవేశం; సర్ పిట్టి త్యాగరాయ శెట్టి ప్రభృతులతో పరిచయం.

1917 జస్టిస్ పార్టీలో ప్రవేశం.

1917 జస్టిస్‌పార్టీ ప్రతినిధిగా లండన్ వెళ్ళడం; ఇంగ్లండుకి ఆయన మొదటి ప్రయాణం ఇదే.

1920 మదరాసు శాసనసభా సభ్యత్వం; ముఖ్యమంత్రి పానగల్లు రాజావారి పార్లమెంటరీ సెక్రటరీగా నియామకం.

1923 మదరాసు శాసనసభా సభ్యత్వం (రెండవసారి).

1932 తిరుమల తిరుపతి దేవస్థానం చట్టం అమలుకి కృషి.

1927
1935 'జస్టిస్' పత్రికా సంపాదకత్వం, వ్యంగ్యచిత్రాలు ప్రవేశ పెట్టిన ఘనత.

1928
1930 మదరాసు పురపాలక సంఘాధ్యక్ష పదవి (రెండుసార్లు).

1930 భారత శాసనసభా సభ్యత్వం.

1931 రౌండు టేబిల్ సమావేశంలో పాల్గొనడం

1931
1934 కేంద్ర శాసనసభా సభ్యత్వం; మంచి వక్తగా పేరు సంపాదించడం

1933 టొరాంటోలో జరిగిన బ్రిటిష్ కామన్వెల్తు సంబంధాల మహాసభకు భారత ప్రతినిధివర్గానికి నాయకత్వం.

1936 లండనులోని ఇండియా కౌన్సిలులో సభ్యత్వం.

1937 నైట్‌హుడ్ బిరుదు ప్రదానం (సర్)

1937-1939 సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియాకి సలహాదారుగా నియామకం.

1939 వైస్రాయి కార్యనిర్వాహకవర్గంలో సభ్యత్వం (వాణిజ్య మంత్రి).

1946 కొంతకాలం ఏ శాఖా లేదు, కొంత కాలం సప్లై, ప్లానింగ్, డెవలప్ మెంటు శాఖల నిర్వహణ)

1941 చర్చిలు యుద్ధకాలపు మంత్రివర్గంలో సభ్యత్వం : (ఈ విశిష్ట గౌరవం పొందిన తొలి భారతీయుడు).

1945 శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజ్య సమితి సమావేశానికి హాజరయిన భారత ప్రతినిధి వర్గానికి నాయకత్వం.

1946 ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం డి.సి.యల్. గౌరవ డిగ్రీ ప్రదానం.

1946 యు కె; యు.యస్.ఏ.లకు వెళ్ళిన భారతీయ ఆహార ప్రతినిధి వర్గానికి నాయకత్వం.

1946-1947 యు. యన్. తాలూకు ఆర్థిక సాంఘిక మండలికి అధ్యక్షునిగా ఎన్నిక.

1946-1949 మైసూరు దివానుగిరీ-'రాజమంత్ర చింతామణి' బిరుదు ప్రదానం.

1948 ఐక్యరాజ్యాల సముద్ర వాణిజ్య మహాసభకు హాజరయిన ఇండియా ప్రతినిధి వర్గానికి నాయకత్వం.

1948 భద్రతా సమితిలో హైదరాబాదుపై జరిగిన పోలీసు చర్యను సమర్థిస్తూ ప్రసంగం.

1951-1959 తిరువాంకూరు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవి.

1952-1962 రాజ్యసభలో సభ్యత్వం.

19F3 దర్హం విశ్వవిద్యాలయం డి. సి యల్. గౌరవడిగ్రీ ప్రదానం

1957 మదరాసు విశ్వవిద్యాలయం డాక్టర్ ఆఫ్ లాస్ గౌరవ డిగ్రీ ప్రదానం.

1961 భారత జాతీయ ఆవిరి ఓడల యజమానుల సంఘాధ్యక్ష పదవి

1968 మదరాసులో సి.యన్.అణ్ణాదురై నిలువెత్తు శిలా విగ్రహావిష్కరణ.

1976 జూలై 17 న కాలధర్మం.

## అనుబంధం-2

# డాక్టర్ లక్ష్మణస్వామి మొదలియారు జీవితంలో కొన్ని ముఖ్య సంఘటనలు

| | |
|---|---|
| 1887 | అక్టోబరు 14 న కర్నూలులో జననం; జననీ జనకులు శ్రీమతి సిద్ధమ్మ, శ్రీ ఆర్కాటు కుప్పుస్వామి మొదలియారు. |
| 1902 | మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థత |
| 1903 | మదరాసు క్రైస్తవ కళాశాలలో ఉన్నత విద్యాభ్యాసం (యఫ్ ఏ.); తెలుగు రెండవభాష |
| 1905 | మదరాసు వైద్య కళాశాలలో వైద్యశాస్త్రాభ్యాసం. |
| 1909 | మదరాసు ప్రభుత్వ వైద్యశాఖలో ప్రవేశం. |
| 1914 | మదరాసు విశ్వవిద్యాలయం వారి బి.ఏ. పట్టం పొందడం. |
| 1916 | శ్రీమతి రాధాబాయితో వివాహం. |
| 1922 | ఎమ్.డి. పట్టం పొందడం |
| 1923 | పట్టభద్రుల నియోజకవర్గం నుంచి మదరాసు విశ్వవిద్యాలయ సెనేట్‌కి ఎన్నిక కావడం |
| 1925 | సిండికేటు సభ్యత్వం. (1925 నుంచి 1942 దాకా సభ్యులు) |
| 1928-29 | తొలి విదేశపర్యటన - వైద్యవిద్యా కేంద్రాల సందర్శన. |
| 1930 | ప్రసూతి శాస్త్రజ్ఞుల, స్త్రీల వ్యాధుల, విజ్ఞాన శాస్త్రజ్ఞుల రాయల్ కాలేజీ విశిష్ట సభ్యునిగా ఎన్నిక (ఈ విశిష్ట గౌరవం పొందిన ఇద్దరు భారతీయులలో మొదలియారు ఒకరు) |
| 1936 | మదరాసులో అఖిల భారత ప్రసూతి శాస్త్రజ్ఞుల, స్త్రీల వ్యాధుల శాస్త్రజ్ఞుల మహాసభా నిర్వహణ (భారతదేశంలో ఇలాంటిది జరగడం ఇదే మొదటిసారి |
| 1938 | ప్రసూతి శాస్త్ర చికిత్స (**Clinical obstetrics**) గ్రంథప్రచురణ |
| 1938-41 | పచ్చయప్ప ట్రస్టుబోర్డు అధ్యక్షుడు |

| | |
|---|---|
| 1939 | మదరాసు వైద్యకళాశాలకు ప్రిన్సిపాలుగా నియామకం; ప్రభుత్వ స్త్రీల ఆసుపత్రికి ప్రధానాధికారిగా నియామకం (ఈ ఉన్నత పదవులు అలంకరించిన తొలి భారతీయుడు) |
| 1942 | దివాన్ బహద్దూర్ బిరుద ప్రదానం. |
| 1945 | సర్ బిరుద ప్రదానం |
| 1946 | మదరాసు శాసన మండలి సభ్యునిగా నియామకం. |
| 1947 | షష్ట్యబ్దిపూర్తి - నిలువెత్తు కాంస్య విగ్రహ ఆవిష్కరణ. |
| 1948 | ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ వారి డి. సి. యల్. గౌరవ డిగ్రీ బహూకరణ - ప్రపంచ ఆరోగ్య సంస్థ (WHO) మహాసభకు హాజరైన భారతీయ ప్రతినిధివర్గానికి ఉపనాయకుడు - డా. రాధాకృష్ణన్ కమిషనులో సభ్యత్వం. |
| 1949-50 | WHO కార్యనిర్వాహకవర్గ అధ్యక్షపదవి. |
| 1950 | యునెస్కోకి హాజరైన భారతీయ ప్రతినిధివర్గానికి ఉపనాయకుని పదవి |
| 1950-56 | యునెస్కో కార్యనిర్వాహకవర్గ సభ్యత్వం. |
| 1953 | మదరాసు శాసన మండలిలో ప్రతిపక్షానికి నాయకత్వం |
| 1954 | పద్మభూషణ బిరుదు ప్రదానం. |
| 1956-62 | విశ్వవిద్యాలయ విరాళాల సంఘం (యు. జి. సి.) సభ్యత్వం. |
| 1957 | మదరాసు విశ్వవిద్యాలయ శతవార్షికోత్సవం - సప్తతి జన్మదినోత్సవ సందర్భంగా **Collected Speeches of Dr A.L. Mudaliar** పుస్తక బహూకరణ. |
| 1959 | భారతీయ విజ్ఞానశాస్త్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవి-రెండవ ప్రపంచ వైద్య విద్యా మహాసభల ఉపాధ్యక్షుడు. |
| 1959-61 | హెల్త్ సర్వే అండ్ ప్లానింగ్ కమిటీ అధ్యక్షపదవి. |
| 1961 | ప్రపంచ ఆరోగ్య సంస్థ అధ్యక్ష పదవి. |
| 1962 | లండన్ విశ్వవిద్యాలయం వారి యల్. యల్. డి గౌరవ డిగ్రీ ప్రదానం |
| 1963 | పద్మవిభూషణ బిరుద ప్రదానం |
| 1966 | ఎడిన్‌బరోలోని రాయల్ కాలేజ్ ఆఫ్ ఫిజీషియన్స్ విశిష్ట సభ్యత్వం. |
| 1967 | విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవి రజతోత్సవం. |
| 1974 | ఏప్రిల్ 15 న కాలధర్మం. |

## అనుబంధం-3

# లక్ష్మణస్వామి మొదలియారు గారి పసిడి పలుకులు

కొత్త పరిస్థితులు కొత్త దృక్పథానికి దారి తీస్తాయి; కొత్త పురోగమనానికి గల అవసరాన్ని కూడా సూచిస్తాయి.

*        *        *

భావ ప్రకటన చేసినంత మాత్రాన లాభం లేదు. ఊరికే విమర్శించీ లాభం లేదు. నిందోక్తుల వల్లనూ లాభంలేదు. లక్ష్యసాధనకు ఆచరణసాధ్యమైన విధానాలు అవలంబించాలి.

*        *        *

విద్యావంతులలో నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాల్చింది. ఈ సమస్య తీవ్ర స్వభావాన్ని గాని, దీనివల్ల కలగబోయే దుష్ఫలితాలను గాని ప్రభుత్వము సమాజము నిర్లక్ష్యం చెయ్యడానికి వీలు లేదు.

*        *        *

ప్రభుత్వోద్యోగమే ప్రధానాకర్షణగా ఈ దేశంలో బహుకాలంగా వ్యాప్తిలో ఉంది.

*        *        *

సహన శాంతాలు అపూర్వ గుణాలుగా పర్యవసిస్తూ వివిధ దృక్పథాల నుంచి భావ స్వాతంత్ర్యానికి ప్రతిఘటన లభిస్తూవున్న యీ ప్రపంచంలో తాత్కాలిక ప్రయోజనాల ఆకర్షణకు అతీతంగా సత్యాన్ని ఆరాధించేవారి కందరికీ విశ్వవిద్యాలయాలు నిస్సందేహంగా ఆశ్రయం కావాలి.

*        *        *

స్వతంత్ర ఆలోచనా విధానాలకు ఆశ్రయం కల్పించడం, అవివేకులైన పెక్కుమందికి కాక, సవ్యంగా ఆలోచించే కొద్దిమందికి నీడ కల్పించడం తమ

ధర్మాలుగా విశ్వవిద్యాలయాలు గుర్తించాలి సత్యంకోసం సాగిన భీకర సమరాల స్మృతుల్ని అవి పదిలపరచాలి

* * *

వైద్యవృత్తి యింకా ఉత్తమ వృత్తులలో ఒకటి అనవచ్చు.

* * *

ప్రాథమిక సమస్యలైన నిరుద్యోగం, విద్యాపునర్నిర్మాణం - వీటిని ఒక దానితో మరొకటి కలపడం జరుగుతున్నది. ఒక సమస్యకు తగిన పరిష్కారం లభ్యమైనప్పుడు, మరో సమస్యను పరిష్కరించడం సుగమ మవుతుంది.

* * *

ఏకాకిగా ఏ మానవసంస్థా మనజాలదు. తనచుట్టూ నెలకొన్న నిజ జీవితాన్ని కనుక తృణీకరిస్తే, అచిరకాలంలోనే విశ్వవిద్యాలయం సంకుచితమై పోతుంది; నిర్జీవంగా తయారవుతుంది చివరకు పతనస్థితికి పాల్పడుతుంది. ఇది పక్రృతిధర్మం మానవులవలె, విశ్వవిద్యాలయాలు కూడా ప్రకృతిపాఠాలను త్రోసిరాజనకూడదు

* * *

ప్రతికూల వాతావరణాన్ని లెక్కచెయ్యకుండ విశ్వవిద్యాలయం తన పేరు పెంపుల్ని సంరక్షించుకోగలదని భావిద్దాము. అధ్యాపకులూ విద్యార్థులూ తమ ఉన్నత ప్రమాణాలను సంరక్షించుకున్నప్పుడు ప్రమాణ పరిరక్షణకు వీలవుతుంది.

* * *

న్యాయశాస్త్ర విద్యార్థులు అతిప్రాచీనమైన ఒక ఉత్తమ వృత్తికి చెందిన వారు. సర్వదేశాల యుగయుగాల సంప్రదాయాలకు వారు వారసులు.

* * *

ఇతర వృత్తులలో ఉన్నట్లే, న్యాయవాదవృత్తిలోనూ కొన్ని నీడలూ ఆకర్షణలూ ఉన్నాయి. న్యాయ నిర్వహణానికి కావలసిన ప్రధానాంశాలను- న్యాయవాదులు, న్యాయమూర్తులు - న్యాయవాదవృత్తి సమకూరుస్తున్నది. ఇదొక విశిష్టాంశం. ఒకరి బలమూ విజయమూ మరొకరిపై ఆధారపడి వున్నది.

* * *

న్యాయవాది తన కక్షిదారు సంక్షేమంకోసం ఎంతో శ్రద్ధ వహించవచ్చు కాని న్యాయవాది ధ్యేయం తాను చేపట్టిన కేసులో విజయం పొందడం ఒక్కటే కాదు. న్యాయ నిర్వహణ సక్రమంగా జరిగేందుకు అతను తోడ్పడాలి.

* * *

వైద్యశాస్త్ర పట్టభద్రులకు నా సలహా యేమిటంటే 'సంసిద్ధులై ఉండండి'

* * *

వైద్యవృత్తి అసూయగల భార్యవంటిది; విశ్వాసంలో ఏ మాత్రం లోపం కనిపించినా సహించదు.

* * *

వైద్యశాస్త్ర పట్టభద్రుడు కనక ప్రాపంచిక వస్తువుల్ని అభిలషించినా, సిరిసంపదలు వాంఛించినా, తుదిలేని సామాజిక సౌఖ్యాలు కోరినా, ఆ ఆకర్షణలు ఆశించినా - ఇప్పటికీ మించిపోయిందిలేదు - అతను మరో వృత్తిని అవలంబించవచ్చు.

* * *

అధ్యయనంవల్లనూ, సునిశిత పరిశీలనవల్లనూ నేర్పరియై వైద్యశాస్త్ర పట్టభద్రుడు సర్వకాలాలలోనూ సంసిద్ధుడై ఉండాలి. నీ జీవితంలో ఎప్పటికైనాసరే, సదవకాశం నిన్ను అన్వేషిస్తూ వస్తుంది. అప్పుడు కనక నీవు సంసిద్ధుడవై ఉండకపోతే, వచ్చిన అవకాశం నిన్ను నిస్పృహకు వదిలేస్తుంది; మరెప్పుడూ తిరిగిరాదు.

* * *

విజ్ఞానం ఒక్కటే చాలదు; జీవిత విజయానికి వివేకం అవసరం.

* * *

తనకంతా తెలుసునని విజ్ఞానం గర్వంతో మసులుతుంది. కాని వివేకం నమ్రత కలిగి తనకేమీ తెలియదనుకుంటుంది.

* * *

వివేకంతో సంచరించు. సత్యాన్ని నమ్రతతో సాధించడమనే గొప్పపాఠమే విశ్వవిద్యాలయం నీకు నేర్పగల గొప్ప పాఠం.

* * *

విజ్ఞాన పరిధిని విస్తృతపరుచుకోవాలనీ, విశాల దృక్పథాన్ని అవలంబించాలనీ సతతమూ ఆశించు.

* * *

ఒక భాషను నేర్చుకోవాలని ఆశించినప్పుడు దాన్ని క్షుణ్ణంగా నేర్చుకోవాలి

* * *

వయోజనవిద్య వయోజన అక్షరాస్యతకంటే విలక్షణమైనది అక్షరాస్యుణ్ణి విద్యావంతునిగా చెయ్యడం వయోజన నిరక్షరాస్యతకంటె విలక్షణమైనది

* * *

ఆటంబాంబు వంటి బాంబులు కొన్నిటిని కనుగొనడం చూసి విజ్ఞానశాస్త్రం వరమా లేక శాపమా అని కొందరు సందేహంలో పడ్డారు.

* * *

దేశాల కోశాగారాలే విశ్వవిద్యాలయాలు. వాటి కృషి, యోగ్యత చాలా వరకు శిష్టుల సానుభూతి, సహకారం, ఆదరభావం మొదలైన వాటిమీద ఆధారపడి ఉన్నాయి.

* * *

క్రీడాస్థలాలలోనో, పరీక్షలలోనో గెలుపొంది బహుమతులు సాధించిన విద్యార్థుల విజయసాధన చూసి నేను ఉప్పొంగి పోవడంలేదు. కాని మానవసేవయే లక్ష్యంగా కలిగి, సోదర మానవుల్ని అభిమానించే విద్యార్థుల పేర్లను కనుక మీరు సగర్వంగా చదివితే అప్పుడు అలాంటి విద్యార్థుల్ని మీరు తయారు చేశారని నేనూ మీతోపాటు ఆనందోత్సాహాలు చెందుతాను. అదే విశ్వవిద్యాలయ విద్యకు నిజమైన లక్ష్యం.

* * * *

కొన్ని పుస్తకాలను పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించి వాటిని విద్యార్థులమీద బలవంతంగా రుద్దడమనే దురదృష్టకరమైన విధానం ఇక్కడ బలపడడం వాంఛనీయంకాదు. ఎందుకంటే ఆ విధానంవల్ల యువకుల మనస్సుల్లో ఉన్నత భావాలు కలగడంలేదు.

* * * *

భారతదేశం లౌకిక రాజ్యం. అంతమాత్రాన మనదేశంలో మతానికి స్థానం లేదని భావించకూడదు. విభిన్న మతానుయాయులు, పెక్కు విశ్వాసాలు ఉన్న మన దేశంలో ప్రత్యేకంగా ఒక మతాన్నిగాని, ఒక విశ్వాసాన్నిగాని ప్రభుత్వం ప్రోత్సహించడానికి వీలులేదు. మన రాజ్యాంగ నిర్మాతలు ప్రభుత్వానికి సంబంధించినంతవరకు ఏ మతాన్ని ఆమోదించరాదని వివేకవంతమైన నిర్ణయం చేశారు. అంతమాత్రాన దేశంలో ఒక మతాన్ని అనుసరించకూడదనే నియమంలేదు. పైపెచ్చు ఆయా మతాలను ఆయా మతానుయాయులు అనుసరించవచ్చునని హామీ ఇవ్వబడింది. భారతదేశంలోవలె మరెక్కడా కూడ పరమత సహనమన్నది అంత ప్రముఖంగా కనిపించదు.

*　　　*　　　*

మనదేశానికి అతిథులుగా వచ్చే ఎందరో ఆగంతుకుల్ని మన దేశం ఆదరించవచ్చు, కాని ఆ ఆగంతుకులు పరిరక్షించుకోవాలని అభిలషించినా వ్యాప్తంచేయదలచినా వారి భావజాలాన్ని భారతదేశం ఆదరించవలసిన పని లేదు.

*　　　*　　　*

ప్రపంచంలోని దేశాలన్నిటి పత్రికాస్వాతంత్ర్యం పూర్తిగా సంరక్షించబడాలని నేను గాఢంగా విశ్వసిస్తున్నాను.

*　　　*　　　*

బాల భటుల (స్కౌట్స్) కే కాక సమాజంలో తన పాత్రను సక్రమంగా నిర్వహించదలచిన ప్రతి వ్యక్తికి 'సంసిద్ధుడవై ఉండు' అన్నది ఒక మంచి లక్ష్యం.

*　　　*　　　*

సంకుచిత జాతీయతకు కాలదోషం పట్టింది. అలాంటి జాతీయతవల్ల దేశాలకు పతనస్థితి వచ్చింది.

*　　　*　　　*

నిజమైన ప్రజాస్వామ్యతత్త్వం, ఉదారభావపు ఆదర్శాలు గణనీయమైన విజయాలు సాధించాయి చాలా దేశాలలో ప్రజాస్వామ్యజ్యోతి ఎప్పుడో ఒకప్పుడు వెలిగించబడింది. కాని ఈనాడు ఎన్ని దేశాలలో ఆ జ్యోతి వెలుగుతోంది ?

*　　　*　　　*

గురువుని, తల్లిదండ్రుల్ని, పెద్దల్ని సహజంగా గౌరవించే ప్రవృత్తి ప్రాచీన భారతీయ విద్యార్థిది. అలాంటప్పుడు ఈనాటి విద్యార్థులు ఈ గుణాలను తమ ముఖ్యధర్మాలుగా ఎందుకు భావించడం లేదు ?

* * *

యువతీయువకులు స్వయంక్రమశిక్షణలో కనుక తరిఫీదు పొందకపోతే, ఏ దేశమూ వర్ధిల్లదనీ, ఏ నాగరికతా నిలువజాలదని, నిజమైన ప్రగతి సాధించబడదని నేను ప్రగాఢంగా భావిస్తున్నాను. ఈ కారణంవల్ల విద్యాసంస్థలకు ఆవల మసులుతున్న దుష్టశక్తుల్ని నిరసిస్తున్నాను. విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యానికి ఆ శక్తులే కారణం. నా దేశం యువతమీద నాకు పరిపూర్ణ విశ్వాసం ఉన్నది. మనమాటలో చేతలో నిగ్రహం ఉండాలి అందుకుగాను మనం క్రమశిక్షణను అలవరచుకోవాలి.

* * *

పాఠశాలలు కర్మాగారాలు కావు వాటిని వాణిజ్యకేంద్రాలుగానో, లాభసాటి వ్యాపారస్థలాలుగానో పరిగణించడం అవాంఛనీయం. ఇన్ని సంవత్సరాలుగా పొందిన ఆదరణకంటె మనదేశపు యువతకు మంచి ఆదరణ లభించాలి. పైకి వస్తున్న తరంవారి భవిష్యత్తుని ఏ ప్రభుత్వమూ నిర్లక్ష్యం చెయ్యకూడదు.

* * *

ఒకే మూసలో పోసిన పట్టభద్రుల్ని అధికసంఖ్యలో తయారు చెయ్యడం విశ్వవిద్యాలయ కర్తవ్యం కాదు.

* * *

స్వేచ్ఛ నిజంగా ఒక గొప్ప వరమే. సందేహంలేదు. కాని అదిచాలా ప్రమాదకరమైంది కూడా. అది ఎందుకు ఉపయోగించబడుతున్నదో ఆ కారణం పురస్కరించుకొని దాని విలువ ఆధారపడి ఉంటుంది. దాన్ని ఎలా ఉపయోగించాలో అది చెప్పదు. స్వేచ్ఛకు ఉన్నత ప్రమాణాల మీద ఆధారపడిన అంతర్గత క్రమశిక్షణ అత్యవసరమని భావించకపోతే ఆ స్వేచ్ఛ చివరికి అవ్యవస్థితమైన, శక్తిరహితమైన పరిస్థితికి దారితీస్తుంది.

* * *

రాజకీయ కార్యకలాపాలలో నిమగ్నం కావటానికి లేదా వివాదగ్రస్తము లైన రాజకీయవాదాలలో తన ఆదర్శాన్ని లీనం చేసుకోవాలనో ఏ విద్యా సంస్థ కూడా ప్రయత్నించకూడదు. ప్రస్తుతం కొన్ని పాఠశాలలు, కళాశాలలు తమ కార్యకలాపాలకు ప్రచార ధోరణి కల్పించుకొంటున్న వైఖరి గోచరిస్తున్నది. ఈ ప్రచారధోరణి నానాటికి ఎక్కువవుతున్నట్లు కనిపిస్తున్నది. దీన్ని రూపుమాపాలి. రాజకీయ ప్రసంగాలకు వివాదగ్రస్త విషయాలకు విద్యాసంస్థలు బహిరంగ వేదికలు కాకూడదు.

* * *

ప్రస్తుత నియమ నిబంధనల ననుసరించి విశ్వవిద్యాలయం నిజంగానే స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థ. అది ప్రభుత్వానికి కట్టుబడి ఉండరాదు. ఎందు కంటే ఎవరి అవసరాల నిమిత్తం అది వెలుగులోకి వచ్చిందో ఆ అవసరాలు తీరుస్తూ తనదైన ప్రత్యేకత కలిగివుండాలి. అప్పుడే అది మనగలుగుతుంది విద్యావిషయిక పురోగతికి ఇది చాలా అవసరం. ఈ అంశాన్ని అనుభవజ్ఞులైన విద్యావేత్తలందరూ గుర్తించారు.

* * *

(జాతిపిత గాంధీజీ ఒక ఉన్మత్తుని కాల్పులకు గురియై మరణించిన సందర్భంగా లక్ష్మణస్వామి మొదలియారు ఆకాశవాణి మదరాసు కేంద్రంలో ఒక సంతాప ప్రసంగం చేశారు. ఆ ప్రసంగం నుంచి కొన్ని భాగాలు).

మహాత్మాగాంధీ మూర్తీభవించిన సత్యాహింసలు. ఈ యుగంలో అవత రించిన ప్రముఖ దేవదూత ఆయన. తాను నమ్మిన సిద్ధాంతాలను, విమర్శకులు కూడా ప్రశంసించేలా, ప్రగాఢంగా విశ్వసించినవారు. భగన్నామం ఉచ్చరిస్తూ ప్రార్థన సమావేశానికి వెడుతూఉండగా పరమ పవిత్రములైన శాంతి, సుహృ ద్భావం, స్నేహం-వీటికోసం ఆయన తన ప్రాణాన్ని సహితం లెక్కచేయక పర్యటన చేసి వచ్చిన అచిరకాలంలోనే ఆ వయస్సులో ఆయన ఒక పిరికివాని దౌష్ట్యానికి బలి అయ్యారు. ఇది దుర్భరమైన విషాద సంఘటన. సామాన్యులకు సులభంగా అర్థంకాని ఒక విపత్తు. అయినా విధివిలాసం విచిత్రం కదా! ఆయన తన దేశానికి ప్రపంచానికి ఎంతో సేవ చేశారు. ఆ సేవకంటె ఆయన మానవ జాతికి చేసిన సేవ విశిష్టమైనదనే అంశం స్పష్టం చెయ్యడానికి కాబోలు, ఆయన అలా దుర్మరణం చెందారు.

* * *

గాంధీ మహాత్ముడు సహేతుకంగా జాతిపిత అనీ, భారతదేశపు స్వాతంత్ర్యానికి వైతాళికుడనీ అభివర్ణించబడుతున్నారు. ఈ విశేషణాలు ఆయనకి తప్ప మరెవ్వరికీ వర్తించవు. అయినా ఆ పర్వదినాన అందరూ ఆనందోత్సాహాలతో ఉండగా పతాకాలు ప్రతిచోటా రెపరెపలాడుతూ ఉండగా శంఖధ్వనులు వినిపిస్తూ ఉండగా, దేశమంతా ఆయన్ని ప్రశంసలలో ముంచెత్తుతూ ఉండగా - ఆనాడు, ఆగస్టు 15న-ఆ వైతాళికుడు అక్కడ లేడు. ఆ ఆనందోత్సాహాలలో పాలు పంచుకొనే అవకాశం ఆయనకు లేకపోయింది.

* * *

తన దేశీయుల్ని పరిరక్షించేందుకు ఆయన మరణించారు. ఆలాంటప్పుడు మనస్మృతిలో ఆయన మెదులుతున్నప్పుడు, అందరినీ ఆయన జీవితదృక్పథానికి మరలించడం సముచిత మనిపించుకుంటుంది. ఆయన హృదయంలో కాఠిన్యం, లేదు. అవివేకంగా ప్రవర్తించినవారిని సైతం ఆయన దూషించలేదు. 'భగవాన్! వాళ్ళేమి చేస్తున్నారో వాళ్ళకు తెలియదు, కనుక వాళ్ళను క్షమించు' అన్న వాక్యాన్ని ఆయన విశ్వసించారు.

* * *

మహాత్ముడికి సముచిత స్మృతిచిహ్నాలు నెలకొల్పడం గురించి చాలా మంది ఆలోచిస్తున్నారు, మనదేశపు మహనీయులలో ప్రముఖులైన ఆయనకి దేశం తన కృతజ్ఞతను, అభిమానాన్ని వ్యక్తం చెయ్యాలి. ప్రతివ్యక్తి హృదయంలోను ఆ మహాత్ముని సందేశం, అభిమతం నెలకొనాలి. అదే మనము భావించే సర్వోత్తమం శాశ్వతం అయిన చిహ్నమవుతుంది.

* * *

## అనుబంధం—4

# రామస్వామి మొదలియారుకి బహూకరింపబడిన గౌరవ డిగ్రీలు, బిరుదులు

| విశ్వవిద్యాలయం | డిగ్రీ | సంవత్సరం |
| --- | --- | --- |
| ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం | డి. సి. యల్. | 1946 |
| దర్‌హం విశ్వవిద్యాలయం | డి. సి. యల్ | 1953 |
| మదరాసు విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1957 |
| ఉస్మానియా విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | |
| మైసూరు విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | |
| తిరువాంకూరు విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | |

## బిరుదులు

దివాన్ బహదూర్

రాజమంత్ర చింతామణి

సర్ - 1937

కె. సి. ఐ. ఇ. 1942

పద్మవిభూషణ్ - 1970

## అనుబంధం–5

# లక్ష్మణస్వామి మొదలియారుకి బహూకరింపబడిన గౌరవ డిగ్రీలు, బిరుదులు

| విశ్వవిద్యాలయం | డిగ్రీ | సంవత్సరం |
|---|---|---|
| సిలోన్ విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1942 |
| ఆంధ్ర విశ్వవిద్యాలయం | డి. యస్సి. | 1943 |
| లక్నో విశ్వవిద్యాలయం | డి. యస్సి. | 1944 |
| పాట్నా విశ్వవిద్యాలయం | డి. యస్సి. | 1944 |
| ఉత్కళ్ విశ్వవిద్యాలయం | డి. యస్సి. | 1944 |
| ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం | డి. సి. యల్. | 1948 |
| గ్లాస్గో విశ్వవిద్యాయలం | యల్. యల్. డి. | 1951 |
| అణ్ణామలై విశ్వవిద్యాలయం | డి. లిట్ | 1955 |
| కలకత్తా విశ్వవిద్యాలయం | డి. యస్సి. | 1957 |
| మెక్‌గిల్ విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1958 |
| మైసూరు విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1960 |
| హాంగ్‌కాంగ్ విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1961 |
| మదరాసు విశ్వవిద్యాలయం | డి. యస్సి. | 1961 |
| లండన్ విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1963 |
| మదురై విశ్వవిద్యాలయం | యల్. యల్. డి. | 1967 |
| రావ్ బహదూర్ | | 1929 |
| దివాన్ బహదూర్ | | 1942 |
| సర్ (నైట్‌హుడ్) | | 1945 |
| పద్మభూషణ్ | | 1954 |
| పద్మ విభూషణ్ | | 1963 |
| అమెరికన్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్ ఫెలో (ఈ గౌరవం పొందిన ప్రథమ భారతీయుడు) | | 1941 |
| ఎడిన్‌బరోలోని రాయల్ కాలేజ్ ఆఫ్ ఫిజిషియన్స్ ఫెలో | | 1967 |

అనుబంధం - 6

# కర్నూలు కీర్తికిరీటానికి కలికితురాయిలు ఆర్కాటు రామలక్ష్మణులు

హెచ్. హీరాలాల్

**M. A;**

సాహిత్యరత్న; శిక్షణ ప్రవీణ

హిందీ పండితులు

**S V. S.** హైస్కూలు, కర్నూలు.

ఆర్థిక, సామాజిక, విద్యారంగాలలో ఈనాడు దత్తమండలం అనిపించుకున్న రాయలసీమ చాలా వెనుకబడి వుంది. బళ్ళారి కొంత ముందంజ వేసినను మిగతా కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు అంతంత మాత్రమే నత్త నడకతో ముందుకుసాగే రోజులవి. విపరీతమైన కరువు కాటకాలు ఈ ప్రాంతాల్ని జర్జరితం చేశాయి. పిండారీల దోపిడీలు, పాలకుల పరస్పర కలహాలు, పరాయి దొరల పెత్తందనాలు, వీటికి తోడు ప్రజల పేదరికం ఈ జిల్లాల్ని కదలించి వేశాయి. కర్నూలుజిల్లా కడగండ్లు చెప్పనలవి కాదు.

ధాత కరువే కాదు - కరువు మీద కరువు. అట్టి సమయాల్లో బుడ్డా వెంగళ రెడ్డి దాతృత్వం ఆకలిగొన్న కడుపులకు ఊరట కలిగించింది. జనాలకు కొంత ఊపిరి వచ్చింది ఆంగ్ల ప్రభుత తన పెత్తనం సాగించటం ఆరంభించింది. విద్యారంగంలో కొత్తమార్పులు వచ్చాయి. 1859-60 ప్రాంతంలో ఇంగ్లీషు - తెలుగు భాషలను నేర్పటానికి ఒక జిల్లా స్కూలు కర్నూలులో ప్రారంభ మయింది. ఇదే నేటి మున్సిపల్ హైస్కూల్. దీని మొదటి హెడ్మాష్టరు మురుగేశ మొదలియార్. ఆ తర్వాత సి. హెచ్. ఇలియట్, తంబుపిళ్ళె, కె. ఎస్.

రామారావు మొదలైన వారు ఆరంభదశలో ఈ స్కూల్లో హెడ్మాష్టర్లుగా పని చేశారు.

ఆనాడు ఉపాధ్యాయులుగా, న్యాయవాదులుగా మరి ఇతర ఉద్యోగస్థులుగా తెలుగువారు ఎక్కువగా కనిపించరు. దక్షిణ ఆర్కాటు, తంజావూరు, మదురై, హోసూరు, కృష్ణగిరివంటి తమిళ ప్రాంతాలనుండి అయ్యర్లు, అయ్యంగార్లు, పిళ్ళైలు, మొదలియార్లు మున్నగువారు ఈ ప్రాంతాలకు వచ్చారు. వీరిలో తెలుగు మాతృభాషగా కలిగినవారు కొందరు తమిళులు కొందరు కనిపిస్తారు. తమిళులైనా తెలుగునాట తెలుగువారికి విశేషంగా సేవలు చేసినారన్నది వాస్తవం. వీరు తెలుగుభాషా సంస్కృతులకు తరగని సేవ చేశారు.

తొండ మండల ముదలియారు వంశీకులైన కుప్పుస్వామి గారు ఉద్యోగ రీత్యా కర్నూలుకు వచ్చారు. వీరు రెవెన్యూ శాఖలో సామాన్య ఉద్యోగిగా వుండే వారు. సిద్ధమ్మ వీరి ధర్మపత్ని. సామాన్యమైన మధ్యతరగతి కుటుంబం వీరిది. కోట ఏరియాలో వీరి ఇల్లువుండేది. కుప్పుస్వామిగారితో పాటు వీరి సోదరులు కూడ కర్నూలు జిల్లాలోనే చిన్న చిన్న ఉద్యోగాలతో జీవితం గడిపే వారు. వీరిది సంస్కారవంతమైన కుటుంబం, వైష్ణవ సాంప్రదాయం.

తమ పూర్వీకులు తమిళులయినా, తరాల తరబడి తెలుగునాట జీవిస్తూ తెలుగునే వాడుకభాషగా గ్రహించిన కుటుంబం వీరిది. సిద్దమ్మ పుట్టినిల్లు కూడ రాయలసీమకు చెందినదే అయివుండాలి కారణం సిద్దయ్య, సిద్దమ్మ, సిద్దులు, సిద్ధాపురం లాంటి పేర్లు ఈ ప్రాంతానికి చెందినవే! వీరింటిలో తమిళం మాట్లాడినా, తెలుగు వాడుకలో వుండిందేమో!

సిద్దమ్మ, కుప్పుస్వామి దంపతులకు 1887 అక్టోబర్ 14 వ తేదీన కర్నూలులో రామస్వామి, లక్ష్మణస్వామి అనే కవలలు జన్మించారు. రెండేళ్ళు ఈడొచ్చేదాకా సిద్దమ్మ ఒడిలోనే పెరిగారు. కాని తల్లిని కోల్పోవటంతో ఈ పసివాళ్ళను కుప్పుస్వామి అన్నా వదినెలు చేరదీసి పోషించారు. పిల్లలకు అయిదేళ్ళు రావటంతో కర్నూలు మునిసిపల్ స్కూల్లో ప్రయిమరీ తరగతుల్లో చేర్చారు. బహుశ, 1892 లో వీరు ప్రైమరీ తరగతుల్లో వున్నారు.

## రామస్వామి మొదలియార్ జ్ఞాపకాల్లో...

1972 మార్చి 3 వ తేదీన రామస్వామి మొదలియారు అప్పటి మున్సిపల్ హైస్కూల్ హెడ్మాష్టర్ కీ.శే కె సీతారామయ్య గారి పేరిట రాసిన లేఖలో-

"ఎనభై ఏళ్ళకు మునుపు నేనూ, నా సోదరుడు ప్రయిమరి తరగతుల్లో వున్నాం. రెండేళ్ళ తర్వాత సెకెండరీ తరగతులకు ప్రమోషన్ అవటానికి ప్రయిమరీ పరీక్షను ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ పరీక్షను స్కూళ్ళ ఇన్స్పెక్టర్ నిర్వహించారు. ఆ పరీక్షలో ఇద్దరం ఉత్తీర్ణులమయ్యాం. పై తరగతికి ప్రమోటయ్యాం. మూడేళ్ళ తర్వాత థర్డుఫారంలో మళ్ళీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ వారు లోయర్ సెకండరీ పరీక్షను నిర్వహించారు. ఇందులో కూడ మేమిద్దరం పాల్గొన్నాం. ఫోర్త్‌ఫారంలో చేరటానికి తగిన యోగ్యత కలదని ప్రమోట్ చేయబడినాం. తర్వాత మెట్రిక్ పరీక్షను ఎదుర్కొనవలసి వచ్చింది ..

దీన్నిబట్టి సోదరులిద్దరూ చిన్నప్పటినుండి శ్రమించి చదివేవారనీ, పై క్లాసులకు అవలీలగా ప్రమోట్ అయ్యేవారని తెలుస్తూంది. 1902 లో వీరు పబ్లిక్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. సాంసారికమైన ఒడిదుడుకులు అనేకం వున్నా సాత్విక గుణాలకు నిలయమైన వాతావరణం ఇంట్లో. దీనికి తోడు అనుశాసనం-సౌశీల్యం-విజ్ఞానంతో మిళితమైన కర్నూలు మున్సిపల్ హైస్కూలు ప్రాంగణం. ఖ్యాతికీర్తికి కలికితురాయిలై వెలగడానికి ఎంతో దోహదం చేశాయి. ఈ సోదరుల హృదయాల్లో ఆనాటి మధుర స్మృతులెన్నో పదిలమైయున్నట్లు పై పేర్కొన్న లేఖలో రామస్వామి మొదలియార్ ఇలా వ్రాశారు-

"ఆనాడు కర్నూలు మున్సిపల్ హైస్కూల్లో చదువుకొన్నప్పటి మధుర స్మృతులెన్నో మా హృదయాల్లో పదిలపరచు కొన్నాము. ఆ నాటి మా హెడ్మాస్టరు శ్రీ. కె. రఘునాథాచారి. ఆయన "మహోన్నతకు ప్రతీక" (**Symbol of dignity**) ఆయన సైన్సు పాఠాలు బోధించే తీరు అద్భుతం.

వీరు కాలినడకన గాని, బైస్కిలు మీద గాని బాటలో వెళ్ళేటప్పుడు ఆయన ముందుకు సాగేదాక జనాలు ఎక్కడి వారక్కడ నిలిచి పోయేవారు

ప్రజ్ఞానిధియైన ఆ ప్రధానాచార్యుని పట్ల ఎంతో విశిష్టమైన గౌరవభావం జనాలకు వుండింది."

దేశీయంగా, అంతర్దేశీయంగా విశిష్టమైన కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించిన వీరికి విద్యాబోధన గావించి, ప్రోత్సాహమిచ్చి, చైతన్యవంతులుగా తీర్చిదిద్ది స్ఫూర్తిని ప్రసాదించిన ఒకరిద్దరు ఉపాధ్యాయులను గూర్చి తెలపడమవసరం.

## హెడ్మాష్టరు కె. రఘునాథాచార్య:

నాడు మున్సిపల్ హైస్కూల్లో శ్రీ కె.ఆర్. రఘునాథాచార్యులు 1892 నుండి 1910 దాకా ప్రధానాధ్యాపకులుగా పనిచేశారు. వీరు విద్యార్థుల పట్ల ఎంతో ఆదరాభిమానాలు కలిగియుండినారు. వారి బోధనాచాతురి ముఖ్యంగా సైన్సును బోధించే రీతి అత్యద్భుతము. వీరి ఆర్ద్రత, అనురాగము, అనుశాసనము ఈనాటి మనకు ఆదర్శప్రాయం. శ్రీ రామస్వామి మొదలియార్ ఒక అనుభవాన్ని ఇలా వివరించారు.

6వ క్లాసులో జరిగిన సంఘటన. ఇది అధ్యాపకుల అనుశాసనం-ప్రవృత్తులకు సంబంధించినది

6వ తరగతి మాష్టారు సమాధానములు చెప్పని విద్యార్థులను బెంచిమీద నిలబెట్టేవారు. ఒకసారి, ఆయన తన ఆజ్ఞను సడలించలేదు పిల్లలు ప్రతిరోజూ నిలవాల్సి వచ్చేది. ఇంతేగాక, ప్రొద్దున, సాయంత్రం రెండుపూటలా నిలబడాలి. ఇట్టి కఠినమైన పనిష్మెంటు నుండి అదృష్టవశాత్తు వీరిద్దరూ తప్పించుకొన్నారు. ఈ విషయాన్ని హెడ్మాస్టరుగారు ఎలాగో గ్రహించి తమ గదినుండి బయటికి వచ్చారు. 6 వ తరగతిలో ప్రవేశించారు. ఐదారుగురు విద్యార్థులు తప్ప అందరూ బెంచీమీద నిల్చొనియున్నారు అందరిని తక్షణం కూర్చోమని చెప్పి 6 వ తరగతి మాష్టారును తన గదికి పిలుచుకొనిపోయి, విద్యార్థులపట్ల ఈ విధంగా ప్రవర్తించరాదని హితవు చెప్పారు. అధ్యాపకుల్ని సైతం ఆయన సక్రమంగా వ్యవహరించేటట్లు చేశేవారు. ఆయనను మూర్తీభవించిన అనుశాసనం అనేవారు ఆనాడు.

వీరు ఇంటిలో వున్నప్పుడు అగ్గిపెట్టెల తయారీ, గాజుమలామ వంటి చేతి పనులు చేసేవారు తరగతి గదిలో వీటిని గురించి విద్యార్థులకు వివరించే వారు. చేతిపనులను చేయాలని ప్రోత్సహించేవారు. వీరు ప్రతి విషయాన్ని ఆచరణాత్మకంగా చేసేవారు

ఈ భావాలు వారి విద్యాలయ వాతావరణాన్ని, అధ్యాపకుల వైశిష్ట్యాన్ని తెలుపుతున్నవి. శ్రీ కె ఆర్. రఘునాథాచారిగారి ప్రభావం విద్యార్థుల మీద పుష్కలంగా వుందనడంలో మరొక దృష్టాంతం వుంది.

## శ్రీ రఘునాథాచార్యచే ప్రభావితుడైన మరో విద్యార్థి - 'ఆంధ్రతిలక్' గాడిచర్ల

ఆంధ్రలో వందేమాతరం వీరుడుగా రాణించిన ఆంధ్రతిలక్, గాడిచర్ల హరిసర్వోత్తమరావు కూడ కర్నూలు మున్సిపల్ హైస్కూల్ విద్యార్థియే. 1900 వ సంవత్సరం దాకా ఆయన అక్కడ చదివారు. 1901 లో మద్రాసుకు పై చదువుల కోసం వెళ్ళారు. ఆర్కాటు సోదరులు 1902 దాకా మున్సిపల్ హైస్కూల్లో చదివారు. 1903 లో మద్రాసుకు పైచదువులకు వెళ్ళారు. రెండు సంవత్సరాల తేడావున్నా వీరు ముగ్గురు ఒకే సమయంలో మున్సిపల్ హైస్కూల్లో చదివారు.

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని కూడా ప్రభావితం గావించింది శ్రీ కె ఆర్. రఘునాథాచారి గారే. ఆ సమయంలోనే గని శేషావధానులు అనే తెలుగు పండితులు వుండేవారు విద్యార్థులను వీరెంతో ప్రభావితం చేశేవారు. ఆర్కాటు సోదరులకు కూడ హైస్కూలు తరగతుల్లో వీరే తెలుగును బోధించేవారు. కాబట్టే, వీరు ఎఫ్,ఏ (F. A) తరగతిదాక తెలుగునే అభిమానభాషగా స్వీకరించి అధ్యయనం చేశారు.

శ్రీ రఘునాథాచారిగారు ఆనాటి విద్యావేత్తల్లో ఒకరుగా, పరిణతి నొందిన విద్వన్మూర్తులుగా రాణకెక్కినారు విద్యార్థుల్లో సైతం అధ్యయనంపట్ల ఆసక్తి, చింతన కలిగించటానికి యత్నించేవారు వీరిని గూర్చి గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారి అభిప్రాయాలివి—

"స్కూలు లైబ్రరీ నుండి క్లాసుకు పుస్తకాల్ని తెప్పించి చదివి వినిపించడం ఆయనకు పరిపాటి ఒక దినము అబ్బాయీ ! రీడింగు రూముకు పోయి **tit-bits** పట్టుకురమ్మన్నాడు. తెచ్చి చేతికిచ్చిన తర్వాత ఒక వ్యాసము చదవడ మారంభించినాడు చివాలున ఆపి నేను చదివిన కడపటి వాక్యము వ్రాయం డన్నాడు. ఎవరు వ్రాయగలరు? నే నొక్కడనే ఆ వాక్యమును వ్రాయగలిగితిని. ఇప్పటికీ, నేనది మరచిపోలేదు

**"Try the experiment of eating a favourite dish in absolute darkness and you will find it does not taste half well as when you are able to please both the palate and the eye."** అనేది వాక్యం. అనగా మీకు అతి ప్రీతికరమైన పదార్థమును చీకటిలో తినునట్టి ప్రయత్నము చేయుడు. వెలుతురులో కండ్లతో చూచి ఆనందించి రసనతో అనుభవించినప్పుడుండే తృప్తి చీకటిలో తిన్నప్పుడు వుండదనుట మీరు గ్రహింపగలరు. ఇట్టి ఆసక్తికరము, స్ఫూర్తి ప్రదమునగు సంఘటనలు, గ్రంథాలయ సంబంధములు నన్ను భవిష్యత్తులో గ్రంథాలయోద్యమానికి చేయూత నిచ్చుటకు నాడే బీజావాపనం చేసినట్లు భావిస్తున్నానన్నారు."

1908 మార్చి 21 న మద్రాసు టిచర్సు గిల్డు సమావేశం జరిగింది జి మాణిక్యం చెట్టియార్ అధ్యాపకుల సంఘటనంకోసం మద్రాసు ప్రెసిడెన్సీలో ఉపాధ్యాయ సంఘాల ఏర్పాటును ప్రతిపాదించారు. దానికై ఒక విద్యావేత్తల కమిటీని వేశారు. అందులో—

శ్రీయుతులు
1. కె ఆర్. కృష్ణ అయ్యరు, గుంటూరు
2. జె పి కోటిలింగం, బళ్ళారి.
3 కె ఆర్. రఘునాథాచారి, కర్నూలు
4. కె.ఎస్. స్వామినాథయ్యర్, మదురై.
5. కె దాస్ కృష్ణయ్య, పాలంకోట
6. ఎస్.ఎస్. వ్యాసరావు, తిరుచినాపల్లి.
7. పి లక్ష్మినరసు, మద్రాసు.
8. పి.టి. శ్రీనివాస అయ్యంగార్, వైజాగ్.

9. W M ధియోబాల్డ్, కోయంబత్తూర్
(కన్వీనరు)
10 రెవరెండు A H దవే, మన్నారుగుడి.

మొదలగు ప్రసిద్ధ విద్యావేత్తలున్నారు. ఆనాటి విద్యావేత్తలలో వీరంతా పేరెన్నిక గలవారు. దీనికి తోడు వీరు అపారమైన పాండితీపటిమ గలవారని, ఆనాటి విద్వాంసులలో ఒకరని తెలుస్తుంది.

## తెలుగు పండితులు గని శేషశాస్త్రిగారి ప్రభావం :

ఆనాటి ఉపాధ్యాయులలో తెలుగు మున్షీ (తెలుగు పండిట్) శ్రీ గని శేషయ్యశాస్త్రి ప్రసిద్ధులు. వీరితోపాటు వైయాపురి మొదలియార్, పరముని స్వామయ్య, వీర రాఘవులు నాయుడు, వి. కె. అనంతకృష్ణఅయ్యరు, బి. వెంకటరావు, పి. సీతారామయ్య, మొహమ్మడన్ మాష్టర్లుగా, (ఉర్దూ మున్షీలుగా) సయ్యద్ ముజహద్అలీ, యం. సుల్తాన్ సాహెబ్, యం. అబ్దుల్లాఖాన్, యం. మహబూబ్ఖాన్, ఎలిమెంటరీ తరగతి టీచర్లుగా ఒ. మాధవరావు, పద్మనాభ బాలిగ, వె సంజీవరావు, తెప్పెరుమాళయ్య ముఖ్యులు.

గని శేషయ్యశాస్త్రి దినమొక్క శతకము వ్రాయునంతటి కవితా సామర్థ్యము కలిగిన పండితోత్తముడు. ఆయన భాగవతములోని పద్యములను పఠించు తీరు విద్యార్థుల మనసుల్లో చెరగని ముద్ర వేస్తుండినది. ఆయనవల్ల ఎందరో విద్యార్థులు ప్రభావితులైనారు.

## మొదలియారు సోదరులు తెలుగే చదివారు:

రామ లక్ష్మణ మొదలియార్ సోదరులు ఎఫ్.ఎ. (F.A ) దాక తెలుగునే అధ్యయనం చేశారు. స్కూలు వదలిన తర్వాత హంద్రీ - తుంగభద్రల యిసుక తిన్నెలు వీరికి ఆటవిడుపులుగా వుండేవి. పాఠశాలలో ప్రముఖులతో సారస్వత సమావేశాలు జరిగేవి. ప్రతిభామూర్తులైన వీరికి యీ కార్యక్రమాలన్నీ ఉన్నతినందుటకు సోపానాలైనాయి.

1902 లో మున్సిపల్ హైస్కూలు నుంచి (ఆనాడు జిల్లా స్కూలు) మెట్రిక్ పరీక్షకు పోయిన 14 మందిలో వీరిద్దరే ఉత్తీర్ణులయ్యారు. తర్వాత

1903 లో వీరు మద్రాసులోని క్రిష్టియన్ కాలేజిలో ఎఫ్.ఎ. (F A) తరగతిలో చేరారు. తెలుగును ద్వితీయ భాషగా చదివారు. తర్వాత లక్ష్మణస్వామి మద్రాసు మెడికల్ కాలేజిలో చేరి L.M &S కోర్సును చదివారు. రామస్వామి బి ఎ. (B.A) చదివి తర్వాత 1909 లో బి ఎల్ (B L) ప్యాసయ్యారు బారిస్టర్ రిచ్‌మండ్ దగ్గర జూనియర్‌గా చేరారు.

## వివిధ పదవుల్లో రామస్వామి :

రామస్వామి అప్రతిమాన ప్రతిభాసంపన్నుడు. ప్రజాసేవాకార్యాల్లో మగ్నమయ్యారు చాలాకాలందాక, న్యాయవాద వృత్తి చేయలేదు. 1920 లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులైనారు 1928-30 దాక మద్రాస్ కార్పొరేషన్ అధ్యక్షులుగా వున్నారు

1930 లో సెంట్రల్ అసెంబ్లీలో సభ్యుడుగా డిల్లీ చేరారు. 1934 దాకా అక్కడ వున్నారు. ఈ మధ్యకాలంలో లండన్‌లో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో పాల్గొన్నారు. లండన్‌లోని ఇండియన్ కౌన్సిల్‌లో 1936-37 దాకా సభ్యుడుగా వున్నారు. 1937-39 దాకా అక్కడ స్టేట్ సెక్రటరికి ఆంతరంగిక కార్యదర్శిగా వున్నారు 1939 లో రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో గవర్నర్ జనరల్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో కామర్సు మెంబరుగా వున్నారు 1942-46 లో CSIR (కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసెర్చ్) సదస్యులుగా వున్నారు 1945 లో శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజసమితిలో ఇండియా తరపున పాల్గొన్నారు ఎకనామిక్ అండ్ సోషల్ కౌన్సిల్‌కి వీరు 1945-47 దాకా అధ్యక్షులు. 1946-49 దాకా మైసూర్ దివానుగావున్నారు 1950-56 దాకా తిరువాన్కూరు విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా వున్నారు 1952-62 దాకా రాజ్యసభ సభ్యులు

1976 జూలై 17 న తన 89 వ యేట పరమపదించారు.

వీరు పద్మభూషణ బిరుదాంకితులు. రామస్వామి మొదలియార్‌గారికి దక్షిణ భారతంలోని ఆరంభ రాజకీయాలతో సంబంధంవుంది. శ్రీయుతులు పి. త్యాగరాయ చెట్టి, డా॥ టి యం. నాయర్‌లచే స్థాపితమైన జస్టిస్‌పార్టీకి వీరు మేధస్సు బొబ్బిలిరాజా ఎన్నికలసందర్భంగా వీరు కర్నూలుజిల్లానేకాదు, ఆంధ్రదేశమంతటా పర్యటించారు అప్పటి జమీందారుల దగ్గర వీరికి మంచి పలుకుబడి ఉండేది.

## విద్యావేత్తగా లక్ష్మణస్వామి :

లక్ష్మణస్వామి డాక్టరీ ప్యాసయిన తర్వాత మద్రాసు ప్రభుత్వ వైద్య శాఖలో చేరారు 1939లో వీరు మద్రాసు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్ అయ్యారు. అంతర్జాతీయ స్థాయిలో ప్రసిద్ధ గైనకాలజిస్టు. 1942 నుండి 69 దాక మద్రాసు యూనివర్శిటి ఉపాధ్యక్షులుగా 27 సం॥లు పనిచేశారు.

వీరు 1974 ఏప్రిల్ 15వ తేదీన తన 86వ యేట మరణించారు

లక్ష్మణస్వామి గొప్ప విద్యావేత్త, 1948-58 దాక ప్రపంచ ఆరోగ్య సంస్థకు (**WHO**) భారత ప్రతినిధుల్లో ఒకరు 1949-50 దాకా దానికి అధ్యక్షులు. 1954-56 దాక యునెస్కో అధ్యక్షులు. 1948-58 దాక కామన్వెల్తు దేశాల యూనివర్శిటీల సమాఖ్యకు కార్యవర్గ సభ్యులు. 1946 నుండి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు.

1954 లో వీరికి పద్మభూషణ బిరుదు లభించింది. వీరు మద్రాసులోని భారతీయ విద్యాభవన్ కేంద్రశాఖకు అధ్యక్షులుగా విశిష్టమైన సేవలు గావించారు.

సర్వశ్రీ రామస్వామి - లక్ష్మణస్వామి మొదలియార్ సోదరులు వికాసాత్మక కార్యకలాపాల్లో - విద్యారంగంలో విశిష్టమైన సేవలుచేసి తమ కీర్తిని చిరస్థాయి చేసుకొన్నారు.

## మద్రాసు రాష్ట్రంలో రాజకీయాలు :

మద్రాసు రాష్ట్రంలో 1915 - 40 దాకా 25 సంవత్సరాలు రామస్వామి మొదలియార్ జస్టిస్‌పార్టీకి, సత్యమూర్తి కాంగ్రెసుకు ప్రముఖ నాయకులుగా రాణించారు. రామస్వామి మొదలియార్ మహావక్త. ఆయన వాణి శ్రోతలను ముగ్ధులను గావించేది. సామాజిక విప్లవం అట్టడుగున పడిన బ్రాహ్మణేతర వర్గాలకు సమత్వస్థాయి సమకూర్చడం, ఉన్నత వర్గాలతో పాటు బ్రాహ్మణేతరులకు కూడా అన్ని రంగాల్లో సమాన అవకాశాలు కలిగించడం ఆయన ఆశయం. జస్టిసుపార్టీ నాయకుల్లో వీరికి విశిష్ట స్థానముండింది. మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీ, మద్రాస్ కార్పొరేషన్ రాజకీయాల్లో ఇతర సభాసమావేశాల్లో వీరిద్దరూ ప్రతిపక్షమునకు చెందిన వారు.

సత్యమూర్తి కేంద్ర అంసెంబ్లీకి ఏం. ఎల్ ఎ. గా (M L A.) విజయం పొందిన తర్వాత మొదలియార్‌కు ఇక రాజకీయమైన భవిష్యత్తు లేదని కొందరు భావించారు కాని, బ్రిటిష్ ప్రభుత్వం ఆయన ప్రతిభ - యోగ్యతల్ని గుర్తించి, పార్లమెంటు వేదికలపై ఆయన ప్రత్యర్థులపట్ల చేసిన ప్రసంగాల తీరు అద్భుతమైన చాకచక్యం గమనించి, వైస్రాయి కౌన్సిల్లో ప్రథమ సభ్యుడిగా తర్వాత ఉపాధ్యక్షుడిగా నియమించింది. వైస్రాయియొక్క సెంట్రల్ కాబినెట్లో ప్రవేశించినను రామస్వామి మొదలియార్ జాతీయభావాన్ని ఆత్మసమ్మానాన్ని విడనాడక నిజమైన దేశభక్తుని లక్షణాల్ని వ్యక్తం చేశారు. యుద్ధ సమయాల్లో - జాతీయ అంతర్జాతీయ సమ్మేళనాల్లో అసమాన ప్రతిభను మధురశైలిలో వ్యక్తం చేస్తూ మానవత్వపు విలువలను - భారతదేశ గరిమను పెంచడానికి తన శాయశక్తులా ప్రయత్నంచేసిన జాతీయ మనీషి ఈయన. దాస్య, శ్రామిక (**Slave labour**) విషయాలు పరిశోధించి యూరపు దేశాల్లోనివారి జాగృతి కోసం కూడ యత్నించారు. యునెస్కోకు చార్టరు నిర్మాత వీరే

మద్రాసు వేయరుగా అట్టడుగున పడిన జనాల అభ్యున్నతికై వీరు కృషి చేశారు. సెంట్రల్ అసెంబ్లీలో ప్రొ॥ ఎన్. జి రంగా గారు వీరికి ప్రత్యర్థి. పరస్పరం జాతీయ సమస్యలపై వాదించుకున్నా, ఇరువురిలో సమన్వయం వుండింది. రంగా గారు ఉప్పు సత్యాగ్రహ సమయంలో బ్రిటిషు వారికి బ్రాహ్మణేతరవర్గం మద్దతు ఇవ్వకుండా చూడవలసిందని వారిని సభలో అర్థిస్తే, ఆయన రంగా గారిని రాజకీయాలనుండి విరమించ వలసినదిగా కాలేజి ట్రస్టుబోర్డు వారి అల్టిమేటాన్ని గుర్తుచేశారు.

రామస్వామి మొదలియార్ వంటి జాతీయ తత్వం కలిగిన వ్యక్తి కాంగ్రెసును ఎందుకు వ్యతిరేకించాడు? అన్నది అర్థం కాని ప్రశ్న కేవలం స్వాతంత్ర్యమే దేశానికి మహోన్నత స్థాయి కల్పిస్తుందని భావించడం పొరబాటు. సామాజికమైన ఎన్నో దుష్ట సమస్యలను పరిష్కరిస్తేనే కాని దేశ-గరిమ పెరగదని, దాని విలువలు చెరగవని మొదలియార్ అభిప్రాయం

ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ రంగాగారు - కులాల కక్షలు - పూజారుల చేతలు - అంటరానితనం - నిమ్నోన్నత భావాలు లాంటి కార్యాలు సామాజి

కంగా ఉన్నత స్థాయికి చేర్చలేవు ఈ సామాజిక క్రూర కార్యాలు దేశ ప్రగతికి అవరోధాలు అని భావించి ఈయన, డా॥ టి యం నాయర్, త్యాగరాజు పిట్టి గార లకు అనుయాయులుగా మారిపోయారు.

జాతీయ విప్లవం సామాజిక విప్లవం తెస్తుందన్న గాంధీగారి మాటలు మొదలియారును అతని మిత్రులను ప్రభావితం చేయలేక పోయాయి.

ఈయన సౌత్ ఇండియా లిబరల్ ఫెడరేషన్‌కు కార్యదర్శిగా వుండేవారు. 1920, 23 లో MLC గా ఎన్నికయ్యారు 1926 లో MLA గా పోటీచేసి ఓడిపోయారు. 1928 లో మేయరుగా ఎన్నికయ్యారు. 1930 లో కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌కు ఎన్నికయ్యారు 1930 లో కేంద్ర అసెంబ్లీ ఢిల్లీకి MLA గా ఎన్నికయ్యారు. 1934 లో ఓడిపోయారు.

## భారతీయ విద్యావిధానానికై రూపురేఖలు దిద్దిన విద్యావేత్త :

లక్ష్మణస్వామి మొదలియార్ రాజకీయాలకు అతీతంగా విద్యా-వైద్య రంగాలలోనే తన ప్రాభవాన్ని నిలుపుకున్నారు. ఈయన నిర్మాణాత్మకమైన కార్యకలాపాల్లో ముందుకు సాగారు. అగ్రజునివలె ఈయన కూడా మహా వక్త. జాతీయ సమైక్యతకు ఏనాడు కూడ విరోధించలేదు. కాబట్టే, ప్రభుత్వాలు మారినా మద్రాసు విశ్వవిద్యాలయానికి వీరే ఉపాధ్యక్షులుగా వుండిపోయారు. ఇంతేకాదు, స్వాతంత్ర్యం వచ్చినతర్వాత భారత ప్రభుత్వం 1952లో వీరి నేతృత్వంలోనే సెకండరీ ఎడ్యుకేషన్ కమిషన్ ఏర్పాటు గావించి విద్యారంగంలో నూతన పరివర్తనకు నాంది పలికినది. ఆనాటి విద్యామంత్రి వీరి శక్తి సామర్థ్యాలను గుర్తించి ఈ కమిటీని ప్రతిపాదించారు అందులో అధ్యక్షుడిగా డా॥ లక్ష్మణ స్వామి మొదలియార్, సభ్యులుగా ప్రిన్సిపల్ జాన్ క్రిష్టి (జీసస్ కాలేజి, ఆక్స్ ఫర్డు) డా॥ కెన్నెడి రాస్టు విలియం (అసోసియేట్ డైరెక్టర్, సదరన్ రీజనల్ ఎడ్యుకేషనల్ బోర్డు, అట్లాంటా (U.S.A), శ్రీమతి హంసా మెహతా, బరోడా విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్, శ్రీ జె. ఎ తారాపోర్వాలా, బొంబాయి

గవర్నమెంటు టెక్నికల్ ఎడ్యుకేషన్ డైరక్టరు, డా॥ కె.ఎల్ శ్రీమాలి, ప్రిన్సిపాల్, **M. T** వ్యాస్, భారత విద్యాశాఖ సంయుక్త కార్యదర్శి కె.జి సయిదేన్, ప్రిన్సిపాల్ **A.N.** బసు (మెంబరు సెక్రటరీ) ఉన్నారు.

మొదలియార్ కమిటీ సిఫార్సులు భారతీయ విద్యావిధానానికి నూతన రూపురేఖలు దిద్దినవి సెకండరీ విద్యావిధానానికే కాదు, యూనివర్శిటీ స్థాయి విద్యావిధానానికి కూడ వీరు పేర్కొన్న ఆశయాలు భారతీయ జీవన తత్వానికి మెరుగులు పెడుతున్నాయి విద్యారంగంలో వీరు గావించిన సేవలను గుర్తించి 1960 లో దాదాభాయి నౌరోజి మెమోరియల్ ఫెలోషిప్ పురస్కారం వీరికి లభించింది. ఆ సందర్భంలో గవర్నరు శ్రీ శ్రీ ప్రకాశ అధ్యక్షతన బొంబాయి విశ్వవిద్యాలయంలో వీరి ఉపన్యాసాలు జరిగాయి ఆ సందర్భాన వీరు వెలువరించిన ఆశయాలు, భావాలు విద్యారంగానికి వెలుగుదివ్వెలుగా కనిపిస్తాయి.

## విద్యారంగం ఎలా ఉండాలి ?

విద్యారంగం ఎలా ఉండాలి? విద్యాలయాల, విశ్వవిద్యాలయాల ప్రతిపత్తి ఏమిటి ? అన్న ప్రశ్నలకు వీరి భావాలు కనువిప్పు కలిగిస్తాయి

విశ్వవిద్యాలయాల స్వతంత్ర ప్రతిపత్తికి భంగం రాకూడదు. ఆ విధమైన సహకారం ప్రభుత్వం వల్ల నాకు లభించిందంటూ 19:7లో మద్రాస్ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవాన్ని గుర్తుచేసుకొని చెప్పిన మాటలివి—

"అట్టి విజయాన్ని సాధించడానికి విశ్వవిద్యాలయాలకు ప్రభుత్వ మందించిన స్నేహ, సహకారాలు అత్యాదరపూర్వకమైనవి ఇది రెండింటి అస్తిత్వానికి స్వతంత్ర పతిపత్తికి భంగమే కలిగించలేదు. స్వతంత్ర భారత రాజ్యాంగం కూడ విశ్వవిద్యాలయ స్థాయిని అస్తిత్వాన్ని, స్వతంత్ర ప్రతిపత్తిని సమర్థించింది. జాతీయ పర్యావరణానికి అనుకూలంగా శీల సమన్వితమైన విశ్వవిద్యాలయం నిలవాలంటే విశ్వవిద్యాలయాల స్వతంత్ర ప్రలిపత్తికి భంగం కలుగకుండా వుండడం అవసరం" అన్నారు

ఈనాడు అధికారంలో వున్నామనుకొని మంత్రులు, వారికి అనుకూలంగా సెక్రటరీలు, అసిస్టెంటు సెక్రటరీలు చీటికి మాటికి విశ్వవిద్యాలయ వ్యవస్థలో

చేయిదూర్చడం జరుగుతూంది. ఇది విచారకరం వైస్ ఛాన్సలర్ విధాన నిర్ణయం చేయడానికి వీరికంటే తక్కువకాదని గమనించడ మవసరం.

విద్యావిధానంలో మార్పు చేయాలనుకున్నా, విద్యాలయాల ప్రతిపత్తికి మాత్రం భంగం రాకూడదు. యోగ్యత, సామర్థ్యం వున్నవారు మంత్రులైనా తమకు నచ్చినట్లు, ఇష్టమొచ్చినట్లు క్షణాల మీద విధానాన్ని మార్పులు చేయడానికి సాహసించడం విద్యారంగం యొక్క ప్రతిపత్తికి భంగం కలిగిస్తుంది. సలహాలు ఇవ్వడం ఉచితం కాని, తామున్న కొద్ది కాలంలో వ్యవస్థ మార్చుటకు సాహసించడం సరియైనది కాదు, అన్నారు. వారి అభిప్రాయమిది-

It is not desirable that political chiefs, who are for the time being in charge of the departments, should be actively associated with any advisory bodies unless they be themselves experts in the particular type of education that is to be imparted through Universities when their association would be on considerations other than the mere accident of their being Ministers for the nounce.

విశ్వవిద్యాలయ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించాలంటూ—

"It is to be understood that the University is less responsible than a political chief who has no doubt many high ideals which must necessarily be in accordance with the desires of his political party. If a Govt., can by such a Govt - order run a coach and pair through the very acts that have been passed by a legislature, where is the safe guard for a University having even a semblance of University autonomy ?

.. . . . . .. . . . . . . . . . .. .. .. .. ..

.......... .. Is it not crystal clear that under such circumstances, with the varying fortunes of the political parties concerned or even of the ministries concerned or to go further, of the very ministries concerned, University Education will become a plaything of political forces and will of necessity be thrown to the marketplace for cheap experiments and disastrous changes" అన్నారు.

ఈ భావాలు నేటి రాజకీయ పెత్తందార్లకు కనువిప్పు కలిగించగలవు. తమ పార్టీ ప్రయోజనాలకు, తమ అస్తిత్వాలకు విద్యారంగాన్ని ఈనాడు రాజకీయాలు ఎలా బలిగొంటున్నాయో లక్ష్మణస్వామి మొదలియార్ వేలెత్తి చూపారు.

ఆల్ ఇండియా యూనివర్శిటీ టీచర్సు & స్టూడెంట్స్ క్యాంపు 1968 మే 19-25 తేదీల్లో జరిగింది. శ్రీ కె.ఎం. మున్షీ అధ్యక్షత వహించారు. డా॥ కొఠారి యూనివర్శిటి గ్రాంట్సు కమీషన్ ఛైర్మన్ ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూ డా॥ ఎ.ఎల్. మొదలియార్—

"ఈనాడు విద్యార్థుల్లో ఎందుకీ అసంతృప్తి? వారికి కావలసిన ఉన్నతమైన విలువలచే వారు వంచితులైనారు. దీనికి కారణం ఎవరు? కారణాలు అనేకం వున్నా - వారు స్వయంగా కూడా కారకులే ఏమైనాగాని యీ విషయాల్ని గూర్చి సమావేశం అయ్యారు. ఒకరినొకరు తెలుసుకోడానికి భాషా - ప్రాంతీయతా భేదాలు, సరిహద్దు తగాదాలు, నదీజలాల వివాదాలు, ఇంకా దేశాన్ని ముక్కలు గావించే సమస్యలన్నిటిని మరచి యిక్కడ చేరాం కావల్సింది యిదే. విద్యార్థులు మురాలు, వర్గాలు, భేదాలు అన్నిటిని విడచి, భవిష్యత్తుకోసం తమ భవిష్యత్తు, అనగా దేశ భవిష్యత్తు కోసం సమైక్యం కావాలన్నారు. దేశ సమైక్యతకు - ఏకాత్మీయతకు యిది అవసరం,

*　　　*　　　*

## ఆధార సామగ్రి

1. మున్సిపల్ హైస్కూలు, కర్నూలులోని పాత రికార్డులు.
2. కర్నూలు మునిసిపాలటి శత వార్షిక సంచిక
3. సత్యమూర్తి జీవితచరిత్ర·
4. **South India Politics**
5. 'హిందూ'లో శ్రీ సి సుబ్రహ్మణ్యం గారి వ్యాసం.
6. ఆంధ్రజ్యోతిలో శ్రీ ఏకాంబరాచార్యులు గారి వ్యాసం
7. భారతీయ విద్యాభవన్ పాత పత్రికలు
8. దాదాభాయి నౌరోజి స్మారకోపన్యాసాలు, శ్రీ ఎ ఎల్. మొదలియార్.
9. పూజ్యశ్రీ ఐ. చంద్రశేఖరశర్మ గారి అభిప్రాయాలు.
10. హరి సర్వోత్తమరావు జీవితం -మాదల.
11. శ్రీ బి.పి. శేషారెడ్డి జీవిత సంగ్రహం.
12. ఇంద్రావతి పాత పత్రికలు.

